

సంజీవిని ఫిలిమ్స్

# ప్రేమజీవులు

దర్శకత్వం K S R దాస్ నిర్మాతలు G రామం, చంద్రశేఖర్

## సంచికలో



ముఖచిత్రం : మదనకుతూహల రాగిణి

చిత్రకారుడు : [illegible] పాపయ్య


యువ సాలు చందా [illegible]. 18—00

దీపావళి ప్రత్యేక [illegible]తో రు. 23—00

యువ వరదప[illegible] [illegible]సు-26

**వినార్ సూటింగులు—షర్టింగులు, ఎన్నికకు ఎన్నెన్ని రకాలు !**

# ఎన్నెన్నో ఆకర్షణీయమైన రంగులు—అందమైన నూతనమైన డిజైనులు



## Estiel

ఎస్టీల్

00% టెరీన్ సూటింగులు

ఆకర్షించే నూతనమైన రంగులు, ఛాయలు డిజైనులు, "ఎస్టీల్"లో ఎక్కువ శాతం "టెరీన్ వుంది అది అందంగా, మీకు నచ్చేటట్లు వుంటుంది మీ యాపానికి కొత్త శోభనిస్తుంది ముడతల ఆకారం ఎప్పటికీ నిలిచి వుంటుంది "ఎస్టీల్"-డ్రిప్ డ్రై, కొద్దిగా ఇస్త్రీచేస్తే చాలును మడతలు నలగవు చాలకాలం మన్నుతుంది



## VINALIN

వినాలిన్

నిస్టైడ్ షర్టింగులు

వినాలిన్ బట్టలు కొత్తకొత్త డిజైనులలో నాణ్యమైన రకాలలో ఎప్పటికీ నిలిచే రంగులలో లేత ఛాయలలో చారలు-గీతలు గళ్లలో వస్తున్నాయి ప్రత్యేకమైన "పెర్మాప్రెస్ ఫినిష్ వలన వినాలిన్ బట్టలు హుందాగా, నిండుగా వుంటాయి, స్పర్శకు సుకుమారమైనవి ఎంత నలిగినా మడతలు చెరగవు వినాలిన్ బట్టలు తడిపినా తగ్గిపోవు

వినార్ లిమిటెడ్

కలకత్తా మద్రాసు బొంబాయి న్యూఢిల్లీ

V 6192 TEL

# లేఖలు

ఆర్యా,

ఫిబ్రవరి 'యువ'లో కథలన్నీ బాగున్నాయి 'హిమ' చాలా బాగుంటుంది. ఈ నవలెప్పుడు పూర్తవుతుందో మరి. ఈ సీరియల్ కొరకు ప్రతి నెలా నేను 'యువ' కోసం ఎదురు చూస్తుంటాను 'నువ్వే నాతోడు' 'పరాజయం' 'ఆత్మ విశ్వాసం' 'భయం' 'రాతిగుర్రం' 'సైకాలజీ' మొదలైన కథలు చాలా బాగున్నాయి.

కుమారి వి లక్ష్మి బి. ఎ. (ఓట్)
శ్రీకాకుళం.

ఫిబ్రవరి 'యువ'కు శరత్ బాబుగా 'రాముని బుద్ధిమంతనం' మరియు 'పిచ్చివాడి స్వర్గం' రెండూ రెండు కళ లాంటివి. కార్టూన్లు చాలా బాగున్నాయి 'షిఫాన్ చీర' మరియు 'ఒటన్న' లాంటి కథలకు ప్రాముఖ్యతను యిచ్చి ప్రచురిస్తున్న సంపాదకులకు కృతజ్ఞతలు చెప్పక ఉండలేక పోతున్నాను

వి వి గోపాల్ రెడ్డి, మచ్చబొల్లా (పి)

ఫిబ్రవరి 'యువ' సంచిక రెండవ కవరు పేజీలో ప్రచురితమైన వ పా. గారి 'బావపెట్టినబొట్టు' అనే చిత్రం న్యాచురల్‌గా అత్యాకర్షణీయంగా ఉంది. వ పా గారికి మీకు నా ప్రత్యేక ధన్యవాదములు. శీలం శెట్టి రమాదేవిగారి 'సైకాలజీ' కూడా బావుంది.—కె వి. నాగేశ్వరరావునాయుడు, నర్తురాజుపాలెం.

తాళికట్టినవాడు తనవాడు కానప్పుడు
తపించే హృదయంలోని రాగబంధమే పవిత్రబంధం!

అశోక్ మూవీస్

# పవిత్రబంధం

దర్శకుడు: వి.మధుసూదనరావు నిర్మాత: టి.గోవిందరాజన్

రచన: ఆరుద్ర సంగీతం: రాజేశ్వరరావు ఫోటోగ్రఫీ: కె.ఎస్.రామకృష్ణారావు



N KR



నవయుగ

సోల్ డిస్ట్రిబ్యూటర్స్: అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్

WITH 1968 CAME RAM AUR SHYAM

WITH 1969 NANNHA FARISHTA

**AND NOW** THE MASTER OF MASTERPIECES **B.NAGI REDDI**

PRESENTS THE GREATEST FAMILY FILM OF THE DECADE

# GHAR GHAR KI KAHANI



EASTMANCOLOR BY FILMCENTER

DIRECTION T PRAKASH RAO
MUSIC KALYANJI ANANDJI
DIALOGUE INDER RAJ ANAND

A FILM ABOUT YOU AND ME
A NOBLE FAMILY EPIC BOLD, UNUSUAL UNIQUE

A VIJAYA INTERNATIONAL FILM



# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 23 మార్చి—1971 సంచిక 3


ఎన్నికల సంరంభం ఆరంభమైంది. లోక్‌సభకు ఎన్నికలు దేశమంతటా మార్చి మొదటి వారంలో జరుగబోతున్నవి. మార్చి పదిహేనవ తేదీనాటికి, ఎన్నికల ఫలితాలు ప్రకటింప బడుతవి. దేశ పరిపాలన ఏదో ఒక పార్టీయే చేస్తుందో, రెండు మూడు పార్టీలు కలిసి చేస్తాయో అప్పుడు గాని తేలదు

అయితే, 1952 లో పార్లమెంటు ఎన్నికలు మొట్ట మొదటిసారిగా జరిగి నప్పటి నుంచీ ఇప్పటివరకూ జరిగిన నాలుగు ఎన్నికలలోనూ ఏ ఏ పార్టీలు మొదటి నుంచీ తమ బలాన్ని నిలబెట్టుకున్నాయో, లేక ప్రజాభిమానాన్ని పోగొట్టు కొన్నాయో పరిశీలిస్తే, జరుగబోయే ఎన్నికలలో ఏ పార్టీలు బలంగా బైట పడగలవో స్థూలంగా చెప్ప వచ్చును.

1952 లో పోలైన ఓట్లలో నూటికి 45 వంతులు కాంగ్రెసుకూ, 3.1 వంతులు జనసంఘకూ, 3.3 వంతులు కమ్యూనిస్టు పార్టీకి తక్కినవి ఇతర పార్టీలకూ వచ్చాయి. 1957 లో పోలైన ఓట్లలో నూటికి 47.78 వంతులు కాంగ్రెసుకూ, 5.93 వంతులు జనసంఘకూ, 8.92 వంతులు కమ్యూనిస్టు పార్టీకి, 10.41 వంతులు ప్రజాసోషలిస్టు పార్టీకి, తక్కినవి ఇతర పార్టీలకూ వచ్చాయి. 1962 లో పోలైన ఓట్లలో నూటికి 44.62 వంతులు కాంగ్రెసుకూ, 6.44 వంతులు జనసంఘకూ, 9.94 వంతులు కమ్యూనిస్టు పార్టీకి, 6.81 ప్రజాసోషలిస్టు పార్టీకి, 7.89 వంతులు స్వతంత్ర పార్టీకి, తక్కినవి ఇతర పార్టీలకు వచ్చాయి. 1967 ఎన్నికలలో 40.73 వంతులు కాంగ్రెసుకూ 9 41 వంతులు జనసంఘకూ 5 10 వంతులు మితవాద కమ్యూనిస్టు పార్టీకి,

4.21 వంతులు అతివాద కమ్యూనిస్టు పార్టీకి, 3.06 వంతులు ప్రజా సోషలిస్టు పార్టీకి 3.68 వంతులు స్వతంత్ర పార్టీకి, తక్కినవి మిగతా పార్టీలకు వచ్చాయి

పై వివరాలను బట్టి చూస్తే, కాంగ్రెసు పార్టీకి వచ్చిన ఓట్లు 1962, 1967 లలో అంతకుముందు వచ్చిన వానికంటె నూటికి సుమారు అయిదు వంతులు తక్కువ వచ్చాయి. అయితే, 1962, 1967 లలో స్వతంత్ర పార్టీ ఒకటి కొత్తగా వచ్చింది ఆ పార్టీకి, నూటికి 8 వంతుల ఓట్లు వచ్చాయి స్వతంత్ర పార్టీ, కాంగ్రెసునుంచి చీలిన నాయకులు స్థాపించిన పార్టీయే గనుక, కాంగ్రెసుకు రావలసిన ఓట్లు ఆ పార్టీకి వచ్చాయి. 1952 ఎన్నికలనుంచీ, ప్రతి ఎన్నికలో నూతన బలాన్ని పెంపొందించుకొని, క్రమక్రమంగా ఎక్కువ ఓట్లను సంపాదించుకుంటూ వచ్చిన పార్టీ జనసంఘ ఈ పార్టీకి 1952 లో నూటికి 3.1 వంతుల ఓట్లు వస్తే, 1957 లో 5 93 వంతులు 1962 లో 6.64 వంతులు, 1967 లో 9.41 వంతులు ఓట్లు వచ్చాయి.

కమ్యూనిస్టు పార్టీలో చీలిక ఏర్పడకముందు ఆ పార్టీ క్రమ క్రమంగా ఎక్కువ ఓట్లను సంపాదించుకుంటూ వచ్చింది. 1952 లో నూటికి 3.3 వంతులు, 1957 లో 8.92 వంతులు, 1962 లో 9.94 వంతులు ఓట్లు కమ్యూనిస్టు పార్టీకి వచ్చాయి కాని, 1967 లో చీలిపోయిన రెండు పార్టీలకు కలిపి 9.4 వంతుల ఓట్లు మాత్రమే వచ్చాయి. ఈ తగ్గుదల చాలా స్వల్పమే అయినప్పటికీ, యీ పార్టీల పట్ల ఓటర్ల సుముఖత కొంతవరకు తగ్గిందని చెప్పవలసిందే.

1967 లో పోలైన ఓట్ల సంఖ్యను చూస్తే, కాంగ్రెసు పార్టీకి 5, 93, 73, 384 ఓట్లు వచ్చాయి. జనసంఘకు, 1, 35, 60, 023 ఓట్లు వచ్చాయి. స్వతంత్రపార్టీకి 1, 24, 87, [illegible] వచ్చాయి. కాంగ్రెసు పార్టీ తరువాత క్రమంగా అత్యధికమైన ఓట్లు వచ్చిన పార్టీలు జనసంఘ, స్వతంత్ర పార్టీలు.

ఈ సంఖ్యలను బట్టి స్పష్టమౌతున్న విషయం ఏమిటంటే, 1952 నుంచి 1967 వరకూ మితవాద పార్టీలబలం మొత్తంమీద బలపడుతూవుంటే, అతివాద పార్టీల బలం తగ్గుతూ [illegible]దన్నమాట.

అయితే, [illegible] కాంగ్రెసుపార్టీ చీలిపోయి, అతివాద, మితవాద పక్షాలుగా ఏర్పడింది. [illegible] పార్టీలో చీలిక వచ్చిన తరువాత, పరిపాలన సాగించే అర్హతకు అవస[illegible] బలం లేకపోయినా, కమ్యూనిస్టు పార్టీ మద్దతుతోనూ, ఇతర చిన్న ప్రాం[illegible] మద్దతుతోనూ శ్రీమతి ఇందిరాగాంధి వర్గం, పరిపాలనను సాగించిం[illegible] జరుగుబోయే ఎన్నికలలో కూడా, శ్రీమతి ఇందిరాగాంధి వర్గం, ఎ[illegible]ర్గాండంలో అతివాద పార్టీలతోనూ, ప్రాంతీయ పార్టీలతోనూ ఒప్పందం [illegible]ది. అంటే, ఆమె పక్షాన ఎన్నికలలో నిలబడిన వారంతా

గెలవకపోతే, ఆమె ఒప్పందం కుదుర్చుకున్న వర్గాలలోని వారితో ఒక సమాఖ్య ఏర్పడి పరిపాలన సాగించాలన్న మాట.

అదేవిధంగా, పాత కాంగ్రెసు అనబడే శ్రీ నిజలింగప్ప వర్గము, స్వతంత్ర, జనసంఘ పార్టీలు కొన్ని స్థానాలను వదలివేసి, మిగతా స్థానాలలో పోటీ చేస్తున్నది. ఈ కాంగ్రెసు కూడా, మెజారిటీ బలం సంపాదించుకోలేకపోతే, స్వతంత్ర, జన సంఘ సభ్యుల కలయికతో మంత్రి మండలిని స్థాపించాలన్న మాట.

పటిష్టమైన ఒకే ఒక పార్టీ, మెజారిటీ బలంతో మంత్రి మండలిని ఏర్పాటు చేస్తే ఆ మంత్రి మండలి పూర్తిగా అయిదేళ్ళు పరిపాలన సాగించి తన విధా నాలను సరిగా అమలు జరుప గలుగుతుంది. రెండు, మూడు పార్టీల కలయికవల్ల మంత్రి మండలి ఏర్పడితే, ఆ కలయికలోనుంచి ఏ వర్గం వైదొలగినా, ఆ మంత్రి మండలి పడిపోవడమూ, స్థిరమైన ప్రభుత్వం లేదనే కారణంచేత మళ్ళీ మళ్ళీ ఎన్ని కలు జరుగుతూ వుండటమూ జరుగుతుంది.

అంచేత, ఓటు వేసే ప్రతివ్యక్తీకూడా, స్థిరమైన ప్రభుత్వం ఏర్పడాలనే కాంక్షతో, ఓటు వెయ్యడం అవసరం.

మంత్రి మండలులు మారడం, మళ్ళీ మళ్ళీ ఎన్నికలు జరగడం—వీటివల్ల పరిపాలన సవ్యంగా జరగకపోగా అభివృద్ధి కార్యక్రమాలు ఏమాత్రం అమలు జరుగకపోగా, కోటానుకోట్ల రూపాయలు వృధా వ్యయంఅయి, అభివృద్ధి కార్య క్రమాలకు డబ్బు చాలకపోవడమూ, ప్రజల నెత్తిన పన్నులు ఎక్కువగా పడుతూ వుండటమూ జరుగుతుంది.

ఈ విషయాలను దృష్టిలో వుంచుకొని సాంఘిక ఆర్థిక వ్యవస్థలు దెబ్బ తిన కుండా, దేశంలో అరాచకం ప్రబలకుండా పరిపాలన సాగించగల పార్టీ అధికారం లోకి వచ్చేటట్టు ప్రజలు ఓటు చెయ్యాలి. లేకపోయినట్లయితే, గత రెండు మూడు సంవత్సరాలలో కన్న దారుణంగా అరాచకత్వమూ, ఆర్థిక వ్యవస్థ వినాశమూ, రాబోయే సంవత్సరాలలో మనం అనుభవించ వలసివుంటుంది.

పవిత్రమైన, అత్యంతబాధ్యతా యుతమైన ఓటును ఎలా ఉపయోగించాలనే విషయం, అభ్యర్థులు కాని వారు ప్రజలకు బోధించాలి. అభ్యర్థులు ఎప్పుడూ తమ పక్షానే మాట్లాడుతారు. అభ్యర్థులు కానివారే, నిష్పక్షపాత బుద్ధితో యీ విషయాన్ని వివరించ గలుగుతారు.

మనకు ప్రస్తుతం కావలసినది, పటిష్టమైన ప్రభుత్వము. నినాదాలతో, ఆర్థిక వ్యవస్థను ధ్వంసంచేసే ప్రభుత్వం కాదు. ఇప్పటికైనా మనం మన సాంఘిక, ఆర్థిక వ్యవస్థలను కాపాడుకొనే పద్ధతిలో ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకోలేకపోతే, విపరీతమైన కష్ట, నష్టాలకు పాల్పడ వస్తుంది.


ఎక్కడ రాయమంటారు సార్?
ఊళ్లో ఒక్క గోడమీద కూడా ఖాళీ లేదు!




ముగ్గురు అన్నదమ్ముల కుటుంబం. పెద్దాయన గోరక్‌నాథ్, భార్య స్వర్ణమంజరి. రెండవతడు ప్రియనాథుడు, సతి దుర్గామణి. చివరివాడు అనాథనాథ్. ఇతడి పెళ్ళాం అందరికంటె చిన్నావిడ.

గోరక్‌నాథ్ పోయాడు. స్వర్ణమంజరి పుట్టింటివారివంశం నిర్వంశమయిపోయింది. అందుచేత అక్కడున్న కొద్దోగొప్పో ఆస్తి తెగించి చేసుకువచ్చేసి, ఆవిడ చిన్నమరిది అయిన అనాథ్‌తో కలిసివుంటూ, కాలక్షేపం చేస్తూంది.

* * *

"ఎవరదీ? నువ్వా, రా నాయనా! అతుల్!" అంటూ, దుర్గామణి వంటింటోంచి ఇవతలికి వచ్చింది. అతడామె పాదాలకు వందనం చేశాడు. "సుఖీభవ! దీర్ఘాయుష్మాన్‌భవ!" అని దీవించింది.

"అత్తా! అమ్మ ప్రసాదం పంపింది. ఇదిగో!" అని చెప్పిఇచ్చాడు, అతుల్.

"ఒసేయ్, జ్ఞానదా!—అతుల్‌దాదా వచ్చాడే. అతడికి పీట వేసి, ఈ ప్రసాదం లోపలికి పట్టుకెళ్ళు" అంది.

"రాత్రి పదిగంటలకి గుర్రబ్బండీ చప్పుడయితే, ఎవరు వచ్చారా అనుకున్నాను. మా వదిన వచ్చిందని తెలిస్తే వెంటనే వెళ్ళి నమస్కరించకపోదునా? అలాంటిమనిషి లోకంలో వుంటుందా, అసలు? అమ్మ కులాసాయేనా, నాయనా? ఈ రావటం పూరీ నుంచేనా?—" అనడిగింది దుర్గ.

తల్లి పిలుపు వినగానే పదమూడేళ్ళ నల్లటి పిల్ల పీట తీసుకొచ్చింది. వీలయినంత వరకు తల వంచుకుని, వసారాలో పీటవేసి, అతుల్‌పాదాలకు నమస్కరించింది. ఒక్కమాట మాటాడలేదు, తలెత్తి పైకి చూడలేదు. ఆ ప్రసాదం తీసుకు తక్కా వెళ్ళిపోయింది. అయితే—వెళ్ళేటప్పుడు ఆ అమ్మాయి, పెదవుల్లోంచి వచ్చే నవ్వు అణుకుని వెళ్ళిందని మాత్రం తెలుస్తుంది.

పిల్లమీది దృష్టి కొంచెం ఇటువేపు మళ్ళిస్తే, అందమైన ఆ యువకుడి ముఖం పైన కూడా ఒక కాంతి తళుక్కున మెరిసి మాయమైనట్టు కనిపిస్తుంది.

అతుల్ తండ్రి గవర్నమెంటు నవుకరు పింఛన్ పుచ్చుకుంటూ మంచి ఆస్తి సంపాదించిపెట్టి నాలుగేళ్ళనాడే పోయాడు.

అతుల్ బి ఏ పరీక్షకి వెళ్ళి రెణ్ణెల్లయింది. ఇప్పుడు సెలవలు. అందుకని తల్లిని వెంట బెట్టుకుని పూరీ, జగన్నాథం, రామేశ్వరయాత్రలు చేయించి, రాత్రిరే తిరిగి వచ్చాడు.

కాశీవెళ్ళి, విశ్వేశ్వర్ దర్శనమయినా చేసుకుందామంటే పడిందికాదంటూ దుర్గామణి నిట్టూర్చింది.

"ఒక్కసారిగా బంధాలు తెంచుకు బయటపడితే తప్ప యాత్రలు కొనసాగవు, అత్తా!—బలవంతాన తీసుకెళ్ళబట్టిగాని, లేకపోతే మా అమ్మ ప్రయాణం మట్టుకి సాగేదనుకున్నావా?" అని ఊరడించాడు అతుల్.

"బలవంతానమాత్రం ఎలా నాయనా!— ముప్ఫై ఏరూపాయల జీతంలో ఖర్చు వెళ్ళమార్చుకునీ, డాక్టరుబిల్లులు చెల్లించుకునీ, ఇంకేం మిగుల్తుందో నువ్వే చెప్పు. పిల్ల చూదామా అంటే పదమూడో యేడు వచ్చిపడింది. నిజం చెబుతున్నా అతుల్!- అది నాకు శత్రువు నే కని పెంచడంలా వుందిసుమా!" అంటూ జలజల కన్నీళ్ళు రాల్చింది.

"ఆడపిల్ల మీకే పుట్టిందా అత్తా!—మరెవరికీ లేరా? ఎందుకీ దిగులూ?" అన్నాడు అతుల్.

"వట్టి దిగులేకాదు, అతుల్! మరణబాధ! లోకంసంగతి తెలుసుగా? ఆడపిల్లకి పెళ్ళిచెయ్యకపోతే జాతిపోతుంది కాని ఎలా? డబ్బెక్కడ్నించి వస్తుంది? మా ఉన్నదల్లా ఈ యింటో భాగంమట్టుకేగా?" అంటూ వలపోసుకుంది. అరగంట కిందటే భార్యాభర్తలు ఈ పెళ్ళివిగురించే వాదం వేసుకున్నారు. భర్త భోంచేస్తున్నవాడల్లా మధ్యలో లేచి వెళ్ళిపోయాడు ఆఫీసుకి.

ఆడపిల్లని కన్న ఈ బాధతో దుర్గమనస్సు తొలిచివేస్తూంది. ఎడతెరిపి లేకుండా ఒకే దుఃఖం. నల్లటి పిల్లని ఎవరు చేసుకుంటారు సంఘంలో. ఎవరు ఆశ్రయమిస్తారు? అందం చూస్తారుగాని, కులశీలాలు ఎవడి క్కావాలి?—నల్లటిరంగుతో తన కూతుర్ని పుట్టించిన భగవానుణ్ణి శతవిధాల ఆడిపోసింది దుర్గామణి.

"నల్లటిపిల్లకి పెళ్ళే కాదా? తుమ్మెద నలుపు, కోకిల నలుపు. వాటికి ప్రపంచంలో ఎంత ఆదరణ వుంది?" అంటూ దృష్టాంతం చెప్పాడు, అతుల్.

దృష్టాంతాలయితే చిరకాలంనించీ శాశ్వతంగా వుంటున్నాయిగాని, వాటివల్ల వీస మెత్తయినా ప్రయోజనం లేదన్నది, దుర్గ. ఇలా పెళ్ళికాని కూతుళ్ళను గురించి తల్లులుపడుతున్న యాతనలు తనకు స్వానుభవంగా తెలిసిన వెన్నెన్నో ఏకరుపెట్టింది. చివరికిలా కోరింది, అతడి రెండుచేతులూ పట్టుకుని:

"ఈ రోజుల్లో మీలాంటి యువకుల్లోనే దయాధర్మాలున్నాయని చెప్పుకుంటారు. మీ కాలేజీ కుర్రాళ్ళల్లో ఎవరైనా దీనిక్కాస్త చోటిస్తారేమో చూడు, బాబు! ఎవరైనా వప్పుకుంటే, నేను చచ్చేదాకా వాళ్ళకి దాసిగా వుంటాను" అన్నది.

"ఎందుకింత ఆదుర్దా అత్తా? నేచెబుతాగా"—అన్నాడు అతులుడు. జాలికొలిపే కంఠస్వరంతో. అన్నాడుకాని, ఖరారుగా మాట ఇవ్వలేకపోయాడు. ముఖం ఎర్ర బడింది. ఇది గమనించలేదు దుర్గ. మరొకళ్ళయితే, ఏదో విసురుగా చెప్పబోయి ఎందుకు అక్కడితో ఆగిపోయాడా అని సంశయపడేవాళ్ళే.

లేచి నిలబడి, "సరే గట్టిగా ప్రయత్నిస్తా" నన్నాడు.

"ఎక్కడ, జ్ఞానదా! కాస్త వక్కా ఆకూ ఇచ్చిపో!" అని పిలిచాడు.

దౌర్భాగ్యురాలికి అందం లేనట్టే తెలివితేటలూ లేవు అని తల్లి విచారించింది. "తప్పున తీసుకురా!" అని కేకవేసింది.

"నేనేవెళ్ళి తెచ్చుకుంటాలే, ఎక్కడుందీ జ్ఞానదా?" అంటూ అతుల్ పడక గది లోకి వెళ్ళాడు. తల్లిచెప్పిన మాట చెప్పి, "దీన్ని అరవై యేళ్ళ వాడికయినా ఇచ్చి చెయ్యాలన్నది అత్త" అన్నాడు.

జ్ఞానదా బదులు చెప్పలేదు. తల వంచుకునే సున్నంరాసిన రెండాకులు మడిచి వేళ్ళలో పెడుతూంది.

వెనకాలే వచ్చి అతులుడు ఆ మడిచిన ఆకులు తీసుకున్నాడు. "తాంబూలం బాగా ఉంటే అరవై ఏళ్లు తగ్గించి, ఇరవై ఇరవై రెండేళ్లవాణ్ణి చూస్తా" నన్నాడు.

తల మరీ కిందికి వంచుకుంది జ్ఞానద. "ఇహ వెళతాను" అన్నాడు అతుల్. దీనికీ జవాబు చెప్పలేదు. ఎలా ఉన్నది అలాగే ముడుచుక్కూర్చుంది.

"మాటాడవన్నమాట? సరే!" అని అతులుడు పిల్లనెత్తిన చిన్న మొట్టు మొట్టాడు. "హరిచక్రవర్తిలాంటి ఒక ముసిలివాడు గనక వస్తే—" అని, "వెళుతున్నా" నంటూ నవ్వుతూ బైటికి వచ్చేశాడు.

ముందువాకిట్లోకి రాగానే "అత్తా! బొంబాయినించి అమ్మ గాజులజత తెచ్చింది చూడూ, జ్ఞానదాకోసం!" అని కేకేశాడు. వచ్చి చూసింది దుర్గామణి. ఆ పనితనం అదీ చూసి, అమిత సంబరపడిపోయి తెగపొగిడింది. ఇలాంటి నగలు ఆ నాటికింకా మహాపట్టణాల్లోకూడా అరుదే కనుక, ఈ అపురూపమైన జతను మెచ్చుకుని, అతులుడే బొంబాయితో కానుకొచ్చాడు.

తల్లి పిలవగా జ్ఞానదా ఇవతలికి వచ్చింది. నిశ్శబ్దంగా తలవంచుకుంది. తొలుతగా ఈ ప్రేమ కానుకను చేతులు రెండూ అంజలి పట్టి అందుకుంది. అయితే, పిల్ల దాని చేతులు వణికాయి. తరవాత అవిచ్ఛిన్న అనయుకి పాదాలకు వందనం చేసి, మెల్లిగా వెళ్ళిపోయింది. ఒక్కమాటయినా పలకలేదు. కాని, ఇవ్వాళ ఆమె మనస్సులో సంగతి ఆ భగవాన్‌కే తెలియాలి. మరెవళ్లూ తెలుసుకోలేరు!—

## 2

పెద్దాయన పోయినప్పట్నుంచీ స్వర్ణమంజరి చిన్నమరిదితో కలిసివుంటూందని మనకి మొదటే తెలుసు. రెండో అతను ప్రియనాథుడికీ ఆఖరివాడయిన అనాథ్‌కీ పడలేదు.



పేచీవచ్చింది అంచేత ఇంటో భాగం పంచుకుని నడివాకిట్లో మధ్యని అడ్డంగా గోడ పెట్టుకున్నారు గోడపెట్టి ఏడాది తిరక్కుండానే వారం రోజులు జ్వరంతో ప్రియనాధుడు మరణించాడు

ఇహా రేపు పోతాడనగా—ఆశవదులుకుని ఊళ్లోఅందరూ చూడ వచ్చారు ప్రియనాధుడి కింకా స్పృహ తప్పలేదు కలకత్తాలో ఉన్న అతులుడు ఈ వార్త వినగానే ఇవ్వాళ పరుగెత్తుకొచ్చాడు

అతడు గుంపును తీసుకుని, రోగి మంచం దగ్గరికి వెళ్లాలని తొందర పడుతూం డగా ఎక్కణ్ణించి వచ్చిందో, జ్ఞానదా పిచ్చిదానిలాగా అమాంతం వచ్చి అతులుడి కాళ్ళ మీద పడింది. తల బాదుకుంటూంది.

తలవని తలంపుగా ఈ దృశ్యం చూసి, ఆ వచ్చినవాళ్ళకి ఆశ్చర్యం కలిగింది అనుమానం వేసింది. ఇంతమంది ఎదట అతులుడికి సిగ్గుతోనూ విచారంతోనూ ఏమీ తోచలే.

అతికష్టం మీద మామూలు స్థితికి వచ్చాక ఆమెను లేవదీశారు. కాని జ్ఞానదా మళ్ళీ అతడి పాదాలమీద తల ఆనించి, ఇలా ఏడ్చింది :

"నా అదృష్టం ఎలావుండనీ. ఈ మరణసమయంలో నాన్నకి నీ నోటి మీదుగా ధైర్యమిచ్చే మాటలు చెప్పు. నన్నూ, నాతోపాటు నన్ను గురించిన దిగులూ ఇక్కడే వదిలేసి మనశ్శాంతితో వెళిపోతాడు. ఇదే నిన్ను నే కోరేది. ఇంతకంటె మరేమీ కోరను........."

ప్రియనాథ్ మనస్సు దిగులుతో, విచారాలతో కుళ్ళిపోయింది. కనక నే, అకాలంలో చావు వచ్చింది.

జ్ఞానదకు మన ధ్యాస, మన గొడవ లేదు. ఇంతమంది ఎదట ఏమంటూందో ఏం చేస్తూందో అనే ఆలోచనే లేదు. అలా తలబాదుకుని ఏడుస్తూనే వుంది

అతులుడు నిగ్రహం కలవాడు. కుతూహలంతో చూస్తున్న ఇంతమంది లోకుల ఎదట—ఇహ యిది పనికాదని—కాఠిన్యం పూనాడు, బలవంతాన పాదాలు వెనక్కి లాక్కున్నాడు. ఆమెను మందలిస్తూ, "ఛీ—ఏడవబోకు. నే చెప్పవలసిందేదో ఎందుకు చెప్పనూ?" అంటూ ఆయన మంచం మీదికివెళ్ళి ఒకపక్కన కూర్చున్నాడు

భర్త తలవేపున వున్న దుర్గామణి అతులుణ్ణి చూసి, కుమిలి కుమిలి ఏడుస్తూంది

పొరుగున ఉండే నీలకంఠచటర్జీ వచ్చి గుమ్మంలో నించున్నాడు. "ప్రియనాథు డింకా తెలివితప్పలేదు, బాబూ! చెప్పవలసిందేదో గట్టిగా వినపడేట్టు చెప్పండి, నబడు తుంది!" అన్నాడు. ఈ సలహాను మరికొంతమంది అవునన్నారు.

ఈ జనాన్ని చూస్తే అతులుడికి కోపం వచ్చింది: "మీరంతా ఇక్కడ గుంపుగా చేరితే ప్రయోజనమేం లేదు. కాస్త తప్పుకుని అవతలికి వెళ్లారంటే, నే చెప్పవలసిం దేదో చెబుతాను" అన్నాడు, అతులుడు.

అందుకు నీలకంఠుడు ఇలా అడిగాడు : "ప్రయోజనం లేకపోవడ మేమిటయ్యా! ఆపద సమయంలో ఇరుగువాళ్లూ పొరుగువాళ్లూ రాకుండావుంటారా?— ఏం ఉపకారం చేదామని వచ్చి నువ్వు మంచంమీద కూర్చున్నావు, బాబూ! ఏమిటి సార్థకం?'



అతులుడు మండిపడుతూ లేచి నిలబడ్డాడు: "నేను ఉపకారం చేస్తానో చెయ్యనో— కాని, మీరంతా గాలిరాకుండా అడ్డుగా నిలబడితే మాత్రం నే సహించను. తప్పుకోండి!—" అన్నాడు, కసురుతూ.

వృద్ధుడయిన నీలకంఠం ఈ వైఖరి చూసి కాస్త వెనక్కి తగ్గాడు: "నిన్నటివాడివి నువ్వు. ఇంత అహంకారం దేనికోయ్?" అన్నాడు. ఆ వెనకాల ఒకాయన "బి. య్యే. ప్యాసయ్యాడు కదటండీ, అందుకినీ...." అని హేళన చేశాడు.

ఎవళ్ళకీ జవాబు చెప్పలేదు అతులుడు. కాని, వెటకారం చేసిన పెద్దమనిషిని ఒక్కతోపు తోశాడు. అతడు పోయి ఇంకొకడిమీద పడ్డాడు. వేళాకోళం చేసినవాడు

అందర్నీ తిట్టుకుంటూ అవతలికి నడిచాడు. పీలకంతుడు మొదలైనవారు కూడా ప్ర లాభం లేదనుకుని, అతులుణ్ణి నిరసిస్తూ వెళ్ళిపోయారు.

ఇంకెవ్వరూ బయట లేకపోవటం చూసి, అతులుడు రోగిముఖం మీదికి వంగాడు "మామా!" అని పిలిచాడు. చూస్తూ ఊరుకున్నాడు ప్రియనాథుడు. మళ్ళీ గట్టిగా "నన్ను గుర్తుపట్టావా?" అన్నాడు అతులుడు. కళ్లుమూసుకుని ప్రియనాథ్ అస్పష్టంగ అన్నాడు "అతుల్!"—

"ఎలా వుందిప్పుడూ?"

"ఏం బాగా లేదు" అంటూ తల అడ్డంగా వూపాడు, ప్రియనాథ్. అతులుడి కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగాయి.

అతికష్టంతో, ఎంతో ప్రయత్నించి, గొంతు సవరరించుకుని ఇలా అన్నాడు అతులుడు: "మామయ్యా!—నిశ్చింతగా వుండండి. జ్ఞానద భారం నాదీ!—"

ఈమాట అర్థంకాలే, ప్రియనాథుడికి. అటూ ఇటూ చూసి, "ఏదీ, జ్ఞానద?" అనడిగాడు.

భర్త ముఖంమీదికి వంగి, రోదిస్తూ దుర్గామణి "జ్ఞానదను చూస్తారా?" అన్నది. మొదట ఏమీ అనలేదు. ప్రియనాథుడు. తరవాత "ఊఁ—" అన్నాడు.

"మన జ్ఞానద భారమంతా నాదే అని చెప్పాడు అతుల్. మీరింక దిగులుపడకండి. అమ్మాయిని ఒక్కమాటు దగ్గరికి పిలిచి దీవించండి!" అన్నది, ఏడుస్తూ దుర్గ.

"ఏమీ అనకుండా, చూస్తూ ఊరుకున్నాడు, ప్రియనాథుడు, ఈమాటలే మళ్ళీమళ్ళీ చెప్పింది దుర్గామణి. ఈమాటు అతడి కళ్ళవెంట రెండు నీటిబిందువులు రాలాయి. నీరసంగా ఉన్నచేతిని అతికష్టంతో పైకెత్తి, అతులుడి బుగ్గలు నిమిరాడు. మళ్ళీ తిరిగి పడుకున్నాడు. ఆయన నోటిమీదుగా ఒక్కమాటయినా పైకి రాలేదు. అయితే ఈ అవసానకాలంలో ప్రియనాథ్ ఒక భారాన్ని దించుకున్నట్టు మాత్రం అతులుడు గ్రహించాడు. ఆ తక్షణమే ఒక పసిపిల్లాడిలా ఏడ్చేశాడు. ఈ దృశ్యం కంటితో చూసిన సాక్షులు ఇద్దరే ఇద్దరు—ఇక్కడ దుర్గామణి, అక్కడ భగవానుడు!

ఆ మర్నాడు సాయంకాలమే—ఈ లోకపు మమకారాలన్నీ వదులుకుని,ఎటువంటి చికిత్సాలేక శిథిలమైన దేహాన్ని వదిలేసి, నారాయణ స్మరణ చెవులారా వింటూ, విష్ణు లోకానికి వెళ్ళిపోయాడు ప్రియనాథుడు.

## 3

వెల్లాలో వున్న అడ్డగోడకు అనాథనాథ్ ద్వారం పెట్టించటం తప్పనిసరి అయింది.

పెద్దన్నగారి తిథి జరిగిన పదిరోజుల తరవాత ఒకనాడు —




ఆఫీసు కిహ వెళతాడు. గుమ్మంలో నిలబడి తాంబూలం నములుతూ, చిన్నవదినతో ఇలా చెప్పాడు.

"అన్నయ్య నాతో విరోధపడినా నేను పట్టించుకోలేదు. ఒకపూట నీకు పట్టెడన్నం పెట్టడమనేది నాకేమంత కష్టంకాదు. కాని, ఇంత పెద్దపిల్ల పెళ్ళిబాధ్యతమాత్రం నేమొయ్యలేను. నాజీతం లెక్క పదహారు రూపాయలని తెలుసుగా? పిల్లా జెల్లాకూడా తక్కువేం కాదు. అదీగాక మా అమ్మాయికూడా పన్నెండో యేడు వచ్చింది. చూస్తున్నావుగా! కనుక, నువ్వు పిల్లని తీసుకుని నీ అన్నగారింటి కెళ్ళడం అన్ని విధాలా మంచిది. నువ్వు ఇవన్నీ గ్రహించేవుంటావు. అయినా చెప్పక తప్పనిసరి అవుతూంది. వదినా!"

వంటింటో స్తంభాన్ని ఆనుకుని వింటున్నది దుర్గామణి. భయంతోనూ, సంశయంతోనూ ఇలా జవాబుచెప్పింది; "నా అన్నగారి స్థితిగతులు నీకు తెలియనివి కావు మరిదీ! ఇంత ఆపద వచ్చిందని తెలుసుకదా, చూట్టానికయినా వచ్చాడా ఒక్కమాటు? అతడు వచ్చి తీసుకువెళ్ళందీ, నా అంతట నేను ఏమొహం పెట్టుకువెళ్ళేదీ? నువ్వే చెప్పు!"

పెద్ద తోడికోడలు స్వర్ణమంజరి మరిదిపక్కన గోడవాటునే వుంది. గొంతు హెచ్చింది ఇలా అంది: "మీ అన్నగారి స్థితిగతులు తెలుసులేవమ్మా. కాని మీ మరిది మాత్రం కలెకటేరా? తెచ్చేవి పదహారు టింగులేగా?—అయినా, ఈ సంసారం ఎలా నడుపుతున్నానో నాకు తెలియాలి, ఆ భగవంతుడికి తెలియాలి. అదీగాక—నీకు బరువు ఈ నల్లపిల్ల ఒకర్తె వుందిగా?—నిన్ను బతిమాలి ఆవిడగార్ని తీసుకెళ్ళి ఎవళ్ళింటో చోటిస్తారు, చెబుమా. అలా అని పౌరుషాలూ అభిమానాలూ పెట్టు కూర్చుంటే సాగదుస్మా!"

"నాకేం పౌరుషాలూ, అభిమానలూ లేవక్కా!" అన్నది వినయంగా దుర్గామణి.

అప్పుడు స్వర్ణ తన మరిదిని కుడిచేత్తో వెనక్కిలాగి, తను ముందుకి వచ్చింది:

"నేనేం తప్పుమాట చెప్పలేదమ్మా నీకు చెల్లీ! ఇంతకంటే హితవు చెప్పేవా రెవరొస్తారో, మరి. నీ క్కోపమొచ్చినా సరేగాని ఒక్కమాటంటాను— మీ పెద్ద అమ్మాయి వుందే, అతిలోకసుందరి—ఆవిడగారి పెళ్ళిగొడవమాత్రం మామీద పెట్ట బోకు. మావల్లకాదు. పిల్లముఖం ఒక్కసారి చూసినవాళ్ళు మళ్ళీ తిరిగిచూడరుగా?- అందుకని, చెల్లెమ్మా! నే చెప్పే సలహా యేమిటో తెలుసా?—ఆ అందానికి తోడు, ఎలాగో అలా మీ అన్నగారి దగ్గిరే చేర్చావంటే, ఆ పల్లెటూళ్లో ఏ వ్యవసాయం చేసుకునేవాడికో అంటగట్టొచ్చు, నీ యిబ్బంది తీరిపోతుంది. అక్కడ వాళ్ళుట, పిల్ల అందం చందం చూడరుట. ఆడపిల్లలయితే నాయట వాళ్ళకి. చాలామంది చెప్పగా విన్నా" నన్నది.

ఏమంటుంది దుర్గ?—మౌనంగా ఉండిపోయింది. ఈ పెళ్ళిపెటకం కారణంగానే లోగడ ఇల్లు వాటావేసుకోవటం జరిగింది. ఇప్పుడు మళ్ళీ ఆ విషపువంతాలే మొలుచు కొస్తున్నాయి కాబోలు భగవంతుడా అని భయపడుతూ, ఆమె కొయ్యబారిపోయింది.

"ఎవళ్ళేమైనా, ఆ నిందించేదేవో నన్నే నిందిస్తారుగాని నిన్నెవరూ ఏమీ అనరుగా?—అందరూ బాహాటంగా నన్నే ఆడిపోస్తున్నారు. అమ్మాయికి ముప్ఫై య్యేళ్లు దాటితేగాని అల్లుణ్ణి తీసుకురారా యేం? అని అంటూ," స్వర్ణమంజరి మరిదిని మందలించింది.

"పోయి మీ అన్నయ్యను పట్టుకో. ఎక్కడో అక్కడ ఏదో సంబంధం చూపి ముడెట్టిస్తాడు. నిన్ను ఎవరూ ఏమీ అనరు. నువు సిగ్గుపడాల్సిందీ వుండదు. రేపు మంచిరెప్పుడో చూసి బయల్దేరు" అని దుర్గను తొందరపెట్టింది, స్వర్ణ.

ఒక్కసారి దుర్గకు అతులుడి సంగతి గుర్తుకొచ్చింది. అయితే ఎదురుగా ఏమనటానికీ వీల్లేదు. ఎందుకంటే, స్వర్ణనుబట్టే అసలు అతులుడి చుట్టరికం.



స్వర్ణమంజరి అతులుడి తల్లికి మేనమామ కూతురు.

ఆరోజున జ్ఞానద అతులుడి కాళ్ళమీద పడి ఏడవటం చూసింది, తల్లి. కాని, ఇందులోవున్న ప్రత్యేక అర్థం ఆమెకు బోధపడలేదు. ఇంటోకి వెళ్ళిచూస్తే, కూతురు మాటాడక కింద కూర్చునివుంది. మెల్లి గా తల్లి దగ్గిరకి వచ్చి, "అవిడ ఏమందో విన్నావా?" అనడిగింది.

"ఊహూఁ" అంటూ తల తిప్పేసింది. ఏంచెప్పాలో ఏంతోచలే. అప్పుడు కూతురే ఇలా అడిగింది: "అమ్మా!—ఎప్పుడూ పుట్టింటికి వెళ్ళవాయె. ఇప్పుడయినా ఒక్కమాటు పోయిరాకూడదూ?"

"ఇంటిదగ్గిర నాకు అమ్మ అంటూ లేదుకదా. మనసంగతే ఎన్నడూ పట్టించుకోడు అన్నయ్య. ఇంత ఆపద వచ్చినందుకు ఒక్క ఉత్తరం ముక్కయినా రాశాడుకాదు. మనంతట మనం ఏమని అక్కడి కెళ్ళేది నువ్వే చెప్పుతల్లీ!" అన్నది దుర్గామణి.

"అమ్మా!—పేదవాళ్ళ గొడవ ఎప్పుడైనా ఎవరు పట్టించుకుంటారూ? అలాగే మీ వాళ్ళున్నూ. కాని, వీళ్ళు మనల్ని వెళ్ళిపొమ్మనికూడా అంటున్నారు. ఇంకా అభిమానమెందుకూ? అన్నీ నాన్నతోటే పోయినై. పద, పోనీ అక్కడికే పోదాం." అని సలహాచెప్పింది కూతురు.

తల్లి కళ్ళవెంబడి నీళ్ళు రాలాయి.

ప్రేమతో కూతురామె కళ్లు తుడుస్తూ ఇలా అంది.

"నామూలానే నువ్వెక్కడికీ వెళ్ళలేకపోతున్నావన్న సంగతి నాకు తెలుసునమ్మా!

లేకపోతే, పెద్దమ్మ అంతమాట అన్నాక క్షణమైనా నువ్విక్కడ ఉండగలిగేదానివా? నాకోసమని నువ్వేం దిగులుపెట్టుకోకమ్మా! పద, కొన్నాళ్ళపాటు అక్కడికే పోయి వుందాం. వీళ్ళు పెట్టే శాపనార్థాలకి నువ్విక్కడుంటే చచ్చిపోతావ్."

మరి ఉండబట్టలేకపోయింది తల్లి. కూతుర్ని కావిలించుకుని వెక్కి-వెక్కి ఏడ్చింది. తల్లి గుండెమీద తలచేర్చి, మాటాడక్కూర్చుంది కూతురు.

కాస్సేపయాక దుఃఖంలోనించి తేరుకుంది దుర్గ. "నిజం చెబుతున్నా జ్ఞానదా!— నువు లేకపోతే, రెండు కళ్ళూపోయిన రోజునే ఆయనతోపాటు నేనూ పోయేదాన్ని. నిన్ను చూసే నే పోలేకపోయాను" అన్నది.

"అయితే, నాకో విషయం నిజం చెప్పుతల్లీ!—" ఆ రోజున అతులు దేందుకు అలా అన్నాడు? మొహం చాటుచేసుకోకు. సిగ్గుపడాల్సిన సమయం కాదిది. అతులుడు ఉత్తమాటలు చెప్పేవాడు కాడని నాకు తెలుసు. [మరి, మీ నాయన పోతారనగా అలా ఎందుకు ధైర్యం చెప్పివెళ్ళాడూ? నువ్వెందు కతడి పాదాలమీద పడి యేడ్చావ్? నిజం చెప్పూ!"

తల్లి హృదయంలో తలదూర్చి, "నాకు తెలియదమ్మా!" అంది జ్ఞానద, అస్పష్టంగా.

రెండు చేతులతోనూ ఎత్తి బలవంతంగా కూతురిముఖం చూడాలనుకుంది దుర్గ. కూతురు అలాగే బలవంతంగా తల వంచుకూర్చుంది. కనుక తల్లి ప్రయత్నం విఫలమైపోయింది.

"మీ నాన్నే గనక బతికివుంటే నాకీ ఆలోచనే అక్కర్లేదు." అంటూ దుర్గ తొందరతో కూతురిచేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుని, "ఇన్నాళ్ళుగా నేను వత్తి కలలు కనటం లేదుగదా?" అనడిగింది.

ముఖం దాచుకునే, చెప్పింది జ్ఞానద! నాకేం తెలుస్తుందమ్మా! ఆయన నెరవేర్చ వలసిన ధర్మం ఆయనది!"

"నన్ను సంశయంలో పెట్టి వేధించకు తల్లీ!— నీ నోటిమీదుగా ఒక్కమాటు చెప్పు, మీ నాయనకోసం భారం తీరేట్టు ఏడ్చేస్తాను. నా దుఃఖాన్ని ఇప్పుడు వినగలుగుతా రాయన" అన్నది దుర్గ.

"నేనెప్పుడూ నిన్ను ఏడవొద్దన్లేదుగా అమ్మా! ఈ యేడుపు నాన్నకి తెలియజెబుదా మనుకున్నాను. స్వయంగా అతడే వెళ్ళి చెప్పాడుగా? ఇహ అతడిధర్మం అతడిది!" అని చెప్పింది కూతురు.

ఈమాటు దుర్గామణి కూతురి ముఖాన్ని ఎత్తిపట్టుకుని వెయ్యిసార్లు ముద్దెట్టుకుంది.



మాటిమాటికీ ఆమెను గుండెకు హత్తుకుంటూ, ఎంతోసేపు కన్నీళ్ళు రాల్చింది. తరవాత కన్నీళ్లు తుడుచుకుని, "నిజమే తల్లీ!—నువ్వన్నమాట నిజమే. అల్లుడికి మారేణ్యాయుష్షు!—అతడి ధర్మం అతడిదే!—

"అతణ్ణి నువ్వు చావునుంచి తప్పించినంతవరకూ ఈ సంగతి మా కెవ్వరికీ తోచనేలేదు. ఆయేడు ఎక్కడ చూసినా జబ్బులే. ముందు తల్లి పోయింది, తరవాత అతడికీ పట్టుకుంది. అల్లుడు బతుకుతాడనే ఆశ ఎవళ్ళకీ లేకపోయిందికూడా. అందరికీ భయమే. ఒక్కళ్ళూ దగ్గిర కెళ్ళలేకపొయ్యారు. అలాంటి సమయంలో—చిన్నపిల్లవే అయినా, రాత్రింబగళ్ళు కనిపెట్టుకునుండి, యముడితో యుద్ధంచేసి అతణ్ణి బతికించావ్. మరి—అతడిధర్మం అతడు నెరవేర్చుకోడూ? సావిత్రిదేవిలాగా, ఎవరినయితే యముడి పాశాలనుంచి నువ్వు విడిపించుకువచ్చావో, అతణ్ణి—నిన్ను

కాదని—భగవంతుడు మరో స్త్రీ చేతికి అప్పగిస్తాడా? ఈపాటి ధర్మమైనా లోకంలో నడవకపోతే, ఇహ సూర్యచంద్రాదులు ఎలా ప్రకాశిస్తారు?" అంటూ తన మనస్సులో మాటలను వెలిబుచ్చింది.

కాస్సేపయ్యాక మళ్ళీ ఇలా అంది: "అమ్మాయీ! నన్నెక్కడికైతే వెళ్ళమన్నావో అక్కడికే వెళతాను. కాని, అతడి ఇష్టంలేందీ నువు రావటానికి వీల్లేదుగా! అదీ నిజమేలే; అందుకోసమేకదా అతడు చీకటితో ఇంటికి రాగానే, గాజులు తెచ్చాననే మిషతో చూడవచ్చాడు?"

అంటుండగానే ఆమెకు భర్త తలపుకి వచ్చి, మరో ఏడాది బతికి ఇదంతా ఎందుకు కళ్ళ జూసకు లేకపోయారు?" అని ఏడ్పు రాగాలెట్టబోయి, గుడ్డ అడ్డంపెట్టుకుంది

అంతలో "చిన్నావిడా!" అని పిలుపు.

కౌగిట్లోంచి కూతుర్ని గబగబా తోసేసింది దుర్గామణి. కళ్ళు తుడిచేసుకుంది "ఎందుకమ్మా, అక్కా?"

పెద్దావిడ ఓమాటు గదిలోకి చూసింది, తీక్షణంగా. "మీరు ఏడుపుల్లో మునిగి వున్నారు కనక ఆకలీ దప్పికా ఉండవేమో. అందుకోసమని ఇంటో వాళ్ళందర్నీ ఉపవాసం పెడితే ఉండగలరా? ఇవతలికొచ్చి ఎంత పొద్దెక్కిందో కాస్త చూడు తల్లీ!" అన్నది.

గదిలోంచి కంగారుగా బయటికి వచ్చింది దుర్గ. ఏదో సంజాయిషీ చెప్పబోయింది

స్వర్ణమంజరి తీవ్రంగా ఇలా అంది: "బాగుందమ్మా!—వంటపని పూర్తిచేశాక కూతుర్ని దగ్గిరెట్టుకుని రోజల్లా ఓదార్చు, వొద్దనను. మాపిల్లలంతా ఆకలో ఆకలో అని అలమటించిపోతున్నారు. సహించి ఊరుకోలేను బాబూ, నేనూ."

ఇప్పుడు దుర్గామణి మళ్ళీ అనాధుకి కుటుంబంలోకి వచ్చిచేరిందికదా. వంటపనంతా ఆవిడమీదనే పడింది. అందేత పెద్దావిడా, ఆఖరావిడా ఇంటిపెత్తనాలు చేసి మరింత ఖర్చు అంతఖర్చు అని గొప్పలు చెప్పుకోవడం, గొడవలుచెయ్యడం, హాయిగా నిద్దరోవటం, కబుర్లతో కాలక్షేపం, లేదా నవలలు చదువుకుంటూ కూర్చోవడం— ఇలాంటి అలవాట్లు మరిగారు.

అనాధనాథ్‌కి ఎప్పుడూ ఆఫీసుకెళ్ళే తొందరే. వేళకి ఇంత ఉడకేసి పడెయ్యడం ఇంతకుముందెంతో గొడవగా వుండేది. ఇంతోటి వంటకోసం. పెద్దావిడా ఆఖరావిడా పంతాలూ—పట్టింపులూ, మనస్పర్ధలూ—తగాయిదాలూ పెట్టుకూర్చునేవాళ్ళు దుర్గ వచ్చినప్పట్నించీ ఈ హంగామా వొదిలిపోయి, వాళ్ళిద్దరిమధ్యనే ఇన్నాళ్ళకి మళ్ళీ అంతఃకరణలూ ఆపేక్షలూ ఏర్పడ్డాయి.



కాని, అవి ఇప్పుడు మళ్ళీ తుడుచుకుపోయే చిన్నెలు కనబడుతున్నాయి. ఇందు కారణం—

ఏడుగంటలకి నిద్రలేచింది ఆఖరావిడ. దాసీది వచ్చి, "పొయ్యిలో నిప్పువేశాను. వంటకిహ తొందరపడండి అమ్మగారూ!" అని చెప్పింది.

చిన్నకోడలు కోపంతో 'ఎందుకని, రెండో ఆవిడేం చేస్తోంది? ఇప్పుడు ఏడు గంటలయిందికదా. ఒళ్ళు తెలియటంలే ఆవిడగారికి?" అని విసుక్కుంది.

"తెలియకేవమ్మా? ఈ ఎనిమిదిగంటల బండికి పుట్టింటికో ఎక్కడికో వెళతారుటగా, తల్లీకూతురూ? సామాన్లు సర్దుకుని మూటలు కట్టుకుంటున్నారు, పొద్దుట్నించీ"

అని చెప్పింది దాసీ

విన్నటి సంగతి గుర్తుకొచ్చింది చిన్నావిడకి   వెళ్ళమనగానే తుర్రుమంటూ ప్రయాణమే? బాబుగారిని అడగక్కర్లే? అక్కయ్యకి తెలుసా ఈ సంగతి?" అని గట్టిగా అడిగింది

"బాబుగారిమాట యేమో నాకు తెలియదమ్మగారూ! వారిని వెళ్ళమని పెద్దమ్మగారే స్వయంగా చెప్పారుటగా!" అన్నది దాసీ.

"అయితే ఆవిడతోనే చెప్పు. ఎనిమిదన్నరకల్లా వంట కావాలని. నాకు తెలియదు." అని మండిపడుతూ, పైతువాలు వేసుకు నూతికి వెళ్ళిపోయింది.

"ఆవిడ వుంటేగా చెప్పటానికి? గంగా స్నానానికెళ్ళారాయె!" అనేసి, దాసీది తనపనిమీద తను వెళ్ళింది.

ఏవో రెండుమెతుకు లుడకెయ్యకపోతే మొగుడు సరిగా భోంచెయ్యకుండా వెళ్ళాల్సి వస్తుంది, ఆఫీసుకి. అందుకని చిన్నావిడ దుర్గామణి ఉన్న గది గుమ్మందగ్గిర నిలబడి, తీవ్రంగా మందలించింది: "ఏమిటమ్మా, వెళ్ళిపోవటమేనా? వెళ్ళేవాళ్ళు ఇంట్లో ఇంత తగాదాపెట్టి మరీ పోవాలా?" అన్నది.

తెల్లబోయింది దుర్గ.

మళ్ళీ చిన్నావిడ—"నువ్వు పొద్దున్నే వెళ్ళిపోతావని మాకెవళ్ళకీ తెలియనే తెలియదు. ఆవిడేమో గంగాస్నానానికెళ్ళింది. నేనిప్పుడే నిద్దర లేస్తిని. వేళకి వంట ఎలా అవుతుందో కాస్త చెప్పు తల్లీ!—" అన్నది కోపంగా.

అంతలో అచలుడు—"నమస్కారం అత్తా!" అంటూ, వసారాలోకి వచ్చి నిలబడ్డాడు.

వెనక్కి తిరిగింది చిన్నావిడ.

"ఏమిటి అచల్, ఇంత హఠాత్తుగా వచ్చావ్?" అనడిగింది.

ఉత్తరం చూసుకుని, అతడిప్పుడే కలకత్తానించి రైలు దిగివచ్చాడు. ఇంకా ఇంటికన్నా వెళ్ళలేదు.

"అత్త పొద్దున్నే హరిపాల్ వెళుతుందని తెలిసింది. చూసిపోదామని వచ్చా. హరిపాల్ అంటే మలేరియా డిపో అన్నమాట. అక్కడికెళ్ళాలని—అందులోనూ ఈ ఆశ్వయుజంలో—ఎవరు చెప్పిపెట్టారత్తా, ఆవిడకీ బుద్ధి? ఓహో!—మాటలూ గీటలూ కట్టెయ్యడంకూడా పూర్తిఅయిందల్లే వుందే!" అని నవ్వుతూ గదిలోకి ఒకవేపునించి చూశాడు. తెల్లబోయి నించుండిపోయాడు.

హఠాత్తుగా పెరట్లో ఏవేపునించో స్వర్ణమంజరి కంఠస్వరం శబ్దభేదిలాగా అందరికీ



వినబడింది. అంటే ఆవిడ గంగాస్నానం చేసి, శుచిగా వచ్చిందన్నమాట. బయిట ఒకడుగూ, గుమ్మంలోపల ఒకడుగూ పెట్టి—

"ఏవమ్మా చిన్నావిడా!—ఆయన తిండి తినకుండా ఆఫీసుకి పోతే, పైత్యం ప్రకోపించి జ్వరంతో ఇంటికి తిరిగివస్తాడు—తరవాత నీకెలా జరిగిందో ఆయనకూ అలాగే జరగాలనే కదూ నీ వుద్దేశం?"

కంపించిపోయింది, దుర్గామణి. "చాల్లే అక్కా!—నా రాతంటే ఇలా వుండింది. పగవాళ్ళకైనా జరగలవి కోరసు నేనేం చేశానని ఇంతలేసి మాటలనాల్సి వచ్చింది

అక్కా? అన్నది

చేతులు జాడిస్తూ, ముక్కు విరుచుకుంటూ, మూతి తిప్పుకుంటూ, ఇలా గద్దించింది: "బొత్తిగా అప్పుడు పుట్టిన పసిపాపవే! సంగనాచివమ్మా!—పైగా, ఏంచేశానని అడ గొస్తావా, నన్నూ? ఏడున్నర దాటిందే వంట ఎవరు చేస్తారనుకున్నావ్, నీ తాత?"

అతులుడు ఇంతసేపూ మాటాడకుండా వింటున్నాడు. పెద్దత్త సంగతి అతడికి బాగా తెలుసు అందుకనే ఆవిడతో అంత ఎక్కువగా మాటాడకపోవటం. ఇప్పుడింక ఊరుకోలేక తనే ఆవిడకి జవాబు చెప్పాడు: "నిజం చెబితే నీకో్కపమొస్తుంది గాని అత్తా!—ఊరికి పోతున్న ఆ అభాగ్యురాలిని ఇవాళ్టికి కాస్త క్షమిస్తే పుట్టి మునిగిందా యేం?—"

అతులుడు ఇలా మాటాడే ధోరణికి తోడికోడళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు. ఏమీ అనలేక రెండునిమిషాలట్టె ఊరుకున్నారు. తరవాత స్వర్ణ ఇలా అంది: "నాతో పోట్లాడ్డానికొచ్చావేంరా, కలకత్తానించీ?"

అఖరావిడ ఇందుకు జవాబు చెప్పింది: "పోట్లాడ్డాని కెందుకొస్తాడు అక్కా! వాళ్ళ చిన్నత్త అన్నగారివూరు హరిపాల్ వెళుతూందిగా? ఒక్కమాటు చూసిపోదా మని వచ్చాడు."

"ఓహో, అలానా!"

"అదే అక్కా! అదే! ఇందాకట్నించీ ఆలోచిస్తున్నా. ఇంట్లో ఉన్నవాళ్ళకి మనకే ఏమీ తెలియదే. ఎక్కడో కలకత్తాలో కూర్చున్న నీ మేనల్లుడికెలా తెలిసిందా అని? అయితే, లోకులనుకుంటున్నది అబద్ధం కాదన్నమాట!"

కోపంతో ఒళ్లు మరిచి, వెటకారంగా అంది, స్వర్ణ—

మంచిదేనయ్యా!—మరి, ఇంత అపేక్ష కలవాడివి మీ అత్తని హరిపాల్ యాత్రకి పంపడమెందుకూ? మీ ఇంటికే తీసుకెళితే ఊరువూరంతా తెగమెచ్చుకునే వాళ్లుగా?"

విషజ్వాలవంటి ఆవిడ మాటలకు అతులుడికూడా తల తిరిగిపోయింది. "మంచిదే నమ్మా అత్తా!—అపిదే మా యింటికి వస్తానంటే, తప్పకుండా తీసుకెళ్ళేవాడిని, దీనికోసమని ఊళ్ళోవాళ్ళు నన్ను మెచ్చుకోనీ, నొచ్చుకోనీ. నేనేం బాధపడను." అని చెప్పాడు.

స్వర్ణ మాటలకు అతులుడు సిగ్గుతో ఎంత ఇదైపోయాడో, అక్కడున్నవాళ్ళంతా ఆశ్చర్యపడ్డారు.

మౌనంగా అతులుడు బయటికి వెళ్ళిపోయాడు.




ఎద్దుబండీ తీసుకొచ్చాడు, యాదవుడు. "అమ్మా! టయిమైపోయింది. సామాను తివ్పిస్తారా? ఆలస్యం చేస్తే, రైలందడం కష్టమవుతుంది." అని దుర్గామణిని వేగిర పెట్టాడు. ఇంటోకి వచ్చి ఎదట సిద్ధంగావున్న పెట్టే, మూటా అన్నీ పట్టుకుని బండి దగ్గిర కెళ్ళాడు.

పెద్దావిడా కడసారావిడా గబగబా లోపలికి వెళ్ళిపోయారు.

దుర్గామణి తలుపు తాళంవేసి, కూతురిచెయ్యి పట్టుకుని బండిలోకి వెళ్ళి కూర్చుంది.

కూతురు బండీ ఎక్కి తల్లి ఒడిలో కళ్లుమూసుకు పడుకుంది.

## 4

పదకొండేళ్ళ తరవాత మళ్ళీ ఈనాటికి పుట్టిల్లు చేరుకుంది, దుర్గామణి. ఇక్కడ అన్నగారు శంభూపట్జీ తప్ప, 'నా' అన్నవారెవళ్ళూ లేరు.

హరిపాల్ ఊరంతా ఇప్పుడు జ్వరాలతో నిండివుంది. శంభూకి ఇవాళ జ్వరం వచ్చేరోజు. ముసుగుతన్ని పడుకున్నాడు. చెల్లెలు వచ్చిందని తెలిసింది. పాత శాలువా తలమీదినించి కప్పుకుని. పాంకోళ్లు తొడుక్కుని వచ్చి, చెల్లెల్ని గుర్తుపట్టాడు.

ఆమె ఏడుస్తూ ముందుకు వచ్చి అన్నగారి పాదాలకు నమస్కరించింది, జ్ఞానదా నమస్కరించేసరికి—

''ఇది నీ కూతురా యేం? ఏవూరిచ్చావ్ దీన్ని?'' అనడిగాడు.

''ఇంకా పెళ్ళికాలేదు. ఎక్కడో అక్కడ, తొందరలోనే....'' అన్నది, దుర్గ.

''ఆఁ—ఇంకా చెయ్యలేదా? ఈడొచ్చిన పిల్లకదా?—

''ఈ ఊళ్ళోవాళ్ళెంత అప్రాచ్యులనుకున్నావ్? వాళ్ళకి తెలిసిందంటే, చెబుతున్నానుగా, అది వంటింటోకీ దేవతార్చన గదిలోకీ వెళ్ళాల్సిన అవసరంలేదు. అలాంటి సంఘం. ఈ వూరంత పాపిష్టి వూరు భూలోకంలో మరెక్కడా ఉండదు. చెల్లీ!—
''రా లోపలికి రా!

''ఇంత పెద్దపిల్లని వాళ్ళ పినతండ్రి దగ్గిర వొదిలేస్తే, నాలుగురోజులు ఎలాగో అలాగ తీసుపోయేదిగా? ఇక్కడ వున్నదంటే, దుర్గా!—ఆఁ—ఇంకా తెలియలే?

''లోపలికి వచ్చి కాళ్ళూ చేతులూ కడుక్కో...ఎవర్రా అక్కడా?'' అని చెప్పి మళ్ళీ పాంకోళ్ళు టకటక చప్పుడు చేసుకుంటూ లోపలి కెళ్ళిపోయాడు. దుర్గా జ్ఞానదా ఆయనవెంట ఎలా లోపలికి వెళ్ళారో దేవుడికే తెలియాలి!

శంభుకిది రెండో పెళ్ళి. ఇప్పుడున్నావిడ నలుపూ. నలుపుకి తగినట్టు సన్నగా పొడుగ్గా వుంటుంది. మలేరియాతో వంటిరంగు కాలిన పొగకట్టెలా మారిపోయింది.

మూడురోజుల్నించీ నిలవున్న పేడకుప్ప పిడకలు చరిచి, కాళ్ళూ చేతులూ కడుక్కొని వచ్చి ప్రదీపుణ్ని జోకొడుతూంది భర్త పిలవగా ఎదటికి వచ్చింది. శంభు వచ్చినవాళ్ళని పరిచయం చేసి మళ్ళీ గదిలోకి పోయి పడుకున్నాడు

ఈవిడ పేరు భామిని. మాట కొంచెం పెడసరం. పళ్ళన్నీ బయటపడేట్టు నవ్వి, ఆడబిడ్డని చెయ్యిచ్చుకు లోపలికి తీసుకెళ్ళి, పీటేసి కూర్చోబెట్టింది

దుర్గామణి వచ్చేటప్పుడు రసగుల్లా క్యారియర్ తెచ్చింది. అది ఇంకా కింద పెట్టీ పెట్టక ముందే ఎక్కడినించి వచ్చారో, నలుగురు పిల్లలు వచ్చి చుట్టూతా మూగారు. కీచులాటలూ, తోపులాటలూ జరిగాయి. అదో సంతలాగా తయారైంది. వాళ్ళమ్మ ఒకడికి సగం, ఇంకొకడికి పాతిక వంతు, తక్కిన ఇద్దరికీ చెరోముక్కా పెట్టింది. క్యారియర్ తీసుకెళ్ళి పడకగదిలో మేకుకి తగిలించింది. పిల్లలు చేతులోది మింగేసి, కారుతున్న పాకం నాక్కుంటూ, వెళ్ళిపోయారు.

ఇక్కడి అలవాట్లు దుర్గకి తెలుసుగాని కూతురికి తెలియవు. ఆడాళ్ళూ మగాళ్ళూ ఏడెనిమిదేళ్ళ పిల్లలుకూడా దిసమొలలతో కనబడేటప్పటికి. జ్ఞానద తలవంచుకుంది. తుమ్మచెట్లతో సర్వేచెట్లతో ఊరంతా అంధకారంగా కనిపించిందామెకు. చెట్ల మానులకు చుట్టుకున్న పాములు చూసీ, గుడ్లగూబల వికృతధ్వనులు వినీ భయపడింది.

తల్లివొళ్ళోకి పోయి జ్ఞానద వెక్కివెక్కి యేడ్చింది. ''ఇక్కణ్ణించి పోదామే

అమ్మా! క్షణంకూడా బతకలేను!'' అంది.

''భయమెందుకమ్మా! అవి దేవతలు. ఇక్కడ మలేరియా భయమే తప్ప. పాము కాటువల్ల ఎవరూ చావరు,'' అని భామిని ఊరడించింది.

ఆరాత్రి జ్ఞానదకు ఒక్కమారైనా కన్నుమూత పడలేదు. తల్లిగుండెకు తల ఆవించి పడుకుంది. క్షణక్షణానికీ ఉలిక్కిపడేది. ఈ కొత్తవూరు చూస్తే కాస్త సంతోషంలేదు సరికదా, మహచెడ్డ బాధనిపించింది.

ఈడు తప్పిన ఈ పిల్లని చూసి ఊళ్ళోవాళ్ళకి ఆశ్చర్యం కలిగింది. ఏ లోటూ లేకుండా పోషణ జరగటంవల్ల జ్ఞానద మంచి ఆరోగ్యంతో, నిగనిగలాడుతూ, ఈడుకి మించిన బొద్దుగా తయారయింది. కనుక ఈమెకు పదమూడో యేడు అవి తల్లి చెప్పినా ఎవరూ నమ్మలేదు.

మరి రెండురోజులయినా కాలేదు. శంభుచక్రి చెల్లెలిని ఇలా అడిగాడు:—
''పిల్లదాని మూలంగా వీధిలో తలెత్తుకు తిరగటంకూడా కష్టంగా వుంది. ఒక మంచి సంబంధం చూపిస్తా. చేస్తావా?''

''సంబంధం ఇదివరకే స్థిరమయింది, అన్నయ్యా! ఇంకెక్కడా ఇవ్వను'' అని చెప్పింది.

''అయితే పోనిలే. మరేం ఇబ్బందిలేదు. కాని ఇంత చక్కటి సంబంధం అదృష్టం పెట్టిపుడితేకాని దొరకదు. ఆ సంగతి ఆలోచించుకో—పదిహేనెకరాల మాగాణిపొలం, చెరువులు, తోటలు, ధాన్యపుకొట్లు....చదువూ కూడాను....'' అన్నాడు శంభు.

''కాదన్నయ్యా!—ఈ యేడాది వెళ్ళగానే దాన్ని అక్కడే ఇచ్చి చెయ్యాలి'' అంది దుర్గ.

''కాని, ఈ మార్గశిర మాసంలోనే పిల్లదాని భారం వదుల్చుకోవటం మంచిదని నా వుద్దేశం'' అన్నాడు శంభు. ఎక్కువ వాదించటం ఇష్టంలేక, ఏదో పనుందని చెప్పి అక్కణ్ణించి వెళ్ళిపోయిందామె.

తరవాత నెమ్మదిమీద తెలిసింది—ఈ వరుడెవరా అనే విషయం. శంభు రెండో సంబంధం బావమరి . అతగాడికి భార్యపోయి ఆరునెల్లపాటు వ్యధాగా తిరిగాడు. ఇంట్లో పిల్లా మేకా బోలెడంతమంది. కనక, పెద్దపిల్లనే చేసుకోవాల్సిన అవసరం ఎంతయినా ఏర్పడింది

దుర్గ కాదన్నాసరే, ఆ వరుడు ఒకనాడు హఠాత్తుగా వచ్చి పిల్లని చూశాడు. నచ్చిందని చెప్పేదేమిటి? ఇప్పటిదాకా సౌమ్యంగా. క్షేమం కోరినట్టుగా చెబుతూవచ్చిన

శంభుచటర్జీ ఇవాళ చెల్లెలితో కఠినంగా, స్పష్టంగా అన్నాడు: "తండ్రి పోతే, మీ పిల్లకు సంరక్షకుణ్ణి నేనూ—మేనమామని. అవసరాన్నిబట్టి బలవంతంగానైనా సరే, వచ్చే మార్గశిరంలోనే ఈ పెళ్ళి జరిపించి తీరతాను.

అన్నగారితో వాదించి వాదించి, దుర్గ లోపలికి వచ్చింది. కూతురు అన్నీ గ్రహించి వుంటుందని ముఖం చూడకుండానే తెలుసుకుంది. జ్ఞానద కళ్లు రెండూ ఎర్రగా జ్యోతుల్లాగా వున్నాయి.

"నే నుండగా నీకొచ్చిన భయమేం లేదమ్మా!" అని కూతురుకి ధైర్యం చెప్పింది కాని, తనకే భయంతో గుండె పికిరుగా వున్నది. ఈ వూళ్ళలో ఇలా బలవంత ప్పెళ్ళిళ్ళు చెయ్యటం మామూలేనని ఆమెకు తెలుసు.

తల్లి వక్షంలో తల దూర్చి జ్ఞానద ఏడుస్తూంది. ఆమె నుదుటిమీదా చెక్కిళ్ళమీదా చెయివేసిచూస్తే సలపరం తగిలినట్టుంది. కళ్ళుతుడిచింది. "జ్వరం ఎప్పుడు తగిలిందే అమ్మాయీ?" అనడిగింది.

"నిన్నటిరాత్రి."

"ఎందుకు చెప్పావుకాదూ? ఇప్పుడు మలేరియాకాలం?"

జవాబు చెప్పలేదు జ్ఞానద.

* * *

ఇప్పటిదాకా దుర్గామణి అన్నగారి భార్యతో ఎక్కువ చనువుగా వుండలేదు పల్లెటూరి పద్ధతులూ, అలవాట్లూ ఆ మనుషుల ధోరణీ అంతా తెలుసు దుర్గకు. వదిన గారి వాలకం చూస్తేకూడా ఆమె సహించలేకపోయింది.

మొదట రాగానే ఆవిడ వంటలో సాయం చేదామని వెళ్లింది దుర్గ. "రెండు రోజులుండి వెళిపోయేదానివి, నీకెందుకీ బాధ?" అనేసరికి ఆనాటినించీ నిశ్చింతగానే వుంది దుర్గామణి.

ఇవాళ పొద్దెక్కింది గుమ్మంలో నిలబడివున్న భామిని, "వంటా అదీ లేదా యేం వదినా?" అనడిగింది.

పిల్లకి బాగా జ్వరంగా వుందమ్మా. మీరు భోంచెయ్యండి. మాకెవళ్ళకీ తిండి ప్రమేయం లేదు" అన్నది దుర్గ.

భామిని వెళ్ళిపోయి మధ్యాన్నం కషాయం కాచి తెచ్చింది. అత్త అంటే భయం జ్ఞానదకు. అంచేత కషాయం కళ్ళుమూసుకు మింగేసింది. కాని అది కాస్తా వాంతి అయింది.

ఈ చప్పుడు విని పరుగెత్తుకుంటూ వచ్చి, అలాగే నిలబడిపోయింది. అత్తకి




కోపం వచ్చింది. "ఇలాంటి దొరసాని బిడ్డల్ని తీసుకొచ్చి మాలాంటి బీదవాళ్ల నెత్తిన ఎక్కించావెందుకు బాబూ!" అంటూ విసుక్కుని, వీధివీధికీ గొడవచేసింది.

క్రమంగా జ్ఞానద రోగం ఎక్కువై, కొద్దిరోజుల్లోనే మంచం పట్టింది. ఈ మలేరియా మృత్యుదేవతలాంటిది, పట్టుకుంటే వదలదు" అని భామినీ అత్త మొదట్లోనే చెప్పింది

ఆరోజున కార్తీక సంక్రాంతి. దుర్గామణి ఇంట్లోకి వచ్చేసరికి జ్ఞానద మంచం మీద తలాపుదిక్కున భామిని వుండటం చూసి ఆశ్చర్యపోయింది. ఇంట్లో అవసరమైన పనులన్నీ వదిలిపెట్టుకుని, పరాయి బిడ్డకు ఇలా ఉపచారం చెయ్యటంలో ఆంతర్యం ఏమిటా అని ఆలోచనలో పడింది.

ఆమె అన్నగారికి జ్ఞానదను ఇవ్వడం విషయం జ్ఞాపకమొచ్చింది. భయంతో ఒళ్లు వణికింది. ఈ సంబంధం గురించి భర్తకు నూరిపోసి, మొదట్నుంచీ పాటుగా పురెక్కిస్తున్న సంగతి సులభంగానే గ్రహించింది

"భామిని ఇంట్లో పని చూసుకునేందుకని వెళ్ళిపోయింది.

దిండు కిందనించి ఒక ఉత్తరం పైకితీసి జ్ఞానదా తల్లితో "జవాబు ఇచ్చారు" అంది.

"ఏం రాశాడమ్మా, అతులుడు?" అనడిగింది కూతుర్ని.

జ్ఞానద అటువేపు తిరిగి పడుకునివుంది. ''వెళ్ళటం మంచిపనికాదు '— అని ఉన్నదని చెప్పింది, టూకీ .

ఈ రెండుముక్కలూ వినేసరికి దుర్గ కళ్ళవెంబడి నీళ్ళు వచ్చాయి. ''వెళ్ళటం మంచిపనికాదు'' అని పదిమార్లయినా అనుకుంది.

అతులుడి ముఖం గుర్తుకి తెచ్చుకుంది. మనస్సులో అతణ్ణి ఎన్నోవిధాల ఆశీర్వదించింది. ''కుర్రవాడికెంత అభిమానం? వాడి మనస్సులో ఎంతబాధ, మమ్మల్ని గురించి? ఈరెండు ముక్కల్లో ఎంత అర్థముందో కదా ఇక్కడికి రావటంచేతనే జ్ఞానద జ్వరం పడింది' అని అనుకుంది. అందుకనే వీళ్లు బయల్దేరి వచ్చేరోజున అతులుడు కలకత్తానించి చూడవచ్చాడు. ఎంత కష్టనిష్ఠూరాలకైనా సహించి అక్కడే పడివుంటే బాగుండేది!

ఆ ఉత్తరం చేతితో అటూ ఇటూ తిప్పుతూవుంటే, దుర్గామణికి ఎన్నో సంగతులు జ్ఞాపకం వచ్చాయి. తన భర్త అవసానదశలో అతులుడు చేసిన వాగ్దానం—గాజుల జత, ఆ మహాప్రసాదం తీసురావటం—వీటన్నిటికేం, వాళ్ళు బయల్దేరి వచ్చేనాడు స్వర్ణతో పోట్లాడటం—ఈ సంగతి అతడి తల్లికి తెలిసింది, ఆ వీధిలో వాళ్ళందరికీ కూడా తెలిసింది.

ఎందుకోసమని అతడు కలకత్తానించి పరుగెత్తుకొచ్చాడు? అనేసంగతి గుర్తుకి వచ్చినప్పుడు ఆ మాతృహృదయం సంతోషంతో గర్వంతో నిండిపోయింది. మా పిల్ల నల్లటిదే మా నల్లపిల్లకు జరగబోతున్న గౌరవం అందరూ చూడనీ!— తుమ్మెద నలుపుకదూ? కోకిలా నలుపేకదూ; అని మనస్సులో అనుకుంది, దుర్గామణి.

''జ్ఞానదా, ఎలావుందమ్మా యిప్పుడూ!'' అనడిగింది కూతుర్ని పిలిచి.

''బాగానే వుందమ్మా!''

''నన్నుగురించి ఏం రాయలేదూ, అతులుడు?''

''చదివిచూడూ''

సంతోషం ఆపుకోలేకపోయింది, దుర్గ. ఉత్తరం మడత విప్పింది. అందులో రెండు పంక్తులే ఉండటం చూసి, ఇది మరేదయినా వేరే ఉత్తరం కాదుకదా అని మొదట అనుకుంది.

''నమస్కారాలు'' అని కనబడగానే నవ్వుకుందామె. అది తనకి రాసిన ఉత్తరమే అని రూఢిపరుచుకుని, చదువుకుంది—''ఆ ఊరు మలేరియా డిపో అని ముందుగా ఆ రోజునే చెప్పానుగా? జ్ఞానదాకు జ్వరం వస్తోందని విని చాలా విచారించాను. త్వరలోనే ఆరోగ్యం కలుగుతుందని ఆశిస్తాను. ఇక్కడ కులాసాగానే వున్నాం. నా

నమస్కారాలు అందుకోండి''—అని వుంది, ఉత్తరంలో.

దగ్గర కూర్చుని, కూతురికి జుట్టు చిక్కుతీస్తూ, ఇలా అడిగింది దుర్గని ''నీ ఉత్త రంలో ఆతులుడు కోపంగా ఏం రాయలేదు కదా, అమ్మా!''

''నాకు వేరే ఉత్తరం ఏముందే అమ్మా!—నీకే కద రాశాడు?'' అన్నది జ్ఞానద, ఆశ్చర్యంతో ముఖం వెనక్కి తిప్పి.

దుర్గ నవ్వుతూ ఇలా అంది: ''నా కా ఉత్తరం చూడాలని లేదులే. విని సంతో షిస్తాను, అంతే. కోపంగా రాశాడేమోనని అనుకుని అడిగా.''

'లేదే అమ్మా! వేరే నాకు ఉత్తరమంటూ ఏం రాయలేదు. రాసిన ఉత్తరమల్లా అదే,'' అని చెప్పి, మళ్ళీ పడుకుంది జ్ఞానద.

''ఈ రెండు పంక్తులేనా, మొత్తమంతా: ఇంకే సంగతీ లేదూ?'' అని ఆశ్చర్య పోయింది, దుర్గ.

జ్ఞానద తలను ప్రేమతో చిక్కుతీస్తున్న ఆ దుర్గామణి వేళ్ళు ఇప్పుడు కాఠిన్యాన్ని అవలంబించాయి. అలానే కాస్సేపు కూర్చుని ఆవిడ లేచి వెళ్ళిపోయింది.

రోజులు గడిచిపోతున్నాయి.

## 5

దుర్గామణికి చిన్ననాటి స్నేహితురాలొకామె పుట్టింటికి వచ్చినట్టు తెలిసింది. అందు చేత, కూతురు కొంచెం కులాసాగా ఉండటం చూసుకుని మధ్యాహ్నంపూట దుర్గ బయల్దేరింది. దారిలో పోస్ట్‌మాన్ ఎదుర య్యాడు

'ఏమయ్యా దాసూ!—నాకేం ఉత్తరం లేదా?'' అనడిగింది.

''వస్తే ఇవ్వనా, అమ్మగారూ?'' అన్నాడతడు.

''నాకు లేకపోతే పోనీ, మా అమ్మాయి జ్ఞానదా పేరుకయినా రాలేదా?''

''లేదమ్మగారూ!—వస్తే, నేనే పట్టుకొచ్చిస్తానుగా!' అన్నాడు.

''అదికాదయ్యా దాసూ!—తప్పకుండా వచ్చి ఉండాలి మూడుత్తరాలు వేశాం. ఒక్కదానికీ జవాబివ్వకుండా వుంటాడా, మా అతులుడు? అలాంటివాడు కాదే! నీ సంచీ మళ్ళీ ఒక్కమాటు జాగ్రత్తగా వెతికి చూద్దూ!—'' అంది.

'లేదమ్మగారూ!—'' అంటూ వెళ్ళిపోబోతున్న పోస్ట్‌మాన్‌ని మళ్ళీ పిలిచింది, దుర్గామణి.

''పోస్టుమాష్టరుకి నాపేరు తెలియదుగా? వస్తే, ఒకవేళ ఏ బల్లమీదయినా పడేసి వుంచాడేమో! పోనీ, నేనే అక్కడికి పోయి ఒకసారి వెతుక్కోవచ్చా?'' అనడిగింది మళ్ళీ.

ఆవిడ ఆత్రం, అమాయికత్వం చూచి జాలిపడ్డాడతడు. "నేనే వెళ్ళి ఇంకోమాటు చూస్తా లెండి. వస్తే, తప్పకుండా తెచ్చిస్తా"నని చెప్పి వెళ్ళిపోయాడు

దారిలో దుర్గ ఇలా ధ్యానించుకుంటూ వెళ్ళింది: "తల్లీ! భవానీ! కాళీమాతా! ఒక్క ఉత్తరం ముక్కయినా వచ్చేట్టు అనుగ్రహించు తల్లీ!—నా జ్ఞానదకు ఇంత జబ్బుచేసినట్టు తెలిసి ఊరుకుంటాడా అతడు. జాబు రాయకుండా? రాసే వుంటాడు. ఎక్కడో పోయివుంటుంది!—"

ఎన్నో సంఘటనల్ని గురించి ఇలా ఎన్నెన్నో ఆలోచనలు మనస్సులోకి వచ్చాయి. కాని, ఈలోపుగా ఒకవేళ అతులుడి మనస్సు మారిపోయిందేమోనన్న యోచన మాత్రం రాలేదు

ఇంటికి పెందరాళే తిరిగివచ్చిందామె. "దాసు ఉత్తరమేం ఇవ్వలేదా?" అనడిగింది కూతుర్ని. "లేదమ్మా" అని చెప్పింది, జ్ఞానద.

ఈమధ్యసి ఉత్తరంమీద ఉత్తరం మూడుత్తరాలు రాసినా, జవాబు రానేలేదు. సంశయం పట్టుకుంది, దుర్గకు.

"పోస్ట్‌మాన్ వచ్చినప్పుడు నువ్వు నిద్రరోయావేమో! ఎవరూ పలక్కపోయేసరికి దాసు వెళ్ళిపోయాడేమో! నేనింటో లేనుకదా, ఒక్కనాటికి కాస్సేపు మేలుకు నుండ లేవుటే?" అంటూ దుర్గ వెళ్ళిపోయింది. జ్ఞానదకు తర్కించటం ఇష్టంలేదు, తల్లివేసే ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పటం మానేసింది, సిగ్గుతో తల నేలకు వంచుకుంది.

దుర్గ వెంటనే తిరిగివచ్చింది. గుమ్మం ఇవతలే నించుని, "ఉత్తరం వెతికి తెస్తానని ఆ దాసు నాతో ఎందుకు చెప్పాడే?" అన్నది. కూతురు మాటాడలేదు అక్కడ వున్న ఒక పాతబొంతలో తల దూర్చుకుని పడుకుంది.

దుర్గామణి ఊరుకోలేదు తన అన్నకొడుకుని పోస్టాఫీసుకి పంపించింది. వాడు తిరిగివచ్చి "ఏమీ రాలేదని చెప్పాడు దాసు!" అన్నాడు

మూడు నాలుగు రోజులదాకా రాత్రింబగళ్లు ఇదే పలవరింత, దుర్గామణికి. కాని ఉత్తరం లేదు. చివరికి ఆశ వదులుకుని అతులుడి తల్లికి ఇంకో ఉత్తరం రాయించింది దీనికి జవాబు వచ్చింది. అందులో—

"అతులుడు కులాసా. కలకత్తాలో మెస్సులో వుంటూ, ఇదివరకు లాగానే చదువుకుంటున్నాడు." అని మాత్రమే వుంది, ముక్తసరిగా.

దుర్గకు ఈ ఉత్తరం నిర్లక్ష్యధోరణిలో వున్నట్టు అనిపించింది.

ఇలాగే మార్గశిర పుష్యమాసాలు గడిచిపోయాయి. అయినా, అతులుడి వుత్తరం లేదు. మాఘం ప్రవేశించేటప్పటికి కూతురు కోల్కుంది గాని తల్లి మంచమెక్కింది.



ఇవంతా చూస్తుంటే దుర్గకు నిరాశ తప్ప మరేమిటి? పైగా అస్తమానం వదిన గారితో చిలిపి కలహాలు. పోట్లాటకి వచ్చినప్పుడెల్లా ఆవిడగారు "ఓసి తాటకీ!" అనీ, "నీ మొహం మండ!" అనీ తిడుతూ వుంటుంది. అందుకనే మరీ అసహ్యం పుట్టుకొచ్చింది.

దుర్గామణి చికాకుపడటానికి ముఖ్యకారణం ఇంకోటుంది. ఇప్పుడీ తిట్టే తిట్లన్నీ దుర్గనే. కాని, జ్ఞానదను చూస్తే అపేక్షగానూ, ఆదరణగానూ వుంటూంది.

ఇలా వుండటంలో భామినికి స్వార్థం ఉందిగా? ఆ వాసన కొట్టినప్పుడల్లా దుర్గని విషజ్వాలలాగా దహించివేస్తూంది.

ఇహ సహించలేకపోయింది.

జ్ఞానద ఏడుస్తూ తల్లితో ఇలా అంది: "అమ్మా!—ఏమయితే కానీ, మనమింక ఇక్కడ వుండొద్దే ఇంటికి పోదాం!"

"సరే" నని ఒప్పుకుంది, తల్లి.

* * *

దుర్గ ప్రయాణవార్త శంభుకి తెలిసింది. ఉదయం ఎనిమిదిగంటలకు సంధ్యా వందనం పూర్తిచేసుకుని టకటక బైటికి వచ్చాడు.

"దుర్గా!" అని పిలిచాడు

గోడపక్కని ముఖం కడుక్కుంటున్న దుర్గ పిలుపు అందుకుని పలికింది.

"ఇప్పుడు నువ్వెళ్ళటానికి వీల్లేదు!" అన్నాడు.

"ఎందుకని అన్నయ్యా"

"ఎందుకనా?—నిన్ను నమ్మి పెద్దమనిషికి మాట ఇచ్చాను కదా....?"

"ఎవరికి అన్నయ్యా, మాట?" అనడిగింది దుర్గ, మనస్సు కలవరంతో.

"జ్ఞాని పెళ్ళిగురించి. ఇహ ఆగటానికి వీల్లేదు. మా నవీనుడితో సంబంధం ఖాయం. ఈ ఫాల్గుణంలో తాంబూలాలు పుచ్చుకోవాలి. నగ, నాణ్యాలూ, లాంఛనాలూ వాళ్ళేం లోటు చెయ్యరు. అంతా సక్రమంగా జరిగిపోవాలి." అని చెప్పాడు శంభు.

పిడుగు పడ్డట్టయింది దుర్గకు. "చెప్పకుండా మాట ఎందుకిచ్చావ్, అన్నయ్యా? నా బొందిలో జీవుడుండగా ఈ పెళ్ళిమాత్రం జరగనివ్వను? అనేసింది

మండిపోయాడు, శంభు. "చెయ్యను అంటే చెల్లుతుందనుకున్నావా, యేం? పిల్లకి నేను మేనమామని. నా యిష్టం జరిగే తీరాలి, తెలుసా?—" అంటూ గద్దించాడు, అన్నగారు.

వెక్కి వెక్కి యేడ్చింది, దుర్గ.

"వీల్లేదన్నయ్యా, ఎంతమాత్రం వీల్లేదు నేను చచ్చినా దానికి ఇక్కడ పెళ్ళి చెయ్యను. మాకోసం నువ్వేం తాపత్రయపడొద్దు." అన్నది కాని చెప్పదలుచుకున్న దంతా పూర్తిగా చెప్పలేకపోయింది.

పళ్ళు పటపట కొరుకుతూ శంభు ఇలా అన్నాడు: "శుభమా అంటూ పెళ్ళి నిశ్చయంచేస్తే, అనవసరంగా ఈ యేడుపులూ పెడబొబ్బలూ...."

అంటూండగానే, భామిని సిద్ధమయింది. పేడ చేస్తూ చేస్తూ మధ్యలో గభాల్న వచ్చేసింది. అంచేత చేతులు రెండూ వెనక్కి పెట్టుకుని, "ఆ వరుడెవరండీ, ఇంతకీ? నే విననే లేదే?" అనడిగింది.

భార్య ధోరణికి చలించిపోయాడు శంభు అయినా నిబ్బరం తెచ్చిపెట్టుకుని, "ఎవ రయితే నీకేం? ఎవరో ఒకరు!" అని కసిరికొట్టాడు.

ఆ పేడచేతులు తిప్పుకుంటూ భామిని వీధివీధంతా ఎగిరిపోయేట్టు ఆడిపొయ్యడం

ప్రారంభించింది.

"సమయం వచ్చింది. నవీనుడికిచ్చి పెళ్లిచేస్తాను" అని చెప్పాడు, శంభుపట్నీ,

వెంటనే అందుకుంది భామిని:

"ఆదా సంగతీ!—వడ్డీతోసహా వంద రూపాయలూ అప్పు తీరిపోతుంది కద అనేనా మంచివరుడంటున్నారూ! నిజమే. నా అన్నగారి సంగతి నాకు తెలియదా?—కల్లు తాగుతాడు, గంజాయి తాగుతాడు. ఎనిమిదినెలల కడుపుతో వుండగా అయిదుగురు బిడ్డల తల్లిని దుడ్డుకర్రతో మోది చంపిన ఖూనీలకాయడు!—వీడా మూంచి వరుడు - ఈ సంబంధం చేసుకునేకంటే ఉరిపోసుకు ఛస్తే మేలు!—ఛ-ఛ!!—"

చెల్లెలి ఎదటా, మేనకోడలి ఎదటా ఇలా మాటాడేటప్పటికి శంభూకి కోపం ఆగ లేదు. విసురుగా ఎడంకాలి పాంకోడు తీసి పైకెత్తి "ఫో! తప్పుడుముండా నోర్మూయ్!!" అంటూ ఉగ్రుడై లేచాడు.

ఈమాటు భామినికి పిచ్చెత్తినట్టయింది. భయంకరమైన ముఖంతో ఇలా అరిచింది "తప్పుడుముండనా?" చూస్కో—, ఈ కొరివి తీసుకు మొహంమీద కొట్టకపోతే, నేను పాంచ్ ఘోషాల్ కూతుర్నే కాదు. బలవంతంగా పెళ్ళిచేస్తావా? నువ్వెవరివనీ? ఏదో రెండురోజులుండి చక్కా పోదామని ఆవిడ కూతురితో కూడా మనింటికివస్తే, పగలూ రాత్రీ ఎందుకలా వాళ్ళని భయపెట్టటం?—చురకత్తి కనబడనీ, చెబుతా. బావమరుదులు ఇద్దరిముక్కులూ కోసి మరీ విడిచిపెడతా! నాపేరు "భామిని". అన్నమాట మరిచిపోయ్యావా?"—

ఇలా అవతారం తాల్చిన భామినిముందు మరి నోరెత్తలేక, ఇంటోకి వెళ్ళి పోయాడు, శంభూ.

అప్పుడు భామిని దుర్గామణివేపు తిరిగింది. "వదినా!—ఆయన ఒట్టి ఎలుగ్గొడ్డు అనుకో! నువ్వొచ్చినప్పటినుంచీ పన్నుతున్నాడీ పన్నాగం. ఈ బంగార బొమ్మని ఆ కొండముచ్చు చేతిలోపెట్టేసీ అప్పలూ తాకట్టు పద్దులూ కాస్తా ఎలాగో వదిలించుకుందా మని, ఇదంతా....పైగా మేనమామట! గొప్ప మేనమామే!!" అన్నది.

ఆవేశంతో హైరాణగా దించుకు మాటాడేసరికి భామినికి ఆయాసం వచ్చింది. అలుపు తీర్చుకున్నాక మళ్ళీ చెప్పింది:

"సీమనను కష్టంగా వుంటుందని చెప్పలేను, వదినా!—పిల్లదానికి జ్వరం శృతి మించిపోయేట్టుగా వుంది. మంచి డాక్టర్ని తీసుకురమ్మంటే, అంతడబ్బు లేదన్నారు చూడు—ఇంకా "నేను మేనమామని" అని చెప్పుకుంటాడు దరిద్రపు మొహం ఎవరు సంతోషిస్తారనో?—

ఏదో ఉన్నదాంట్లోనే అనిచెప్పి మెడని ఓ చిన్న బంగారపుగొలుసుంటే తాకట్టుపెట్టి నేనే ఎలిపించాను డాక్టర్ని. నే బ్రతికుండగా నీకు భయమెందుకు వదినా! ఇవాళ ఏర్పాట్లు నే చేయిస్తాను. నువ్వు మీ ఊరు వెళ్లాకనే పిల్లదాని పెళ్ళిసంగతి ఆలోచించు. పెళ్ళిచేశాక మళ్ళీ నీయిష్టం వచ్చినప్పుడు ఇక్కడికి రావొచ్చు. మరేం అభ్యంతరంలేదు ''

స్తంభాన్ని ఆనుకుని దుర్గ అలాగే కూర్చుంది. ఆమె కళ్ళవెంట దుఃఖాశ్రువులు వరదలుగా ప్రవహిస్తున్నాయి.

కంఠస్వరం కొంచెం సవరించుకుంది, భామిని, భర్త ఎదట లేకపోయినా, ఆయన్ని వుద్దేశించి ఇలా మొదలెట్టింది:

''నీకున్నదాంతో సరిపెట్టుకుని తృప్తిపడాలిగాని, ఇతరులది మింగేసి బొర్రలు పెంచుకుంటే నరుడూ నారాయణుడూ కూడా హర్షించడు! దిక్కులేనిది కదా అని నిన్నాశ్రయిస్తే, ఆవిడమీద చెలాయించటం దేనికీ? ఈ దురంతాలన్నీ పైనించి భగవంతుడు చూడటం లేదనుకున్నావా?——''

ప్రయాణపు ఏర్పాట్లన్నీ ఆరోజు మధ్యాన్నానికి పూర్తయినాయి.

ఇహ బండెక్కబోతుందన్నమాట, దుర్గామణి, భామిని రెండుపాదాలమీదా చేతు లుంచింది. ''వరసకి నువు నాకంటె పెద్దదానివి కనక వదినా!——నిన్ను ఆశీర్వదించుదా మంటే వీల్లేదు. భగవంతుడు నీ కన్నివిధాలా శ్రేయస్సు కలిగించాలని ప్రార్థిస్తాను. పాపం, నాకోసం నువ్వు బంగారుగొలుసుకూడా నష్టపెట్టుకున్నావు!'' అంటూ మనసారా కన్నీళ్ళు గార్చింది.

పళ్ళన్నీ బయట పడేట్టు నవ్వింది భామిని. ''పోనిద్దూ, పాడుగొలుసూ! ఈపాటి దానికి నేనేదో పెద్ద త్యాగం చేసినట్టుగా చెబుతున్నావేమిటీ? జబ్బుమనిషివా, అట్టేసేపు నించోకు. పద, బండీ ఎక్కు.

''జానీ!——మా యింటికిపచ్చి నానాకష్టాలూ పడ్డావు. పాపం!——ఏమన్నాకానీ. మళ్ళీ ఇక్కడికి రావడం సంగతి మరిచిపోకేం?'' అంటూ, పిల్లచేతిలో బలవంతంగా రెండురూపాయలు పెట్టి, గుప్పెట మూసేసింది.

దుర్గ బండీలో కూర్చుంది. ''వదినా!——అజ్ఞానంవల్ల తెలిసీ తెలియకా ఎన్నో అపరాధాలు చేసివుండొచ్చు నేను. అన్నీ క్షమించు'' అన్నది, కన్నీళ్లు తుడుచుకుంటూ.

అంత ఇదిగా నవ్వలేదు భామిని, ఇదివరకటిలాగా. చటుక్కున రెండు నీటిబిందు వులు కూడా దొర్లాయి కళ్ళలోనించి.

''హయ్యో! రాత!——చేసివుంటే, అపరాధాలు నావల్లనే జరిగివుంటాయి.




నువ్వలా అనుకోకు.

"ఇదుగో, జ్ఞానీ!—మామమీదా, అత్తమీదా కోపం గీపం ఏం పెట్టుకోకుసుమా!-ఇప్పుడే చెబుతున్నా—వచ్చేయేడు మామిడిపళ్ళ రోజుల్లో నువ్వొచ్చితీరాలి. అంతే, నువ్వొక్కత్తెవే కాదు. అల్లుణ్ణికూడా వెంటపెట్టుకురావాలన్నమాట, తెలిసిందా?—"
అనిచెప్పి, మరోసారి కన్నీళ్ళు తుడుచుకుని వెనక్కి మళ్ళింది.

## 6

తను తిరిగి వస్తున్న సంగతి ముందుగా ఎవరికయినా ఎందుకని కబురు చెయ్యటం? కేవలం అనవసర మనిపించింది. అందుకనే దుర్గామణి ఉత్తరం ముక్క వెయ్యకుండానే బయల్దేరి వచ్చేసింది.

హఠాత్తుగా జ్ఞానదముఖం కనబడేప్పటికి, పెద్దావిడ స్వర్ణమంజరి ఒకవంక నవ్వుతూనే కయ్యానికి కాలుదువ్వింది:

"ఏమే జ్ఞానీ! ఇంత అసహ్యంగా తయారయ్యావేమిటీ? ఆ బుగ్గలు అలా జారిపోయినై ఎంచేతనే? అయ్యయ్యో!—తలంతా ఊడిపోయి బట్టతలయిపోయిందే?

"చిన్నకోడలా!—ఒక్క మాటిలా రా అమ్మా. చప్పున. మన జ్ఞానసుంద రొచ్చింది. చూసిపో. ఒంటిరంగు కూడా మారిపోయిందే! మీ అత్తా, మామా చిత్రికి పట్టి మరీ పంపారులాగుందే?" అన్నది.

ఇన్ని కుశలప్రశ్నలకూ ఒక్క జవాబుకూడా చెప్పలే, జ్ఞానద.

పినతల్లి రాగానే చటుక్కున వెళ్ళి కాళ్ళకి నమస్కరించింది. ఆవిడ కంపించిపోతూ, "ఇదేమిటమ్మా, ఇలా అయిపోయావ్?" అంటూ విచారించింది. "పెద్దావిడ చెప్పిన మాట నిజమే. అచ్చగా మరీ వెదురుపుల్లగా అయిపోయింది, జ్ఞాని' అన్నది కాని, స్వర్ణ మంజరితోపాటు తను నవ్వలేకపోయింది. ఎంత ఇదయినా, పిల్లలుగల తల్లికదా! కనిపెంచిన కష్టం తల్లికి తెలుస్తుందిగాని స్వర్ణలాంటి గొడ్రాలి కేంతెలుస్తుందీ?"

కంకాళంలా తయారైన జ్ఞానద శరీరమూ, పాలిపోయిన ఆ ముఖమూ చూసేప్పటికి చిన్నావిడలోని మాతృహృదయం ఎంతగానో కరిగిపోయింది. జ్ఞానద దగ్గరే కూర్చుని ముఖమూ, తలా నిమురుతూ యోగక్షేమాలన్నీ ఒక్కొక్కటే అడిగి తెలుసుకుంది. జబ్బుపడిన సంగతి సందర్భాలు విని పెద్దగా నిట్టూర్చింది. అక్కడవుండి అంత బాధ ఎందుకు పడ్డారమ్మాయ్? వచ్చెయ్యలేకపోయావా? అక్క ఏదీ?" అనడిగింది.

"బండీలో ఉండగానే జ్వరమొచ్చేసింది అమ్మకి. ఇంట్లోకి తీసుకు వచ్చి పడుకో బెట్టాను." అని చెప్పింది.

"రాకేం జేస్తుందీ? వెయ్యన్నా, సూరన్నా ఇంటికయిన పెద్దకోడల్నిగదా. నామాట తోసేసి అంత దురుసుగా వెళ్ళిపోతే ఏమవుతుంది. మరీ?" అని దెప్పిపొడిచింది. స్వర్ణమంజరి.

జ్ఞానద చెయ్యి పుచ్చుకుని, వాళ్ళమ్మని చూచివద్దామని లేచినించుంది, ఆఖరి కోడలు. ఇవాళ పెద్దావిడ అన్నమాటలు చాలా కటువుగా, అసహ్యంగా, సహించటానికి వీల్లేనట్లుగా అనిపించాయి ఆమెకు.

"అక్కా!—రెండేళ్ళపాటు సంక్రాంతి సమయంలో మధువ్రతం చెయ్యవమ్మా. వచ్చే జన్మకయినా ముఖాన ఈరాత తప్పుతుందేమో!" అన్నది.

ఈ రిమార్కు స్వర్ణ గుండెకు సూటిగా వెళ్ళి తగిలింది ఇలాటి మాట అంటుం దని కలలోకూడా అనుకోలేదామె. కనుక, విని తెల్లబోయింది. అయినా, వెంటనే తీవ్రమయిన స్వరంపెట్టి, "అలాగే లేవమ్మా, మంచి సలహాయే చెప్పావ్! ఇన్నాళ్ళ కయినా, చిన్నావిడని చూచేప్పటికి దుఃఖం పొంగి, హృదయం ద్రవించిపోయింది, పాపం! ఎన్ని వగలు నేర్చావమ్మా, నాతల్లీ, నువ్వు!" అని మాటకిమాట తక్షణమే అప్పగించింది.




ఆఖరావిడ జవాబు చెప్పలేదు, జ్ఞానవా వెయ్యి పుచ్చుకుని ఇంటోకి వెళిపోయింది.

దుర్గామణికి హరిపాల్‌లో ఉండగా జ్వరం వచ్చినప్పుడు, అదంతా ఓదారి. జ్వరం తగిత్తే పడుకోవటం, దిగజారగానే లేచి అటు యిటు మసులుకోవడం, సాధ్యమయితే స్నానం, పూజా చేసుకోవటం, ఆకలిగావుంటే ఒకపూట కాస్త ఎంగిలిపడ్డం కూడా ను.

ఇక్కడికి రాగానే ఆ క్రమమంతా మారిపోయింది. ఇరుగుపొరుగులంతా వచ్చిం ఎక్కడలేని సానుభూతీ చూపించడంలో అలాపడుకునే వుండిపోయింది కానీ, దుర్గ అసలు మంచంమీంచి లేవటానికే వీల్లేకపోయింది. అంటే, ఆ వచ్చిన అతిథిజనం పరామ్శలతో అణిచేపి ఆవిణ్ని లేవనియ్యలేదన్నమాట.

ఆ చూడవచ్చిన వాళ్ళల్లో ముఖ్యులు—పొరుగాయనా, వృద్ధుడూ అయిన నీలకంఠ ముఖర్జీగారి భార్య ఒకర్తె. ఆవిడ సంభాషణంతా ఏదో ఆకాశంమీదినించి పడ్డట్టుగా ఆశ్చర్యమే, అంతా ఆశ్చర్యమే!—

ఇదేటుడీ! ఇలాచేశావు దుర్గా! పిల్లదాని పెళ్ళి ఇంకా యెప్పుడు చేసేదీ?" అనడిగింది.

నీరసమైన స్వరంతో అలసిపోయిన కళ్ళు రెండూ మూసుకునే దుర్గ ఇలా చెప్పింది! "ఏం తెలుసు పిన్నీ!—ఏనాటికి తలెత్తుకునేట్టు చేస్తాడో ఆ మాయదారి దేవుడు!"

అందుకు నీలకంఠుడి భార్య! "దేవుడి సంగతి సరేనమ్మా — అందరికీ తెలుసూ. మన ప్రయత్నమూ ఉండాలిగా? మీ అమ్మాయికి మొగుణ్ణి కూడా దేవుడే వెతికి తెస్తాడనుకున్నావా, యేం?" అన్నది మళ్ళీ.

బదులు చెప్పలేదు దుర్గ. ఒక్క నిమిషమున్నాక ఇంకా ఆవిడ ఇలా అడిగింది: "మళ్ళీ పుట్టింటికి వెళ్ళావు కాబోలు. మీ అన్నయ్యొక్కడా సంబంధం చూశ్శేక పోయాడా మరి, మీ మరిది యేమన్నాడూ?"

"భగవంతుడికి తెలియాలి" అంటూ దుర్గ అటుతిరిగి పడుకుంది

కాస్సేపటి తరవాత నీలకంఠుడి సతి ఏదో ఇటు పనిమీద వచ్చినట్టు వచ్చి "ఇప్పుడెలా వుంది, దుర్గా?" అంటూ క్షేమం కనుక్కుంది.

అప్పుడు జ్ఞానదా తల్లికి కాళ్ళు పిసుకుతూంది.

"ఇంకా జ్వరం తగ్గలేదు పిన్నీ! — కూర్చో. వెళుదువుగాని" అన్నది దుర్గ.

"కాదులే. వేళయింది. ఇహ కూర్చోను. కాని, ఒక్కమాట చెప్పిపోదామని వచ్చా. ఇంక మీనమేషాలు లెక్కెడుతూ కూర్చోకా. ఎవర్నో ఒకర్ని చూసి ముడెట్టేసేయ్. లోగడ పిల్లకి ముఖంలో కళ వుండేది. మలేరియాతో కాబోలు. ఆ కాస్తాపోయి, మెత్తిగా పొగకట్టెలా తయారయిందిప్పుడు — అవునుగాని, జ్ఞానీ! — ముందరిజుత్తంతా ఊడిపోయినట్టుందే? —" అనడిగింది.

తల వంచుకుని, మాటాడక్కూర్చుంది, జ్ఞానద.

ఆ వచ్చినావిడ కంఠస్వరం మృదువుగా మార్చి, ఇలా చెప్పింది.

"దుర్గా! — ఆ వీధిని వున్నాడు. ఎరుగుదువుగా — గోపాలభట్టాచార్యులు అని? ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకుంటాడని తెలిసింది. ఒక్కమాటు అనాథీవి పంపించి కనుక్కోరాదూ?"

"సరే అలాగేలే, కనుక్కుంటా." అంటూ దుర్గ మళ్ళీ గోడవేపు తిరిగి పడుకుంది.

ఈవిధంగా ఊళ్ళో ఎంతోమంది వస్తున్నారు, హితోపదేశాలు చేస్తున్నారు. పోతున్నారు. లెఖ్ఖలేదు. కాని ఎవరికోసమైతే ప్రతిక్షణమూ దుర్గామణి కళ్ళల్లో వత్తి పెట్టుక్కూర్చుని ఎదురుచూస్తూ వుందో, వాళ్ళు మాత్రం రాలేదు.

ఇంతవరకూ అతులుడు రాలేదు, అతడి తల్లీ రాలేదు.

* * *

పెద్దావిడకి హృదయమనేదే లేదు, అతి కఠినురాలు. కాని ఆఖరి కోడలికి కాస్తో కూస్తో దయాదాక్షిణ్యం ఉన్నాయి. అయితేనేం, అసలే ఆవిడ పరమబద్ధకస్తురాలు. అందులో నెలలు మోస్తూంది కూడా. కనుక పెద్దకోడలు చెప్పినదు సరిగా పత్తనం




చెలాయించే సమయం దొరికింది.

"ఎల్లకాలం రోగం రోగం అంటూ కూర్చుంటే ఎలా సాగుతుందమ్మాయీ! మీ అమ్మంటే పోనీ, చాలా నీరసస్థితిలో వుందనుకుందాం. ఈడొచ్చిన పిల్లవు, నీకేం?—మీ బాబయ్య ఆఫీసుకి వెళ్ళాలికదా. పెందరాళే ఆయనకి వేళకి కాస్త వంట చేసి పెట్టలేవూ?" అంది.

గదిలో కూర్చున్న ఆఖరావిడ ఈ మాటలన్నీ విన్నది. అన్యాయమని తోచినా ఏమనకుండా వూరుకుంది.

స్వర్ణ చెప్పిన మాటలకు వెంటనే జ్ఞానద "అలాగే పెద్దమ్మా!—తప్పకుండా చేస్తాను" అని జవాబిచ్చింది.

ఇప్పటికీ జ్ఞానదకు రోజూ రాత్రిళ్ళు జ్వరం కాస్తూనేవుంది. కాని తెలిస్తే బాధపడతుందని, తల్లికెన్నడూ ఈ విషయం వెల్లడించలేదు. వంటో పూచికపుల్లెత్తు సత్తువ లేకపోయినా, వెనకాముందాడక, లేని ఓపిక తెచ్చుకుని, "నే వంటచేసిపెడతా" నంటూ ముందుకు వచ్చింది. ఎంతో సంతోషంగా, మనస్ఫూర్తిగా అన్నదికాని యీమాట అయిష్టంతో ముఖం ముడుచుకున్నట్టు ఎక్కడా జాడయినా లేదు.

జ్ఞానద తలిదండ్రులు శ్రీమంతులు కారు. అయినా ఒక్కర్తే సంతానం కావటం

చేత చిన్నప్పటినుంచీ గారాబంగా పెరిగింది. పెద్దవాళ్ళమాట అదెటువంటిదయినా జవదాటకుండా నడుచుకోవటం ఆమెకు మొదట్నించీ అలవాటయింది. ఎవళ్ళేమన్నా సరే ఓర్పుతో సహించిపడివుండటం కూడా అలవాటయింది.

ఇవాళ ఆ అమ్మాయి తనపైన వేసుకున్న బాధ్యత ఎంత దొడ్డదో ఊహించటం ఎవరికయినా కష్టమే. కాని, ఆఖరికోడలికి మాత్రం అసలు నిజం తెలుసు. కనుకనే పెద్దావిడ అన్యాయంగా పసిపిల్లమీద పెట్టిన ఈ బాధ్యత తలుచుకున్నప్పుడు ఆవిడ హృదయం కలచివేసినట్టయింది. అయినా, ఎదురుచెప్పటానికి తగినసాహసం కలగలే దామెకు. ఒకవేళ గనక అలా ఏమైనా చెప్పిందో, వంతుప్రకారం ఈ ఉదయం వంటపని తనమీదే పడుతుంది, మరి!—

మర్నాడు—

మామూలు వేళకల్లా పినతండ్రి స్నానానికి వెళ్ళటం చూసింది, జ్ఞానద. వెండి కంచంలో అన్నంవడ్డించింది. సిద్ధంచేసి వుంచుదామని చెప్పి తీసుకెళుతూంది.

అంతలోనే పెద్దమ్మ ఎక్కణ్ణించో పరుగెత్తుకుంటూ వచ్చింది. "ఆఁ—ఆఁ— ఎక్కడికీ తీసుకెళుతున్నావ్?" అంటూ అరిచింది.

"కక్కాయ్ స్నానంచేసి వస్తున్నాడుగా?" అన్నది జ్ఞానద.

"ఆయనవస్తే నీకేమీ?—వచ్చేసరికల్లా ఎదురూగ్గా తీసుకెళదామనా? తీసుకెళితే నీమీద అభిమానం పొడుచుకొచ్చి ఆదరం చూపిస్తాడనా? అసలింతకీ, నీచేతిమీదుగా చేసిన వంట మగాళ్ళు ఎలా భోంచేస్తారనుకున్నావే?" అని గద్దించింది.

అప్పుడే మంచంమీదినించి లేచి, గుమ్మంలో కూర్చునివుంది, దుర్గ. ఈ కేకలు విని భయపడిపోయింది.

ఆఖరావిడ గదిలోంచి బయటికి వచ్చింది. "ఏం జరిగింది అక్కా!" అనడిగింది

తెల్లబోయి, కొయ్యలా నిలబడిపోయింది జ్ఞానద, కదలికలేకుండా. మరెవళ్ళవేపూ కన్నెత్తిచూడకుండా, జ్ఞానదనే మళ్ళీ సాధించబోయింది, స్వర్ణ.

"నీచేత్తో కంచం తీసుకెళ్ళి ఎదట పెట్టేసరికల్లా, కక్కాయ్ నెత్తికెక్కి కూర్చుని ఇష్టారాజ్యంగా ఆడొచ్చుననుకున్నావా? ఆయనగారు మెచ్చుకుని నిన్నే రాజకుమారుడికో ఇచ్చి పెళ్ళిచేస్తాడనేగా నీ కడుపులో వుద్దేశం? అబ్బా!—ఈ యీడుకే అప్పుడే మనసు తిప్పుకోవటం కూడా నేర్చావే? అమ్మ మహమ్మారీ!—" అంటూ, చేతిలో కంచం ఊడలాక్కుంది.

ఇదంతా చూసి వెయ్యితేళ్ళు కుట్టినంత బాధపడింది దుర్గ. మరి సహించలేక ఏడుపు మొదలెట్టింది.

“ఓసి!—ఏమే నీకీ దుర్బుద్ధి? పెద్దవాళ్ళమాట వినవేమే. నీకు చావొచ్చినా తీరిపోనుకదా!” అన్నది దుఃఖంతో.

నోరు మెదపకుండా జ్ఞానద వంటింటోకి వెళ్ళింది. ఈపని చెయ్యొద్దు అని తనతో ఎవరూ అనలేదు. కాని ఈ సంగతిఅయినా ఆ అమ్మాయి బయటికి చెప్పలేదు. అలా చెబితే ఎదిరించటమవుతుందేమో, ఎదిరించటం జ్ఞానదకు చేతకాదసలు!

చేతనయిన మనిషి ఒక్కరావిడ. ఆవిడకి పెద్దావిడ స్వభావం బాగా తెలుసు. అందుకనే ఏమీ చెప్పలేదు.

పెద్దామె [illegible]మంజరి అతివాగుడుమనిషి, అంతకంతా ఆమెకు ఆత్మాభిమానం కూడా తెలియనదని చెప్పాలి. ఏమంటే—“నీలో ఇన్నిన్ని దోషాలున్నాయనుమా” అని స్పష్టంగా విడమర్చి చెప్పినా ఆవిడ పిసరంతా సిగ్గుపడదు. సరికదా, రోషం తెచ్చుకుని మరింత కఠినురాలవుతుంది. ఇదంతా ఆఖరావిడకు తెలుసు. తెలియబట్టే జ్ఞానద వెంబడే నెమ్మదిగా వంటింటోకి వెళ్ళి ఆదరంతో అమ్మాయి చెయ్యి పుచ్చుకుని, “పెద్దమ్మ మాట వింటే తీరిపోనుగద, తల్లీ!—” అని మందలించింది.

ఇంతసేపూ ఎన్ని చివాట్లయినా సహించి వూరుకొన్నది జ్ఞానద. కాని, ఎంత ఆదరంతో చెప్పినా, ఇప్పుడింక దుఃఖం ఆగలేదు. కళ్ళుతెరిచి పినతల్లికేసి చూసింది. ఆమె కాళ్ళదగ్గిరే కుప్పుమని కూలబడిపోయింది. “ఈపని చెయ్యొద్దని నాతో ఎవరూ చెప్పలేదు, పిన్నీ—” అంటూ వెక్కి వెక్కి యేడ్చింది.

ఎలా ఓదార్చాలో పినతల్లికి తెలియలేదు. దగ్గిర కూర్చుని, జ్ఞానద కళ్లు తుడిచింది.

దురదృష్టవంతురాలు జ్ఞానద. పెళ్ళికాని ఆ పిల్లకి రోజులు ఇలానే గడిచిపోతున్నాయి. ఇంటోవాళ్ళూ పరాయివాళ్ళూ ఆ అమ్మాయిని ఏదోవిధంగా ఆడిపొయ్యడమే. ఇంటోనూ బయటా కూడా ఆ పిల్లకు చీవాట్లూ, అపనిందలే. ఒక చల్లనిమాట వినటానికిగాని, ఒక్కక్షణంసేపు మనసు విడిచి సంతోషంగా గడపటానికిగాని జ్ఞానద నోచుకోలేదులావుంది. ఆమెను ఆదుకునే వాళ్ళెవరూ కనిపించరు.

* * *

## 7

జ్వరంతో తీసుకు తీసుకు, దీర్ఘ ఖాయిలాలో పడింది దుర్గ. ఎవరైనా చెయ్యి పట్టుకు లేవదీస్తే గాని లేవలేని స్థితికి వచ్చింది. చూడబోతే ఆమె కెవరూ ఆధారం లేరు, కూతురుతప్ప.

అంచేత ఎన్ని పనులున్నా, జ్ఞానద మధ్య మధ్య వచ్చి తల్లి సంగతి కాస్త కని

పెడుతూ వుండటం తప్పనిసరి అయింది

ఇవాళ ఉదయాన్నే కొంచెం తీరుబడి చేసుకువచ్చి తల్లిదగ్గర కూర్చుంది కూతురు వీపు నిమురుతూండగా, చటుక్కున ఇదివరకు వినివున్న కంఠస్వరం ఏదో వినిపించింది, దుర్గకు. గుండె గలుక్కుమంది.

పగలూ రాత్రీ మైకం కమ్మినట్టుగా పడివుంటూంది, దుర్గ. ఇప్పుడీ కంఠస్వరం చెవినిపడగానే ఎక్కడలేచి కూర్చుంటుందో అని చాలా భయపడింది కూతురు.

• • •

ఈనాడు హోళీ పండగల వేడుక! అందరికీ సెలవు. అంచేత—నలుగు రైదుగురు స్నేహితులతో సహా అతులుడు ఇంటికి వచ్చాడు. రంగుచొక్కా తొడుక్కుని, ఇంత బుక్కా చేతపట్టుకుని "అత్తా!" అంటూ లోపలికి వచ్చాడు.

ఇతడి రాకకోసమే తల్లి ఆత్రంతో వేచివున్నదని జ్ఞానదకు తెలుసు.

ఇప్పుడు దుర్గలో మునుపుండే ధైర్యం, స్థయిర్యం లేవు. ఆలోచన మందగించింది. బుద్ధికూడా అప్పుడప్పుడు వక్రమార్గంలో పడుతూంది. ఈ పరిస్థితిలో, ఇవాళ ఎక్కడ పోట్లాట పెట్టుకుంటుందో అని జ్ఞానద శంకలో పడింది.

ఎప్పుడయినా చిన్న పేచీవస్తే, తల్లి ఇప్పుడు వెనక్కి తగ్గటమనేది లేదు. ఈ సంగతి కనిపెడుతూనే వుంది జ్ఞానద. అంచేత, అతులుడు లోపలికి వచ్చి ఎదట పడితే, వాళ్ళిద్దరికీ ఇవాళ కలహం తప్పదూ అని జ్ఞానదకు మనస్సే చెప్పినట్టయింది.

ఈ గండం ఎట్లా గడుస్తుందిరా దేవుడా! అని కంగారు పడింది. మెల్లిగా లేచి వెళ్ళి, గదితలుపులు వేసేసింది,

"అమ్మాయీ! అతులుడి గొంతుకల్లే వుందే?" అనడిగింది, తల్లి.

"ఏమో తెలియదమ్మా! ఆయనది కాదేమో!" అన్నది, వెనక్కి వస్తూ.

"ఆఁ—కాకపోవడ మేమిటీ? పోయి, చూసిరా ఒక్కమాటు!"

ఎదురు చెబితే తల్లి మండిపడుతుందని తెలుసు. అందుకని మెల్లిగా వెళ్ళి తొంగి చూసింది. ఏం కనబడలే, కాని, అటువేపు వరండాలో చాలామంది మాట్లాడుతున్నారు. వాళ్ల మధ్యనించి అతులుడి గొంతు వినిపించింది. ఈ కబురు తెలుసుకుని తల్లి దగ్గరికి తిరిగి వెళ్లాల్సిందే. అయితే—అతడిముఖం ఒక్కమాటు చూడాలనే కుతూహలంతో కదలకుండా అక్కడే ఉండిపోయింది.

జ్ఞానద మెల్లిగా ఇంకాస్త ముందుకొచ్చింది. ఒక స్తంభం చాటున నించుని చూస్తుంది: అతులుడు ఒక గుప్పెడు బుక్కా తీసుకుని, పెత్తల్లి పాదాలదగ్గిర చల్లి, నవ్వుతున్నాడు. అక్కడ చుట్టూ వున్నవాళ్ళంతా చూస్తూ కూర్చున్నారు.



చూస్తున్నవాళ్ళలో ఆఖరావిడ లేదు. ఒంట్లో నలతగా వుండి, ఇవాళ ఆమె అసలు గదిలోంచి బైటికే రాలేదు. అక్కడికి వెళదాం, వెళదాం, చూసివద్దాం అనుకుంటూనే వుంది, జ్ఞానద. కాని, ఆమెకి తెలియకుండానే కొంచెం ఆలస్యం జరిగిపోయింది.

అంతలో:—

తను భయపడినంతా అయింది. దుర్గ తూలుతూ తూలుతూ అటువేపే వస్తోంది

పరుగెత్తుకెళ్ళింది కూతురు. రెండు జబ్బలూ పట్టుకుంది. "అమ్మా, పోటోకు వెనక్కి రా!!" అన్నది, కలవరంతో.

కళ్ళెర్ర జేసింది, దుర్గ.

"ఎందుకని?"

"ఎందుకో....! వెనక్కి వచ్చెయ్!! ఇంకేం ఆశలేదు!!!" అన్నది కూతురు

వెర్రిబలం తెచ్చుకుని, "విడిచి పెట్టవే నన్ను. పెద్దమ్మా రా! విడిచి పెట్టెయ్! అంటూ బలవంతంగా చెయ్యి విడిపించేసుకుని, ముందుకి వెళ్ళింది విసురుగా. తల్లి వెనకాలే బొమ్మలాగా వెళ్ళిపోయింది, జ్ఞానద. అంతా వింతగా చూస్తున్నారు:—

చూడటానికి దుర్గ అస్థిపంజరంలా వుంది కాని, కళ్ళలో దృష్టిమట్టుకి ఆడపులి దృష్టిలాగా భయంకరంగా వుంది. ఆమె కళ్ళకేసి చూళ్ళేకపోయాడు అతులుడు చూపు కిందికి దించేసుకున్నాడు.

"నీకు మేం చేసిన అపకారమేమిటి అతుల్, ఇలా మమ్మల్ని సర్వనాశనం చెయ్యటానికి?" అని ప్రశ్నించింది, దుర్గ.

తల వంచుకున్నాడు. అత డవమానంతో

ఆపని చేసింది, స్వర్ణ.

ఏకోశానా ఆమెకు హృదయమనేది లేదుగా?—ద్రోహం ఆమె జీవితంలో అతి సామాన్య విషయం. అంచేత సహజసిద్ధమైన ధోరణిలోనే ముఖం పైకెత్తి, "ఏం చేశాడమ్మా, సర్వనాశనం?" అనడిగింది, పెద్దామె.

అతడి తరఫున నువ్వెందుకు అక్కా! జవాబు చెప్పటం? నేనెవరినడుగుతున్నానో, అతడికే తెలుసు, ఏంచేసిందీ" అంటూ మందలించింది, దుర్గ.

"మేమూ ఉన్నాము చూస్తున్నామమ్మా!—ఇంతమందిలో వచ్చి ఏమిటో మహా గద్దిస్తున్నావ్? మీ అమ్మాయిని చేసుకుంటానని అతడేమయినా పత్రం రాసిచ్చాడా? ఫోఫో—లోపలికి ఫో!—పండగపూటా హాయిగా సంతోషంగా ఉండాల్సిన సమయంలో మా ఇంటో తీరికూర్చుని జేనపుటా తగువులాటలూ మొదలెడుతున్నావా?" అని ఉరిమింది, స్వర్ణ.

అందుకు దుర్గామణి "నేనేం తగువులాట తీసుకురావటం లేదమ్మా, అక్కా!" అంది.

అతుడికేసి తిరిగి, ఇలా అన్నది: "ఏమయ్యా నాయనా!—ఈ యేటి కేడాదీ మేం ఎన్ని యమయాతనలు అనుభవించామో నీకేం తెలుస్తుంది, ఆ భగవంతుడికి తెలియాలి గాని. ఇలా చెయ్యాలనే అనా నీ మనస్సులో ఉద్దేశం? అలాగే అయితే మరి, ఆయన మరణకాలంలో ఎందుకు ఆశకల్పించావ్, నా తండ్రీ!—ఈ కాస్త మాటా అప్పుడే చెప్పేయ లేకపోయ్యావ్వా?—"

ఈ మాటకు స్వర్ణ ఉగ్రురాలయింది—"ఏమమ్మోవ్!—నువ్వుగానీ ఇలా భగవంతుడి పేరూ గీరూ చెప్పి బెదిరించావంటే, చెబుతున్నాగా, చాలాదూరం పోతుంది వ్యవహారం, తెలుసుకో!—" అంటూ దులిపి దుళ్లగొట్టింది.

అంతమంది ఎదట దుర్గమాటాడిన ఆ మాటలు అతుడికి చాలా అవమానమనిపించింది. అదీగాక ఇప్పుడు పెత్తల్లి వెనక అండ ఉందిగా? అది చూసుకుని, కంచు బద్దలు కొట్టినట్టు దుర్గకు ఇలా జవాబు చెప్పాడు:

"ఏమిటత్తా అలా ఆవేశపడతావ్? పెళ్లి చేసుకుంటానని నే మాట ఇచ్చానా? ఆరోజున నా కాళ్లట్టుకు విడిచి పెట్టిందే? మీ అమ్మాయి? కాళ్లమీదపడి తల పగల గొట్టుకోవటం కూడా ప్రారంభించింది. 'నీ నోటిమీదుగా నాన్నకి మాట ఇవ్వు' అంటూ వేధించేసింది. అటువంటప్పుడు నేనేం చేసేది? అంతమంది జనం ఎదట సిగ్గుతో చచ్చానన్న మాట! గత్యంతరం తోచక, కాళ్లు విడిపించుకునే టందుకని

''అలాగేలే' అన్నా! అలా అనేసరికల్లా ఇహ పెళ్లాడతానని మాట ఇచ్చినట్టేనా—?'

పక పక నవ్వింది, స్వర్ణ, "ఏమిటిరా అతుల్, నువ్వనేదీ?—స్వయంగా వచ్చి ఆ పిల్ల నీ కాళ్ళట్టుకుందా? నన్ను పెళ్లి చేసుకోమని చెప్పి తనకు తనే వచ్చి కోరింద అ?—? ఓయమ్మో!—ఎంత టక్కులాడీ!''—

అప్పుడు అతుల్ దుర్గవేపు తిరిగి ఇలా ప్రశ్నించాడు!

''ఏవమ్మా, దుర్గత్తా, నువ్వే చెప్పు. నిజమో అబద్ధమో? నా కాళ్ళు పట్టు కుని తల మోదుకోవటం నువ్వు చూళ్ళేదా? లేకపోతే ఈ పిల్లనా—నేను పెళ్ళాడ వచ్చానా? ఇంతకంటే నేను ఉరిపోసుకు చావటమే మేలుకదా? చావటానికి ఇంత తాడుముక్క దొరక్కపోతుందా?''

ఈ సంభాషణ ఆలకించిన అతులుడి స్నేహితులు నవ్వుకున్నారు. ఇదిచూడ దుర్గకు పిచ్చెక్కినట్టయిపోయింది. ఒళ్లూపై తెలియకుండా ఇలా అరిచింది.

''ఓరీ కృతఘ్నుడా!—ఆ తాడేదో నేనే కొనిపెడతా. చావు! నువ్వు చచ్చిపో!!—నీకు చావే తగినశిక్ష! ఏ పిల్లనయితే నువ్విప్పుడు ఇంతమందిలో అవమానించావో ఆ పిల్లే ఒకప్పుడు నిన్ను యముడి పాశాలనుంచి తప్పించిందిరా!—అంతా మరిచి పొయ్యావా, అప్పుడే?—కుచ్ఛుడా!!''

ఈ కేకలూ, గోలా ఆఖరావిడికి వినిపించింది. తను అస్వస్థతగా ఉన్నానన్న మాటే మరిచిపోయి, గబ గబ పరుగెత్తు కొచ్చేసింది. ఆమె వచ్చేటప్పటికి ఇక్కడ—

''అయితే ఫో!—నా యింటోంచి బైటికి పద, ఫోఫో—చెబుతూండే పద వేం?—'' అంటూ స్వర్ణ గంతులేస్తూ సివాలాడేసింది. దుర్గను అవతలికి గెంటి వేయబోయింది.

* * *

అక్కడే నించునివుంది జ్ఞానద. కాని కదలిక, చైతన్యం లేని ఒక పాషాణం లాగా నిలబడి వుంది. ఇప్పుడా అమ్మాయిని ఎగ్గూ సిగ్గూ, అభిమానం అవమానం మంచీ చెడుగూ—ఇవేమీ తాకటం లేదు. వీటన్నింటికీ అతీతంగా వుంది. మౌనంగా నిశ్శబ్దంగా వుంది. వెల వెలబోతూ చూస్తూ నించుంది.

ఇటువంటి జ్ఞానద ఆకారం చూసి ఆఖరావిడ భయపడింది, ఒక్క తోపుతోపి ''జ్ఞానదా!'' అని పిచింది.

''ఎందుకు పిన్నీ?''

''ఇంకా చూస్తూ నించున్నావెందుకమ్మా, మీ అమ్మని ఇంటోకి తీసుకురాక?''

వెంటనే జ్ఞానద "అమ్మా, పద!" అంటూ తల్లి రెక్కట్టుకు మెల్లిగా గదిలోకి తీసుకు వెళ్లింది.

* * *

చూశావా, "చెల్లీ!—ఆనందగారి అతిశయం? ఉట్టి కెగరలేనమ్మ స్వర్గాని కెగిరి నట్టుంది కదూ, మీ అక్కగారి కోరిక?" అన్నది స్వర్ణ, ఆఖరావిడతో.

నవ్వు ఉస్సూట్టు నటించి, అతులు దిలా అన్నాడు: "బుల్లత్తా, నీకళ్లతో నువ్వే చూస్తున్నావుగా ఈ గొడవంతా? సిగ్గు చేటు!"

ఖంగుమంటూ ఇలా చెప్పింది స్వర్ణ: "వేలంత పిల్లవుందో లేదో, ఇదేం ఘోర కలి చెల్లీ!"—

ఈ మాట అందుకుని, నవ్వుతూ ఆఖరావిడ అన్నది: "ఘోరకలి గనకనే బతికి పోయాం, అక్కా!—లేకపోతే—మరో కాలమే అయినట్టయితే ఈ పాటికి భూదేవి రెండుగా పఠాల్‌మని బద్దలై, కుంగిపోయేదే! ఏమంటావ్, అతుల్?—" అంటూ, తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఈ వెటకారంలో ఉండే అంతరార్థం గ్రహించలేక పోయింది, స్వర్ణ, "నేనూ అదే అంటున్నా" నన్నది.

స్వర్ణ గ్రహించలేక పోయింది గాని, ఆఖరావిడ మాటల్లో భావం అతులుడు పసి కట్టాడు. ఏమీ అనలేక స్తబ్ధులా కూర్చుండి పోయ్యాడు. చివరికి లేచి వెళ్ళిపోతున్న ప్పుడు—హోలీ పండక్కి వసంతంతో గుడ్డలు ఎర్రబడాలి, కాని అందుకు బదులుగా ముఖం నల్లబడి పోవాల్సి వచ్చిందికదా అని, అతులుడు తనలో తను అనుకున్నాడు.

# 8

ఇప్పటిదాకా అసలు విషయం గుట్టుగానే వుంది. ఆ గుంభన, గోప్యం మరి దాగ లేదు. ఇరుగు పొరుగుల అమ్మలక్కలు ఊరికే ఉంటారా? అతులుడికి ఈ యింటితో సంబంధం ఏర్పడిన సంగతి వాళ్ళ మాటల్ని బట్టి దుర్గకు తెలిసిపోయింది.

అనాధనాథుడి పెద్ద కూతురు మాధురి. పసితనంనుంచీ కలకత్తాలో మేనమామ గారింట ఉంటూ, మహాకాళీ పాఠశాలలో చదువుతూంది. ఇంగ్లీషు, బెంగాలీ, సంస్కృతం—మూడు భాషలు నేర్చుకుంటూంది. పాటా, వీణా, కార్పెట్స్ అల్లికా చేతనవును. చాలా అందమైన పిల్ల.

ఈయేడు పూజా సెలవులకు ఓ నెల్లాళ్ళపాటు ఉండిపోవాలని వచ్చింది. వచ్చి నప్పుడే—మాధురిని అతులుడికిచ్చి పెళ్ళి చెయ్యాలని మాటలు జరగటం, సంబంధం



స్థిరపరుచుకోవటం అంతా అయింది. ఎంత తపస్సు చేస్తేమటుకు అతులుడిలాంటి అల్లుడు దొరకడం సామాన్యమా? ఆ వరుడు తనంతట తానే లభించాడిప్పుడు. ఎంత అదృష్టం!—

ఈ ఏర్పాటుకి కీలకమంతా స్వర్ణ!—

* * *

ఆఖరావిడకి తల్లి బతికే వుంది. సోదరులున్నారు. కాస్త కలిగినవాళ్ళే "అమ్మాయిని పురిటికి ఇక్కడికే పంపంట" అని చెప్పి మనిషిని పంపారు. ఆ మనిషి వెంబడే ఇప్పుడు మాధురి కూడా వచ్చింది.

మాధురి చిన్నపెద్దమ్మని చూసి చాలా రోజులయింది. అంచేత వచ్చి నమస్కారం చేసింది. "దీర్ఘాయుష్మాన్భవ!" అంటూ దుర్గ పిల్లదాన్ని దీవించింది.

దీవించిన ఆ క్షణంనించీ దుర్గ తదేక దృష్టితో ఆ అమ్మాయికేసే చూస్తూ వుంది. ఏమీ?—

అసలే ఆ పిల్ల సహజంగా అందకత్తె. ఆపైన కలకత్తానగరంలో నివాసం. అక్కడ మేనత్తకు ఫేషన్లన్నీ తెలుసు గనుక, ఎంతో చక్కగా అలంకరించి పంపించింది. మాధురి మెళ్లో రెండు బంగారపు గొలుసులు, ఆమె కట్టుకున్న ఎర్రంచు చీరె చూసేప్పటికి దుర్గకు రెప్పలు మరి మూతపడలేదు. పెద్దగా నిట్టూర్చింది. "పిల్లకాదిది, బంగారపు బొమ్మ!" అనే మాటలు చటుక్కున ఆమె నోటినించి వెలువడ్డాయి.

అదేక్షణంలో తన పాదాలదగ్గర కూచునివున్న కళాహీనమైన ముఖం చూసేసరికి, ఆమె కళ్ళురెండూ భగ్గుమన్నాయి. పక్కకి తిరిగేసింది. నీరసించిన స్వరంతో "ఆఁ—నేనూ కన్నా, బిడ్డని! మసిబొగ్గుని!!" అనుకుంది.

గదిలోకి రాగానే, మాధురి రూపమూ, తీరూ చూసింది, జ్ఞానద. తన హీనత్వానికి చిన్నబోయి, భూమిలోకి కుంగిపోయినట్టయింది.

"అక్కా! రావే, మాటాడుకుందాం" అని పిలిచింది, మాధురి.

జ్ఞానద ఏం బదులు చెప్పిందో పైకి వినబడలేదు. కాని, ఆ శబ్దం వినగానే దుర్గ, "ఈ పాడులోకానికింక నీ ముఖం చూపించకే, జ్ఞానీ!—ఇక్కడే పడివుండు!" అన్నది. మాటాడక జ్ఞానద అలా కూర్చునే వుంది.

* * *

మాధురి వెళ్ళిపోయినా, దుర్గకు మనస్సులో ఇదిగానే వుంది. బాధకొద్దీ రెండుసార్లు "ఉస్!—ఉష్!—" అనుకుంది. వంటో బాధయేమో ననుకుని జ్ఞానద "అమ్మా!—కాస్త కణతలు నొక్కమంటావా? నొప్పి తగ్గుతుందేమో!" అన్నది.

"వద్దు."

"మరో మోతాదు మందివ్వనా?"

"అబ్బా, వద్దే. పోవే, నా పక్కమీదినించీ. నీ ముఖం చూసిన కొద్దీ నాకు ఒళ్ళు మండిపోతూందే, దౌర్భాగ్యురాలా!—" అంటూ కూతుర్ని కాలితో కిందికి తోసేసింది!

కన్నతల్లే కావచ్చు. ఇంతవరకు ఎన్ని అన్నా, ఏం చేసినా సహించింది, జ్ఞానద. కాని, ఇలా కాలితో తోసెయ్యడంమటుకు సహించలేకపోయింది. మంచంమీదినించి దిగి, కిందని చాపమట్టగా పడిపోయింది. ఆపడటంతో అక్కడ ఆమె కన్నీళ్ళతో నేలంతా తడిసిపోయింది.

చేతులు రెండూ ఎదురుగా చాచింది. భగవంతుణ్ణి తలచుకుని, మనస్సులో ఇలా మొద్చుకుంది.

"భగవాన్! ఈ లోకంలో అందరికీ ఎంచేత నేను శూలంలాగా అయిపోయాను? ఎవ్వరికేం అపకారం చేశానని? నాకు రూపం లేకపోవడం నా తప్పా? నగా, నాణాలు లేకపోతే నా తప్పా? తండ్రిపోయాడు. అదీ నా దోషమేనా? జబ్బుపడి లేవటంచేత ముఖం పాలిపోతే అది చూట్టానికి అందరూ అసహ్యపడితే, నేను చేసిన పొరపాటేనా? నాకు వయస్సు దాటిపోతూండటం, పెళ్ళిచేసే పెద్దదిక్కు ఎవరూ లేకపోవటం నా అపరాధమేనా; ప్రభూ!—ఇన్ని దోషాలతో నేను బతికుండి ఏమిటి సార్థకం? నన్ను నా తండ్రిదగ్గరికి పంపించెయ్. దేవా!—ఆయన నన్నెన్నటికీ తోసి పారెయ్యలేదు. ప్రభూ!—"

అంతలో దుర్గ మళ్ళీ ఇటుకేసి తిరిగి, "జ్ఞానదా!—" అని పిలిచింది.

తల్లి పిలవగానే కంటతడి తుడిచేసుకుని, గబగబా లేచి కూర్చుంది, జ్ఞానద.

"జబ్బుపడ్డ వాళ్ళుకదా, కిందని తడినేలమీద కూర్చుంటావెందుకు తల్లీ!" అని జాలితో, తనంతట తనే లేచి కూర్చుంది, దుర్గ.

"పాడు పీనుగుని. నిన్ను తిట్టానా అమ్మా!" అంటూ రెండు చేతులూ చాచి, కూతుర్ని దగ్గిరగా తీసుకుని, గుండెకు హత్తుకుని ఏడ్చింది.

* * *

అనాధనాధ్ ఇవాళ సాయంత్రం దుర్గ గదిలోకి వచ్చాడు.

"ఎలా వుందమ్మా, వదినా? పడుకో, పడుకో, లేవొద్దు. మందూ మాకూ యేం సరిగ్గా పుచ్చుకోవటం లేదుట? అలా అయితే, ఎప్పటికమ్మా నయమయేదీ?—" అని చెప్పి సానుభూతిగా కుశల ప్రశ్నలు వేశాడు.

అనాధ్ అన్నమాటలు నిజమే. అసలు, ఆవిడ మందు తాగటమే మానుకుంది. ఎందుకంటే, బతుకుతానని ఆశలేదు, బతకాలని వాంఛాలేదు, దుర్గకు. కనుక ఆ యిచ్చేమందు ఇవ్వకపోయినా వచ్చే నష్టమేం లేదు.

ఇప్పుడామె కంఠస్వరం మనిషి మరీ దగ్గిరకు వెళితేగాని వినిపించనంతటి క్షీణమైపోయింది. ఇన్నాళ్లూ లేంది, ఇప్పుడు హఠాత్తుగా మరిది కనపరచిన ఆప్యాయతకు ఆమె మనస్సులో సంశయం పుట్టింది.

అతడిప్రశ్నకు ఆమె ఏం చెప్పిందో మనకి వినబడదు. అనాధుడు చాలా శ్రమపడి చెవియొగ్గి విన్నాడు. ఎలాగో, విని, "అయితే అది నిజమే అనుకోవాలా?" అంటూ మళ్ళీ ప్రశ్నించాడు.

ఒక స్త్రీ వితంతు వయాక ఇంకా బతికి వుండటం కేవలం వ్యర్థం. ఎంతమాత్రం ప్రయోజనం లేదు. ఈ విషయంలో ఏ హిందువూ కూడా అవునని వాదించి నెగ్గలేడు. అందుకనే, ఆత్మహత్య చేసుకోలేక, ఎలాగో అలా సంసారాలు ఈడుస్తున్నారు, ఈనాటి స్త్రీలు.

ఈ సందర్భంలో అనాథనాథ్ ఇలా చెప్పాడు దుర్గతో:

"వదినా!—నీ ఒళ్ళు చూడబోతే ఇలా జబ్బు స్థితిలోవుంది. ఇటువంటప్పుడు ఈ సంగతులు నీతో చెప్పకూడ దనుకో. అయినా, వూరుకుందామంటే వీల్లేకొచ్చింది అందుకని. నే ననేదేమిటంటే—నావల్ల ప్రయత్న లోపమేమీ జరగలేదన్న సంగతి నీ కళ్ళతో నువ్వే చూస్తున్నావు. కాని, పిల్ల వత్తి దురదృష్టవంతురాలు కాబట్టంచేత ఎక్కడా ఒక్కటీ కలిసిరాలే. ఏడెనిమిది సంబంధాలు వచ్చినట్టే వచ్చి, తీరా చేతి కందిన ఫలం జారిపోయినట్టయిపోయింది. అన్నింటికన్నీ భగ్నమై పోయాయి ఒక్కమాట చెబుతా, వదినా!—మరోలా అనుకోకు: పిల్లదాన్ని చూస్తే ఎవళ్ళకీ నచ్చటం లేదు!"

మాటాడలేదు, దుర్గ.

కాస్సేపాగి, మళ్ళీ ప్రారంభించాడు: "చిన్నన్నయ్య పోగానే నువ్వు మా సంసారంలోకి వచ్చావు. అవునా? ఇంత గందరగోళం రావటానికల్లా అదే కారణమనుకో!—నీకు తెలుసుగా, మన పొరుగునున్న నీలకంఠ ముఖర్జీ? ఇంటింటికీ పోయి లేనిపోని ప్రచారం చేసివచ్చేవాడు, ఇప్పుడు కదా, వెళ్ళటం మానుకున్నాడు? అసలింతకీ వాళ్లూ వాళ్లూ ఏదో అన్నారంటే వాళ్ళదోషం ఏముందిలే? మనకి మాత్రం కన్పించటంలే, స్పష్టంగా? అమ్మాయి వయస్సు?—ఇదే గొంతుక పట్టుకుంది అందరికి

"ఇదేం మహాపట్నం కాదు, వదినా!—ఒట్టి పల్లెటూరు. ఇలాంటి పల్లెటూళ్ళలో ప్రతి సంసారిగొడవా తక్కిన అందరికీ కావాలి. వాళ్ళకెందుకూ అంటే కుదరదు ఒక్కొక్క విషయం తీసుకున్నారంటే, ఎంత హంగామా! ఎంత లేనిచర్చలు అనుకున్నావ్? ఊ(—?" అంటూ పెద్దగా నిట్టూర్చాడు.

ఎందుకోసమయితే అతడీ ప్రస్తావిక ప్రారంభించాడో, ఇది పోయి పోయి ఏ వివర్ని తేలుతుందో ఏమీ అంతుపట్టలేదు, దుర్గకి. అంచేత చూస్తూ ఊరుకుంది ఏమైనా, తుదా మొదలూ కనిపించని సందేహచ్ఛాయలు మాత్రం ఆమె ముఖంమీద కనిపిస్తూనే వున్నాయి.

కొంచెం వెనకా ముందాడిన తరవాత, అనాథుడు ఇంకోమాటు సకిలించి, అసలు గుట్టు ఇలా బయట పెట్టాడు:




"చూడు వదినా!—ఇప్పుడున్న పరిస్థితిలో నువ్వెక్కడికయినా వెళ్ళడమన్నా రావడమన్నా జరిగేపనికాదు. నే చెప్పొచ్చే మాటకూడా అదికాదు కాని ఏంచేసేది. చిన్నవదినా!—మా అమ్మాయికీ పెళ్ళిడు వచ్చేసిందికదా! అందుకని, నేచెప్పేదేమిటంటే— ఎటుపోయి ఎటొచ్చినా, నా కాపుదల నే చూసుకోవటం కూడా అవసరమే. కనుక, నేననేదేమిటంటే, వదినా!—మన జ్ఞానిని ఇప్పటిమట్టుకి ఎక్కడికో అక్కడికి పంపేతీరాలి. అది ఇక్కడ ఈ యింటో ఉండటానికెంతమాత్రం వీల్లేదు. ఉంటే, చాలా గందరగోళమవుతుంది" అన్నాడు.

దుర్గకి గొంతుకలో మాట గొంతులోనే వుందికాని, పెదవి దాటి రాలేదు.

"అది ఎక్కడికెళుతుంది, మరిదీ?"

"ఎక్కడికేమిటి? హరిపాల్‌కే వెళ్ళమను."

"ఎట్లా వెళుతుందయ్యా మరిదీ, అక్కడికీ! వెళ్ళి ఏమైపోతుందీ?" అనడిగింది.

ఈమాటు కోపం వచ్చింది అనాధుడికి. "వదినా!—నువు మాటాడేదంతా మహా అన్యాయం. నీసంగలే నువు చూసుకుంటే, తక్కినవాళ్లేమైపోనూ? ఆపదసమయంలో

నువ్వు ఎవరికుటుంబం మీదికైతే వచ్చిపడ్డావో, వాళ్ళ మంచిచెడ్డలు కూడా కాస్త ఆలోచించొద్దూ, నువ్వు?''

ఏమీ బదులు చెప్పలేకపోయింది, దుర్గ. ఒక్క నిట్టూర్పు విడిచింది.

అతడి కంఠస్వరం కాస్త జాలిగా, మృదువుగా మారింది. మళ్ళీ ఇలా అన్నాడు:

''నాకు తెలుసు—ప్రస్తుతస్థితిలో నేనన్నమాట నీకు ఇబ్బందిగానే వుంటుందని. కాని వేరేవారి?—ఇంతకీ, అసలు నీవల్ల కూడా కొంత దోషం లేకపోలేదు. వదినా!—మీ అన్నయ్యకు ఉత్తరం రాశాను ఆయన స్పష్టంగా జవాబిచ్చాడు. అక్కడ పెళ్ళిప్రయత్నాలన్నీ పూర్తి అయినాయిట? పెద్దపెద్ద కోరికలేవో మనసులో పెట్టుకుని జరగనిదానికి ఆశపడి, కోపంతో పిల్లదాన్ని తీసుకువచ్చేశావుట?—లేకపోయి నట్టయితే, ఎంతో సులువుగా....''

ఇంకేం విప్పిచెప్పలేదు, అనాధుడు.

అంతా గ్రహించింది, దుర్గ.

ఎటువంటి హంగామా లేకుండా, పైసా ఖర్చు కాకుండా, ఈ బాధ్యత వదుల్చుకో టానికి తగిన ఉపాయం దొరికిందిప్పుడు, అనాధుడికి.

ఇంత చక్కటి అవకాశం వొదులుకుంటాడా?—అతడు వెళ్ళిపోయాడు.

కాస్సేపయాక—పనులు పూర్తిచేసుకుని తల్లిగదిలోకి వచ్చింది, జ్ఞానద అముఖం చూసి భయపడిపోయింది! అసలే నెత్తురులేక, గుంటలు పడిపోయిన దుర్గకళ్ళు ఇప్పుడు జ్యోతుల్లాగా ఎర్రబడిపోయాయి.

కూతుర్ని చూడగానే దుఃఖం పొర్లుకువచ్చింది. దగ్గిరకి పిలిచి, కూతురి ఒళ్లో తల దాచుకుని, ఇవాళ చిన్నపిల్లలాగా వెక్కి వెక్కి యేడ్చింది.

ఏడుపు తగ్గాక, తల్లిని ఇలా సముదాయించింది, జ్ఞానద: ''అమ్మా!—నీనుంచి నన్నెవ్వరూ వేరు చెయ్యలేరమ్మా! నన్నెరగవా నువ్వు?—ఎందు కేడుస్తావ్? ఈయిల్లు కర్మాయ్ ఒక్కడిదే కాదు, మనదిన్నీ. కోపంవస్తే ఆయన మనకి తిండిపెట్టడు. అంతేనా? పెట్టకపోతే పోనీ. ఆ మాటా మాణిక్యం ఆయనకే దక్కనీ. ఎలా అయినా నీకు నేను తిండి తెచ్చిపెడతానమ్మా! బెంగెట్టుకోకు!!—'' అంది.

ఇవాళ కూతురే తల్లిఅయి, తల్లిని ఒళ్లోకి తీసుకు బుజ్జగించింది, ధైర్యం చెప్పింది. అలసిపోయివున్న తల్లికి ఇట్టె నిద్దరట్టేసింది!—

కూతురికిమాత్రం అర్థరాత్తిరయినా నిద్రపట్టలేదు. మేలుకునేవుండి, ఆలోచనలో పడింది. ఎంత ఆలోచించినా తల్లికి తిండి ఎలా తెచ్చిపెట్టడమనే సమస్య అలాగే



విలిచివుంది కాని పరిష్కారమార్గం ఏదీ తోచలే. ఇహ నేమిటి జరగటం?
ఎక్కడినించి ఏవిధంగా తను తల్లికి తిండి తీసుకొచ్చి పెట్టడం?....

*　　　*　　　*

వెంటనే ఇక్కణ్ణించి జ్ఞానదను పంపించెయ్యక తప్పదని అనాథుడు వదినగారిని శాసించినట్టు ఆఖరావిడకు తెలియ వచ్చింది.

ఆమె భర్తని పిలిచింది: "మీ కిదేం దుర్బుద్ధి? వాళ్ళిటువంటి దిక్కుమాలిన స్థితిలో ఉండగా పెద్దవదినగారు సలహా ఇచ్చిందికదా అని చెప్పి, తల్లినుంచి కూతుర్ని విడదియ్యమని చెప్పొచ్చారా? గొడ్లని కొనుక్కునే కసాయివాడయినా నయం. మీకంటే? మీకు లేదుకాని, వాడికయినా కాస్త హృదయముంటుందండీ!" అంటూ చెరిగేసింది.

ఏమైనప్పటికీ, తను అనుకున్న పని జరిగే యత్తులేదని నిశ్చయించి, ఊరుకున్నాడు, అనాథనాథ్.

ఇంత జరిగాక—ఈ అవసానకాలంలో దుర్గ కూతుర్ని తీసుకుని హరిపాల్ వెళ్ళేదే. కాని, అక్కడున్న వరుడు తలపుకొచ్చే సరికల్లా ఆవిడకు గుండె దడ దడ మొదలెట్టింది. ఏమీ?—ఆ మహానుభావుడు గర్భిణితో వున్న అయిదుగురు బిడ్డల తల్లిని కడుపుమీద కర్రతో కొట్టిచంపిన ఖూనీలరాయడు!—

మర్నాడు—

దుర్గామణి అనాథ్‌ని తన మంచందగ్గరికి పిలిపించుకుంది. అతడి రెండుచేతులూ పట్టుకుంది.

"మరిదీ!—వరసకి నేను నీకన్న పెద్దదాన్నయిపోయాను. కావి, లేకపోతే ఇవాళ నీ కాళ్ళు రెండూ పట్టుకుని బతిమలాడవలసినదాన్ని. నీకు ఎలా చెయ్యాలనుంటే అలా చెయ్యి. కాని, ఈ స్థితిలోమటుకు నా దగ్గర్నుంచి పిల్లదాన్ని విడదీసి ఎక్కడికీ పంపొద్దు" అని చెబుతూ జ్ఞానద చెయ్యి తీసుకుని అతడి చేతిలో పెట్టింది

చెయ్యి వెనక్కి లాక్కున్నాడు, అనాథ్.

"ఆదరణ విషయంలో నేనేమన్నా నీకు లోపం చేశానా అమ్మా, చిన్న వదినా? కావి, ఈ శకునపక్షిని చూసి కాటికి కాళ్ళు చాచుకున్న ముసిలాడు కూడా ఇష్టపడటంలే. నేనేం చేసేది? కనుక, ఇతరుల బాధ్యత మాత్రం మీద వేసుకోవటం నావల్ల కాదు. నన్ను బలవంత పెట్టకు—అన్నట్టు వదినా!—నీ చేతివి మురుగుల జత ఉండాలిగా, ఏమైపోయిందీ?" అనడిగాడు.

"ఇంకెక్కడుంది, మరిదీ!—అది మీ అన్నగారి శ్రాద్ధానికే ఖర్చయిపోయిందిగా!" అని చెప్పింది, దుర్గ.

చేతులు రెండూ వెల్లకిల పెట్టి, "అలాగా? అయితే ఇహ నేనేం చేసేది? ఒకపైసా ఇవ్వనూ లేవూ, కూతుర్ని విడిచిపెట్టనూ లేవు. మరి, నా నెత్తెక్కి కూర్చుని, నన్ను ప్రాంతం ముంచేదామనా యేం?" అంటూ అక్కణ్నించి కోపంగా వెళ్ళిపోయాడు.

కాస్సేపు వూరుకుంది, దుర్గ. కూతురి చెయ్యి విదిలించి పారేసింది "ఇంకా కూర్చున్నావేం, మొద్దూ!—దీపం వెలిగించక...." అన్నది.

ఈ సంప్రదింపులతో, సంభాషణలతో జ్ఞానద మనస్సు దహించుకుపోయింది పరధ్యానంగా కూర్చుంది.

ఇప్పుడు తల్లికి మనస్సు మరీ వికలమైపోయింది. జ్ఞానద ఇవాళ చెప్పేలోపలే మరింత పాషాణంగా తయారైంది.

"ఇహామీదట చావుకన్న వేరే దారేం కనిపించటం లేదు. ఇంకా ఏదో అదృష్టం కలిసొస్తుందని ఆశ పడి, కలలు కంటున్నావా?—హుఁ—జ్ఞానీ!—ఇన్నితిట్లూ చివాట్లూ




తింటున్నా. నీ ప్రాణాలు పోవటం లేదేమే!

"చూడు, ఆ యదుఘోష్ కొడుకు—ఒక్క మూడురోజులు సామాన్యపు జ్వర మొచ్చి చచ్చి ఊరుకున్నాడు. సంవత్సరంపైగా జ్వరంపడినా, ఆ యముడితో యుద్ధం చేస్తున్నావు గాని, నీకు చావు మూడకుండా వుందే! ఇంత పరాభవం జరిగి నందుకు, నువు గనక ఇంకా బతికుండి ముఖం చూపిస్తున్నావు గాని, మరో ఆడ పిల్లయితే ఎప్పుడో ఏట్లోపడి చచ్చేది!—పో పో!—నా యెదటనించి లేచి పో, కాస్సే పయినా—ఒక్క నిమిషం సేపు విశ్రాంతి తీసుకోనీ నన్ను." అని బాధ వెల్లడిస్తూ అటువేపు తిరిగి పడుకుంది.

తల్లి పడుతున్న వేదనలో కొంత వాస్తవం లేకపోలేదు. నిజానికి, ఇటువంటి అసహ్య పరిస్థితుల్లో పడిన పిల్ల మరొకతె అయితే తప్పకుండా ఆత్మహత్య చేసుకునే వుండును. అలాటివాళ్ళని రోజూ ఎంతమందిని చూస్తున్నాం కాదూ?—

అయితే—ఈ పిల్ల మనస్తత్వమే వేరు. అర్థంలేకుండా దేనికీ హడావిడి పడే మనిషి కాదు. ఈమెను భగవంతుడు భూదేవికున్నంత ఓరిమితో పుట్టించాడు. కనుక ఇంతవరకు జరిగిన గొడవలూ, కఠినమయిన మాటలూ యేం పట్టించుకోలేదు. ఏమీ జరగనట్టే వుండి, మామూలుగా మసులుకుంటూంది.

ఇప్పుడు తల్లి దగ్గర్నించి నిశ్శబ్దంగా లేచివెళ్ళి, యథాప్రకారం ఇంటి పనులు చూచుకుంటూంది.

కన్నతల్లి అంతగా నిందించినా, అదంతా క్షణంలో మరిచిపోయింది. "అమ్మా!— చచ్చిపోవటం మేలన్న సంగతి నువ్వు చెప్పక్కర్లేదమ్మా! నాకూ తెలుసు. ఈ కళ్ళతో నీ బాధ చూడలేక, ఎంతయినా సహించి, ఇంకా బతికున్నాను తల్లీ!—" అంతకంటె మరేం లేదు!" అన్నది.

ఇంటో దీపం పెట్టింది, జ్ఞానద. గంగాజలం తెచ్చి తులసికోట శుద్ధి చేసింది. ఇంకో చిన్న ప్రమిదలో దీపం వెలిగించి, తులసికోట దగ్గిరకి తీసుకెళ్ళింది. వంగ దేశపు కన్యలకు ఈ తులసే ఇలవేల్పు, ఇష్టదేవతాను. కనుక, ఎంతో భక్తితో ఆరాధించటం చిన్నప్పట్నించీ నేర్చుకుంటారు.

ఇప్పుడు, జ్ఞానద తులసిదగ్గరకు వచ్చేసరికి వశం తప్పినట్టయిపోయింది. సాష్టాంగ నమస్కారంచేసి, చేతులు రెండూ జోడించి, అక్కడే దొర్లడం మొదలెట్టింది.

"దేవుడా, దేవదేవా, దయామయా! ఇక్కడ పడుకుని వుండగానే మా నాన్నను తీసుకెళ్లావు. ఇప్పుడు నన్ను మా తల్లి ఒడినించి తప్పించి నన్నుకూడా మా నాన్న దగ్గరికి తీసుకెళ్ళిపో, భగవాన్!—ఇహ నే సహించలేను, ప్రభూ!—తీసుకెళ్ళిపో, దేవా!—తీసుకెళ్ళిపో, స్వామీ!!" అంటూ అపరిమితమయిన హృదయావేదనతో యేడ్చేసింది.

## 9

పుట్టింటి కెళ్ళడంకోసమని లోగడ చైత్రమాసంలో ప్రయాణం పెట్టుకుంది కదా, ఆఖరావిడ. కాని పడలేదు. వైశాఖం ప్రవేశించిందీ అనగానే ఆవిడ తమ్ముడు వచ్చాడు—ఆవిణ్నీ, మాధురినీ తీసుకెళ్ళటానికి.

తిధి వార నక్షత్రాదులన్నీ చక్కగా కుదిరాయి. ఇవాళ చాలా అనుకూలంగా వుంది ప్రయాణానికి. ఇహ భోజనాలు కాగానే బయల్దేరటమే ఇప్పుడు అతులుడు ఇంటికి వచ్చి ఇక్కడే వున్నాడుగా? అందుకని అతణ్ణి కూడా భోజనానికి పిలిచింది, స్వర్ణ.

భోజనాల సమయమయింది. ఆఖరావిద తమ్ముడూ, అతులుడూ బంతిని కూర్చు న్నారు. వడ్డన పని ఇవాళ మాధురిది.

అయితే—పొద్దున్నే వంటా అదీ చేసింది జ్ఞానదే [illegible] అన్నీ చేయించారు. కాని, ఈ విషయం చాలా గుట్టుగా [illegible] సంగతి అడిగారు. వెంటనే స్వర్ణ తడుముకోకుండా [illegible] "[illegible] అదేంమాటా! దాన్ని మేం అసలు వంటింటి గుమ్మమే తొక్కని[illegible]..."

వంటకే పనికిరానిది వడ్డన కెలా పనికొస్తుందీ? కనుక, స్వర్ణ దృష్టిలో జ్ఞానదకు ఈ పనులు రెండూ నిషేధమే. అదీగాక, సిగ్గుచేత అసలు జ్ఞానదాయే ఎవళ్ళెదటికీ రావటం మానుకుంది. వీళయినంతవరకు ఎవరి కంటా పడకుండా తప్పించుకునే మసులుతోంది.

* * *

అతులుడికీ మాధురికీ పెళ్ళవుతుంది. సహజంగానే మాధురి అమిత సౌందర్యవతి. ఇప్పుడీ సమయంలో ఆ కన్యకామణి ఎంతో చక్కగా అలంకరించుకున్నది. ఎక్కడలేని సిగ్గూ తెచ్చి పెట్టుకుని, చేతనయీ చేతగాకుండా వడ్డన చేస్తూంది. చేస్తూంది గాని, అన్నీ పొరపాట్లే. పెత్తల్లి స్వర్ణ ఆ అమ్మాయి వెంబడే ఉంటూ, "ఓసి వెర్రిపిల్లా, అలా కాదమ్మా, ఇలానే తల్లీ!—" అని చెప్పి తమాషాగా సర్ది పుచ్చుతూ, ఏం చెయ్యాలో నేర్పటం మొదలెట్టింది.

ఏ కన్యనయితే ఆనాడు లోకులు "నువ్వెందుకూ పనికిరావు" అని చెప్పి ఒక మూలకి నెట్టివేశారో, ఆమె ఇప్పుడు వంటింటో తల వంచు క్కూర్చుని, వడ్డనకు కావలసిన పదార్థాలన్నీ అమర్చి, అందిస్తూంది.

భోజనాలవు తూండగా స్వర్ణ వూరికే ఉండక, మాధురి వివాహ ప్రసక్తి ఎత్తింది. సిగ్గుతో ఆ పిల్ల వంటింటోకి తుర్రుమంది.

"చెల్లీ, ఏంకావాలీ?" అనడిగింది, జ్ఞానద.

"ఏమీ అక్కర్లేదు అక్కా!—ఈపని ఇహ నావల్ల కాదు, బాబూ!—" అంటూ చేతిలో పళ్ళెం కింద పెట్టేసి, ఎక్కడికో వెళ్ళిపోయింది.

ఆ క్షణంలోనే స్వర్ణ "కాస్త ఉప్పు వడ్డించి వెళ్ళమ్మా!" అని కేకేసింది, మాధురిని.

అక్కడ వుంటేగా, రావటానికి?

"ఎక్కడి కెళ్ళావే, మీ మామయ్య కనిపెట్టు క్కూర్చుంటే?" అని మళ్ళీ పిలిచింది.

అప్పుడూ ఎవళ్ళూ పలకలే.

ఈ మాటు కోపంగా, "ఎవళ్ళకీ వినపడటం లేదా, యేం? ఇహ వీళ్ళు భోజనాలు వదిలి లేచి వెళ్ళి పోవల్సిందేనా?" అంటూ గట్టిగా కేకేసింది.

అప్పటికీ రాలేదు, మాధురి.

అయేసరికి జ్ఞానద ఊరుకోలేక పోయింది. ఇప్పుడు గట్టిగా కోప్పడుతూ వేసిన కేక తనని ఉద్దేశించే అయివుంటుందని అనుకుంది.

ఆ మాసిపోయిన చిరుగుల చీరె ఒళ్ళంతా కప్పుకుని, ఉప్పు పట్టుకుని మెల్లిగా గుమ్మం దగ్గిరకి వచ్చి నిలబడింది.

భోం చేస్తున్న యువకులిద్దరూ ఆమెను గమనించలేదు. పెద్దమ్మ మాత్రం జ్ఞానదని రెండు మూడు సార్లు ఎగాదిగా చూసి, "నిన్నెవరే రమ్మన్నదీ? ఏదీ మాధురి?" అని కసిరింది.

గుమ్మం అవతలినించే జ్ఞానద మెల్లిగా చెప్పింది: "ఎక్కడి కెళ్ళిందో?"—

"అందుకని నువ్వొచ్చావా?—ఎన్నిసార్లు చెప్పాలి, నీకు?—నీమొహం చూస్తే చాలు, ఏడు తరాలవాళ్ళు నరకకూపంలో పడిపోతారని చెప్పలే?—అతులుడు భోజనానికి వచ్చాడు కదా, ఈ విధంగా ఒకమాటు కనబడతాడు కదా అని చూదొచ్చావా? పో—నాఎదటికి రాకు!—ఉప్పుగిన్నె అక్కడపెట్టి, వెనక్కి మళ్ళు!"—అంటూ గద్దించింది.

గిన్నె అక్కడ పెట్టేసి, జ్ఞానద వెళ్ళిపోయింది.

స్వర్ణ తనే ఉప్పు తీసుకు వడ్డించింది. మళ్ళీ ఎప్పటిలా కూర్చుంది అతులుడికేసి చూస్తూ ఇలా అంది: "మగమహారాజువి. నీకెందుకయ్యా అంతసిగ్గు? తలవంచుకూర్చుంటావేం?"

అప్పుడు మాధురిమామ "ఆమె ఎవరమ్మా, అక్కా?" అనడిగాడు.

స్వర్ణ చిరునవ్వుతూ, "ఎవరూ కాదులే. మీరు భోజనాలు కానీండి" అన్నది.

ఇంకిప్పుడు అతులుడికి భోజనం నోటికి పోతే. ఒక్క పూరీముక్క తిందామంటే కూడా. గొంతు దిగలేదు, మింగుడు పడలేదు.

ఒక్క విషయం మటుకు నిశ్చయం. అతడు మాధురిని చూపి భ్రమించాడనేది యదార్థం. ఇందులో పొరపాటు లేదు. అయితే—జ్ఞానదా ఎలాంటిదో ఇదివరకే అతులుడు బాగా ఎరుగును. ఆమె తనని ప్రేమిస్తోందో లేదో ఇప్పటికీ సరిగ్గా తెలియదు. ఒకప్పుడు ఆమె ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమిస్తూండేదన్న సంగతి మాత్రం అతడు మరవలేదు. అతడి ఎదట పడటానికి ఆమె లోగడా ప్రయత్నించలేదు, ఇప్పుడూ ప్రయత్నించలేదు. అటువంటి పిల్ల ఇప్పుడు తనని చూడటానికని ఏదో వంక పెట్టుకు వచ్చిందంటే, ఆమాట ఎలా నమ్ముతాడతడు?

• • •

కూతుర్ని తీసుకుని ఆఖరావిడ పుట్టింటి కెళ్ళడం ఇవాళ మధ్యాహ్నం. వెళ్ళబోయే ముందు ఆవిడ ఎలాగో వీలుచూసుకుని, వంటింటోకి వచ్చింది. జ్ఞానద చేతిలో



ఒక్క పదిరూపాయిల నోటుపెట్టి, గుప్పెట మూసేసి, చల్లగా జారుకుంది. జ్ఞానదకు మంచి నమస్కారమయినా అందుకోకుండా అంత తొందరగా వెళ్ళిపోయింది.

ఆ పిల్లదాని మనస్సు ఎరిగినామె ఆ యింటో ఆఖరావిడ ఒక్కర్తే. అటువంటి శ్రేయోభిలాషి ఇవాళ ఇంకోచోటికి వెళిపోతూంది. ఆమె అక్కడ ఎన్నాళ్లుండాల్సి వస్తుందో చెప్పలేం. ఒకవేళ ఇక్కడే ఉన్నప్పటికీ, చెయ్య గలిగిందేమీ లేదనుకోంది.

ఒకళ్లు కష్టపడుతూంటే మనం బాధపడటం, ఆ కష్టాన్ని తప్పించటానికి ప్రయత్నించడం—రెండూ ఒకటి కాదు. కష్టంచూసి సానుభూతిగా తమ బాధనూ

విచారాన్ని వెల్లడించవచ్చు కాని, ఒక వ్యక్తియొక్క కష్టాన్ని తప్పించే యత్నం అందరూ చెయ్యలేరు. ఇప్పుడు రెండోమార్గాన్ని అనుసరించగల తన పినతల్లి కూడా వెళ్ళిపోవటంతో జ్ఞానదాకు అంధకార బంధురమైపోయింది.

* * *

నడి వైశాఖమాసం. అనాధ్ ఒకనాడు ఆఫీసుకి వెళ్ళబోతున్నాడు. అప్పుడు స్వర్ణ చెప్పలేని విచారాన్ని తెచ్చిపెట్టుకుని, వచ్చి నిలబడింది.

"ఏం వదినా, ఏం జరిగిందేం?" అని ఆత్రంతో ప్రశ్నించాడు.

"మీ చిన్నవదిన సంగతి చూశావా?"

"నాకేం తెలియదే!" అన్నాడ, వెలవెలబోతున్న ముఖంతో.

"ఉహూం—అదికాదులే. ఇప్పుడింతలో ఆవిడగారికేం ప్రాణభయం లేదులే. కాని ముందు జాగ్రత్తకోసం చెబుతున్నా—మహా బతికితే ఒక్క పదిహేనురోజులు అంతకుమించి దాటదు. ఎటుపోయి ఎటొచ్చినా, తరవాత ఏడాదిదాకా పిల్లదాని పెళ్ళి చెయ్యటానికి వీలుండదు.

ఏమైనాకానీ—మాధురిపెళ్ళి ఈ జ్యేష్ఠంలో చేసేతీరాలి. కాదనటానికేం వీల్లేదు ఎవరేం చెప్పినా నే వినేదిలేదు. కుర్రవాడికి నచ్చింవాయె, బంగారంలాంటి సంబంధం జాప్యంచేసుకుని జారవిడుస్తానా, నేను?" అన్నది స్వర్ణ.

"అబ్బే, అలా అంటావేమిటి వదినా!—మా సంసారానికి యజమానివి, పెద్దవి సమస్తమూ నువ్వే. నీమాట కేవిషయంలోనూ తిరుగనేది లేదు. మీ అమ్మాయిని మీ మేనల్లుడికిచ్చి చేసుకోటానికి మధ్యని నా ఆటంక మేముందీ? ఏక్షణమందు చేసు కున్నా సరే, మేం సిద్ధమే. నాఅడ్డు ఏమీ లేదని నమ్ము!" అని చెప్పాడు అతులుడు భయపడుతూ.

అందుకు స్వర్ణ ఇలా హెచ్చరించింది. తక్షణ్: "నాకు తెలుసునయ్యా మరిదీ, బాగా తెలుసు. నామాట కెన్నడూ నువ్వు అడ్డు పడేవాడివి కాదనీ ఎరుగుదును, ఎటువంటి ఆటంకం చెప్పవనీ ఎరుగుదును. ఆ సంగతి తెలిసే, ఇప్పుడు నే చెప్పినట్టు చెయ్య మంటున్నా. ఒక్క క్షణమయినా ఆలస్యం చెయ్యకు. ఏమైనాసరే, వాళ్ళనిదారిపెట్టి బయ టికి పంపించెయ్, ఆవిడగారుంటే మాధురి పెళ్ళి జరగనే జరగదు, తెలుసుకో!—

"ఇప్పటికే వీధీ వీధంతా రకరకాలుగా చెప్పుకుంటున్నారు. దానికితోడు మళ్ళీ ఇంకో గొడవ జరగాలా?—నే చెప్పాల్సింది చెప్పేశా. నీ మనస్సుకి నువ్వు బాగా ఆలోచించుకో. ఒక్కటేమాట—అదెప్పటికయినా నీకు గుండెమీద కుంపటే, కనుక



ఏదోలాగ తోసిపారేసెయ్. లేకపోతే నువ్వు కూడా నాశనమైపోతావ్. ఇదే చెప్పకం!—''

''అదెప్పటికయినా గుంటెమీద కుంపటే''—అంటూ మరీ మరీ చెప్పింది. స్వర్ణ. నూరి పోసింది. అంచేత అతడికీ మాట హృదయంలో బాగా గుచ్చుకుని, నాటుకు పోయింది. ఇవాళ ఈ మాటనే మననం చేసుకుంటూ ఆఫీసుకి చేరుకున్నాడు. ఈ కుంపటిని వదిలించుకోవడం ఎలాగా దేవుడా అని మర్నాటినించీ మనస్సులో తొందర మరీ ఎక్కువయి పోయింది.

జ్ఞానద కోసమని రెండు మూడు సంబంధాలు తెగవెతికి పట్టుకొచ్చాడు. వీళ్ళ గురించి వివరాలు చెప్పేసరికి స్వర్ణవంటిది కూడా భయపడి గుటకలు మింగాల్సి వచ్చింది అంటే, అవి అంత యోగ్యమైన సంబంధాలన్న మాట!—

* * *

చాలా రోజులకి మళ్లీ స్వర్ణ ఒకనాటి మధ్యాహ్నం దుర్గామణి గదికి వచ్చింది.

''వంటో ఎలా వుందమ్మా ఇవాళ?'' అనడిగింది.

అతి కష్టంమీద దుర్గ అటునించి ఇటువేపు తిరిగింది. ''ఇంకా ఎలా వుండేదేమిటమ్మా. అక్కా! ఇంక అట్టేరోజులు మంచానపకి తీసుకోకుండా, అనాయాసమరణం రావాలని దీవించు అక్కా!'' అని చెప్పింది.

''కాదు, కాదు. అలా భయపడతా వేమిటీ? తప్పకుండా నయమవుతుంది, బెంగెట్టుకోకు'' అంటూ ధైర్యం చెప్పింది. స్వర్ణ.

ఈ మాటకు దుర్గ బదులు చెప్పలేదు. మరేం మాటాడలేదు

ఇహ యిప్పుడు స్వర్ణ తను వచ్చినపని బయట పెట్టటానికి ప్రారంభించింది:

"తెరిపిలేకుండా మన జ్ఞానదకోసం మరిది సంబంధాలు చూస్తూనే వున్నాడు. ఇప్పుడొచ్చిన సంబంధాన్ని గురించి చెబుదామని వచ్చా. పిల్ల పెద్దది కావటంచేత వరుడు మరీ అంత చిన్నవాడయినా ఈడూ జోడూ బాగుండదు! ఆ అబ్బాయికి తల్లీ తండ్రీ లేరు. కనక, తనే స్వయంగా వచ్చి చూసుకుంటానని కబురు పంపాడు. వాళ్ళువచ్చి, పిల్లవాళ్ళకి నచ్చినట్టాయెనా, వాళ్ళకోసం మరిది ఎంతగా తిరిగాడో, ఆ కష్టం సార్థకమవుతుందన్న మాట. ఆ తరవాత—ఇహ మనం ఇచ్చి పుచ్చుకోవ డాల సంగతి అదీ—నే చెప్పేదేమిటంటే...."

మాట పూర్తికాకముందే దుర్గ ఆవేశంతో లేచి కూర్చుంది! "అక్కా!—అక్కా! ఈ సంబంధం తిరిగి పోకుండా ఉండాలని దీవించు. అక్కా!—శీఘ్రంగా ఆ కార్యం కాస్తా జరిగిందంటే కళ్ళారా చూస్తైనా పోతాను. తల్లీ!—" అని అంటూ వుండ గానే ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"దీవించక పోవట మేమిటమ్మా చెల్లీ!—"భగవంతుడా!—మా పిల్లని ఏదో విధంగా ఒక ఒడ్డునపడెయ్, ప్రభూ!" అని చెప్పి రాత్రింబగళ్ళు నేను ధ్యానించని క్షణమే లేదనుకో. అమ్మాయి పెళ్ళి నువ్వు చూడకపోవడ మేమిటి చెల్లీ!—అలా సంశయంగా ఇదై పోతావేమిటి? అల్లుణ్ణి నువ్వు కళ్ళారా చూశాకనే......" అని ఓదార్చింది, స్వర్ణ.

పైట చెంగుతో కళ్ళనీళ్లు తుడుచుకుంది, దుర్గ. ఒక్కమాటు "ఉష్!—" అను కుని వెనకా ముందాడుతూ స్వర్ణ మళ్లీ ఇలా అన్నది:

"చెల్లీ!—మరిది స్థితి అంతా నీకు తెలిసిన విషయమేగా? పిల్లలు గలవాడు. తన కూతురి పెళ్ళి ఎలా అవుతుందా, ఆ మూడుముళ్ళూ ఎలా పడతాయా? అని ఆలో చనతో సతమతమయి పోతున్నాడని నమ్మి, దానిపైన మరొహటేమిటంటే—సిగ్గు కొద్దీ మరిది నీతో ఎదటికొచ్చి చెప్పలేక పోతున్నానని, అన్నాడు. అంటే—"పోనీ నీకంత బిడియమయితే నేనే చెప్పి వస్తాలే, చెల్లితో" అనేసి నేనిలా వచ్చానన్న మాట. అతగాడు విన్నడుగుదామనుకున్న మనసులో విషయం ఇది: పెళ్ళి ఖర్చుకి గాను ఈ యింటో తన భాగం తనఖా పెట్టేశాడు. తెచ్చిన డబ్బు చాల్లేదు. నీ ఇంటి భాగం కూడా కొదవ పెడితే కాని కావలసిన సొమ్ము దొరికేట్టు లేదు. అందుకని ఇంతగా ప్రాధేయ పడుతున్నాడు.

"నువ్వేం చెయ్యక్కర్లేదు. పత్రంమీద కాస్త సంతకం పెడితే చాలు. ఇంతదాకా

రాకపోను. ఊరికే చేబదులుగా ఇమ్మంటే, ఎవళ్లూ అప్పిచ్చేట్టు లేరు. పాడుముండా
కలికాలం!—చచ్చే సమయంలో కూడా ఒకళ్ళ నొకళ్ళు నమ్మరాని కాలమై
పోయింది!—''

అందుకు దుర్గ వెంటనే జవాబు చెప్పింది: ''అక్కా! ఇహ నేనెన్నాళ్లు బతక
బోతాను? మీరు ఏ పత్రంమీద సంతకం పెట్టమంటే దానిమీదే పెడతాను. మీరేం
చెయ్యమంటే అదే చేస్తాను. కాని, ఒక్కటి!—అతడు నన్ను నట్టేట ముంచకుండా
వుంటే మట్టుకి చాలు!''

''ఛ—ఛ!—ఎందుకు ముంచుతాడమ్మా! తండ్రీ, పినతండ్రీ—తల్లీ, పెత్తల్లీ
లేరూ?—అలాగే అయినట్టయితే, దానికోసమని మేం బెంగెట్టుకుని అహోరాత్రులు
నిద్రాహారాలు మానుక్కూచోటం దేనికి?—మాకు మాధురి ఎంతో, జ్ఞానదా అంతే.

''లే అమ్మా, జ్ఞానదా!—అమ్మకి కళ్లు తుడు. అదుగో కాస్త ఆ విసినికర్ర
పుచ్చుకుని, విసురు తల్లీ!—అమ్మకి ప్రాణం తేరుకుని, హాయిగా వుంటుంది.
హైరానా తగ్గుతుంది'' అంటూ ఆశ కల్పించి వెళ్ళిపోయింది స్వర్ణ.

కష్టాలు ఒంటబట్టి నప్పటినించీ దుర్గ మొహం మృత్యురేఖలతో మలినమై పోయింది.
ఇన్నాళ్ళకు మళ్ళీ కాస్త సంతోషకళ వచ్చి ముఖం తేటపడింది. కూతురిచేతిలో విసిని
కర్ర తీసుకుంది తల్లి. ఆమె తల నిమురుతూ, ''కాస్సేపు ఇక్కడే పడుకోరాదు,
తల్లీ!'' అంటూ జ్ఞానదను గుండెమీదికి లాక్కుంది. ''ఈ పసివయస్సులో ఎన్నెన్ని
దిగుళ్ళతో కుమిలిపోవాల్సి వచ్చింది, బిడ్డా!—నాలాంటి నిర్భాగ్యురాలి కడుపున
ఎందుకు పుట్టావు తల్లీ!—మగవాడుగా పుట్టినా తీరిపోయేది కదే, అమ్మా—'' అని
చెప్పి, జాలిగా ఓదార్చింది, తల్లి.

ఈ విధంగా చాలాకాలానికి తనపట్ల తల్లి వాత్సల్యం కనబరిచే సరికి, కూతురు
కళ్ళవెంట అప్రయత్నంగా అశ్రువులు రాలాయి. ఇద్దరూ కాస్సేపు తేలికయిన
మనస్సుతో, నిశ్చింతగా నిద్రపోయారు

చటుక్కున తల్లి ఒక్కమాటు లేపింది. దాంతో మెలకువ వచ్చేసింది జ్ఞానదకు.

''అమ్మాయ్! లే అమ్మా, లే!—ఇంక వ్యవధి లేదు. నా రేకుపెట్టెలో చిన్న
సబ్బుముక్క ఉండాలి, చూడు. అది పట్టుకెళ్ళి, చెర్లో ముఖం కడుక్కురా. ఊఁ—
పోయిరావేం ఇంకా?—అదే, నీతో వచ్చిన ముప్పు. చెబుతూంటే వినిపించుకోవు.
వెళ్ళి చప్పున రమ్మంటూంటే!—'' అంటూ అపేక్షకొద్దీ కసిరి వేగిరపెట్టింది, దుర్గ.

తల్లి చెప్పినట్టుగానే జ్ఞానద పెట్టె తెరిచింది. ఎన్నాళ్ళనాటిదో సబ్బుముక్క ఒకటి
దొరికితే తీసింది, తువాలు పైన వేసుకొని చెరువుకి బయల్దేరింది.

"రెండు మూడుసార్లు చక్కా పరిశుభ్రంగా మొహం రుద్దుకు రా అమ్మా! ఆలస్యం చెయ్యకు. చప్పున వచ్చెయ్! ఏ నిమిషాన వచ్చేస్తారో, వాళ్ళు!" అని మళ్ళీ తొందరపెట్టింది, తల్లి.

చెరువునించి వస్తూనే జ్ఞానద తెల్లబోయింది. కాలు కదపలేకుండా అంత గడ్డు స్థితిలో వున్న దుర్గ ఇంతలోనే ఎలా వచ్చిందో మరి, పెట్టెదగ్గరికొచ్చేసింది. పెట్టె తీసి, తన అద్దకపుచీరె ఒకటి బయటపెట్టింది. "అయ్యో. నా మతి! తల దువ్వటం కూడా మరిచిపోయా. ముందుగానే పోయి మొహం రుద్దుకురమ్మన్నా. అయితే యేంలే. కూర్చో ఒక్క క్షణంలో జడ వేసేస్తా" నన్నది.

ఈ హడావిడంతా చూసి జ్ఞానదకు బెదురుపుట్టింది. "అమ్మా!—నీకు దణ్ణం పెడతాను, నువ్వెళ్ళి పడుకోవే. కూర్చునేందుకు సత్తువ లేదు. జడయేం వేస్తావు చెప్పు!—నేనే వేసుకుంటాలే. నువ్వు ఇదవకు తల్లీ!—నీకో నమస్కారం!" అని బతిమాలింది, తల్లిని.

కూతురి మాటలకు నవ్వొచ్చింది, దుర్గకు. తలాడిస్తూ, ఇలా అంది: "వెయ్య లేనుటే అమ్మాయ్, హుఁ—! నీకేమన్నా తెలుసా?—ఇదివరకల్లా నాచేత జడ వేయించుకోటానికని ఈ వీధిపిల్లలెంతమంది వచ్చేవాళ్ళో నా దగ్గిరకి? వెయ్యలేనుట, జడ!—రా అమ్మా!—ఇంక ఆలస్యం చెయకూ!" అని చెప్పి, బలవంతంగా దగ్గిర కూర్చోపెట్టుకుంది. ఇదే కడసారి అనుకుందేమో మనస్సులో—శ్రద్ధగా, ఓపిగ్గా తల దువ్వి జడవేసింది.

కాళ్ళకి పారాణి పూసింది. మొహాన బొట్టుపెట్టింది. పూర్తికాగానే ఒక్కమాటు తేరిపార జూసి, బుగ్గలు పుణికి, "ఎవరా అనేది మా అమ్మాయి చక్కటిది కాదని? కాస్త చామనచాయ అన్నమాటగాని, దానికున్నలాంటి కళ్ళూ, ముఖమూ ఎంతమంది కున్నాయి?" అంటూ తనలో తనే అనుకుని పొంగిపోయింది!

ఏ తల్లిమాత్రం తన కన్నకూతుర్ని ప్రేమించదు? ఏ తల్లి ప్రాణంమటుకు దుర్గలాగా కొట్టుకులాడదూ? అయితే—కూతురి వంటిమీద ఒక్క నగ అయినా ఉంచలేక పోయానే అని ఇంతకుముందంతా ఆమె మనస్సులో క్షోభగా వుండేది. ఇప్పుడా దిగులు ఎలాగో మరుగున పడిపోయింది ఈ రోజున—నగలు లేకపోవటం ఒక పెద్ద వెలితిగా ఆవిడకు అనిపించలేదు.

ఇంకా చాలా పొద్దున్నప్పటికీ దుర్గకు నిద్రపట్టలేదు గతాన్నీ, గతంలో పొందిన దుఃఖాన్నీ అంతా మరిచిపోయి, కూతుర్ని ముందర పెట్టుకూర్చుంది.

జ్ఞానిని చూట్టానికి వస్తారని చెప్పి పొరుగింటి నీలకంఠుడి భార్య, తరంగిణి అనే




అమే, ఇద్దరూ వచ్చారు.

సమయమయింది. పిల్లని తీసుకురమ్మని పిలుపు వచ్చింది. రాగానే, తక్కిన వాళ్ళంతా పక్కగదిలోకి వెళ్ళి కూర్చున్నారు.

పిల్లని చూడవచ్చిన వరుడూ, సంబంధం కుదిర్చినాయనా, అన్నీ మాటాడుకుని, భోజనాలూ అవ్వీ ముగించుకుని, వెళ్ళిపోబోతున్నారని వార్త తెలిసింది. వాళ్ళు బండీ ఎక్కి వెళుతున్న చప్పుడు కూడా వినిపించింది. ఆ తరవాత తరంగిణి గదిలోకి వచ్చి, ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది. "ఉహూఁ—పిల్ల నచ్చలేదు...." అని ఒక్కమాట చెప్పింది.

కళ్ళుమూసుకు పడుకుంది, దుర్గ. ఒక్క ప్రశ్నకూడా అడగలేదు.

కడుపు కలిగించే కంఠస్వరంతో తరంగిణి ఇలా అన్నది:

"అసలే ఎముకలు బయటపడిపోయినాయి. ఇలాంటి పిల్లని చూపిస్తే ఎవరికి నచ్చుతుందీ? నా వుద్దేశం ఏమిటంటే—ఇంకా కొన్నాళ్ళపాటు పుష్టిఅయిన తిండి తింటూ, బలానికి మందులు కూడా పుచ్చుకోవాలి. లేకపోతే వాళ్ళు చెయ్యటం మాట ఎలా?—చిన్నప్పటినుంచీ చూస్తున్నాగా. ఇదే వరుసగా వుంటోంది. పక్కెముకలు పన్నెండూ పైకి ఉబికి;—నే చెప్పినట్టుగా ఒక్క ఏడాదిపాటు చేసిచూడు. ఎంచక్కా తయారవుతుందో పిల్ల;—అప్పుడిహ నచ్చకపోవడమనే మాటే వుండదూ."

క్షేమంకోరి తరంగిణి చెప్పిన సలహా అంతా అక్షరాలా నిజమే కాని అటువంటి మంచియోగం లభించేదెట్లా ? దీనికంతకీ దబ్బేది ? ఇంకా ఈ అస్థిపంజరాన్ని ఒక యేడాదిపాటు ఏపుగా పెంచి బలిఎంచటానికి తగిన వ్యవధి ఎక్కడుంది ? పిల్లకి మూడామూ అంటే పదిహేనోయేడు వచ్చి పైబడిందాయె ! ఈ దోషంవల్ల ఎతృఎతా మహాలు రోజురోజుకీ నరకంలో ఇంకా కూరుకుపోతున్నారాయె !

ఉత్తమ కులానికి చెందిన పిల్లకదా ! అంచేత ఊళ్లోవాళ్ళంతా "జాతి పోతుంది— జాతి పోతుంది" అంటూ అహర్నిశలూ కళ్ళెర్రజేసి బెదిరిస్తున్నారొకమూల.

ఛాందసులైన లోకులు జ్ఞానద పెళ్ళి విషయమై నిర్బంధిస్తూ. ఏకకంఠంతో ఇలా శాసిస్తున్నారు :

"ఇంకెంతమాత్రం నిలిపివుంచటానికి వీల్లేదు. విముక్తి కల్గించు. విముక్తి కలిగించు. ఎవరిచేతుల్లో అయినా సరే, ఎలా అయినా సరే పెట్టే తీరాలి. జాతకాన్నిబట్టి పిల్లకు వైధవ్యమొస్తుందని రాసివున్న సంబంధమైనా సరే, చేసెయ్యవలసిందే కాని జంకటానికి వీల్లేదు. అష్టకష్టాలూ పడుతూ తీరని విచారాలున్న యింటో అయినా సరే. వాళ్ల గర్భదరిద్రంతో వేళ్లాడిపోతున్నవాళ్ళయినా సరే, చేసే తీరాలి.

జాతీ, ధర్మం నిలవాలంటే, పితృపితామహులైన పూర్వులను నరకలోకాల్నించి రక్షించాలంటే ఎక్కడో అక్కడ పిల్లని అప్పగించక తప్పదు." అని ఈ విధంగా ఆజ్ఞాపించ నారంభించారు.

అప్పటికి సంధ్యాదీపం పెట్టలేదింకా. ఆ అంధకారంలో జ్ఞానద, తనకు చివాట్లు తెప్పించిన ఈ అలంకారాన్నంతా విప్పేయాలనే నిశ్చయంతో గదిలోకి వచ్చింది.

శవంలా పడివుంది దుర్గ. ఏదో మహా అపరాధం చేసినదానిలాగా వచ్చి జ్ఞానద తల్లి పాదాలవద్ద కూర్చుంది. అలా కూర్చున్నట్టు తెలిసినా, దుర్గ ఏం మాటాడలేదు.

అలానే మౌనంగా చాలాసేపు కూర్చుంది. జ్ఞానద. తిండీ తిప్పలూ లేవు. అభోజనంగా, విచార భారంతో కుంగిపోయి, అక్కడే కాస్త వెన్నువాల్చేసరికి నిద్ర పట్టేసింది. ఇదంతా చూస్తున్నా, ఇవాళ తల్లి హృదయంలో రవంతయినా జాలి కలగలేదు.

## 10

### పెళ్ళికాని కన్యలు తల్లికి అంత్యక్రియలు జరపటానికి వీల్లేదు—వంగదేశంలో శాస్త్రప్రకారం ఇది ఒక నిషేధం

ఇప్పుడు దుర్గస్థితి గడియో క్షణమో అన్నట్టుగా వుంది యుక్తవయస్సు వచ్చిన తన కూతురికింకా పెళ్ళి పెటాకులూ లేదు అంటే పూర్వపురుషులైన పితృపితా

మహాల్ని ఆనాటికానాడు అధోగతికి ఈడుస్తోందన్నమాట. అదీగాక, శాస్త్రులు చెప్పినట్టుగా తల్లికి ఈ మృత్యుసమయంలో ఏం చెయ్యటానికీ పనికిరాకుండా పోయిందన్నమాట.

అవివాహిత అయిన ఆపిల్ల తన చేతులమీదుగా దహనం చెయ్యకూడదు తిలోదకాలు ఇవ్వకూడదు. ఆ వీధిలోవున్న శాస్త్రపండితులంతా ఈమాట ఖండించి చెబుతున్నారు. ఇది వినగానే, చావుకి సిద్ధంగావున్న దుర్గముఖం తెల్లగా పాలిపోయింది

చాలకాలంనించీ ఆమె అనుభవిస్తున్న బాధలూ, కష్టాలూ నోటితో చెప్పలేం తెరిపిలేకుండా విచారంమీద విచారం, దెబ్బమీద దెబ్బ తగలటంతో ఆమెలోవుండే జీవుడు ఎగిరేపోయినట్టయింది. ఇదివరకల్లా తన గారాబుకూతుర్ని ఎంత ఆపేక్షతో చూసుకుంటూవుండేదో, ఇప్పుడంతకు అంత, జ్ఞానద కంటపడితే చాలు, మండిపోతూవుంది.

ఇహ, తన పరలోకయాత్రకు కూతురి ప్రసక్తే పనికిరాదని శాస్త్రప్రవీణులు చెప్పారని విన్నాక, ఆమె హృదయం పాషాణమే అయిపోయింది. కూతురంటే గుండెకు ముల్లు గుచ్చుకున్నట్టనిపిస్తోంది. ఆమెపైన ఏకోశానా మమత, అనురాగం అనేవి లేకుండాపోయాయి.

* * *

అనాధ్‌నాధ్‌కి కబురెట్టి పిలిపించింది. "మరిదీ!—ఆ వీధిన వుంటున్న గోపాల భట్టాచార్య మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాట్ట! ఈ ఒక్క ఆఖరిప్రయత్నం చేసి చూడు. మరిదీ, నాప్రాణం పోయేలోపుగా" అని చెప్పింది.

ఈమాట అతడు ఏమాత్రం నమ్మలేదు. "ఎబ్బే, లేదు. ఆ భట్టాచార్యకి ఇంకా పెళ్ళేమిటి, వదినా!—ఎవరన్నా నీతో తమాషాకు చెప్పారేమో!" అన్నాడు.

విట్టూర్పుతో దుర్గ: "నాతో తమాషాకి ఎవరంటారయ్యా, మరిదీ!—అతడు మగవాడు, వయస్సెంత అనేమాట ఎవరికి కావాలి! అయినా ఆ వయస్సులో చాలామంది పెళ్ళిళ్ళు చేసుకుంటూనే వున్నారు. బతిమాలుకుంటున్నా. ఒక్కమాటు వెళ్ళిరా. మరిదీ!....సంగతేమిటో తెలుస్తుంది. బతికున్నన్నాళ్ళూ పిల్ల ఉపకారం పొందలేకపోయాను. నే చచ్చాక అది నాకు అగ్నిసంస్కారం చేయటానికైనా ఉపకరిస్తుంది. నాయనా!—" అంటూ బతిమాలింది.

ఇప్పుడు దుర్గకు బాగా పట్టుకున్నదల్లా ఈ చింత, ఈ విచారమూ తప్ప మరొకటేం లేదు.

కడుపారా కన్నది పిల్లని. కష్టాలుపడి పెంచి పోషించింది. ఇలా సంపాదించి

పెట్టుకున్న అటువంటి ప్రాణధనం చివరిక్షణాల్లో వ్యర్థమైపోవల్సిందేనా? తల్లికి తన చేతిమీదుగా అగ్ని సంస్కారమయినా చెయ్యటానికి అర్హతలేని పిల్ల తనకడుపున ఎందుకు పుట్టాలి, దురదృష్టం కాకపోతే?—ఇదే ఎంతసేపూ దుర్గామణి మనస్సులో వేదన।

ఇలా బాధపడుతూ వణుకుతూ పడుకునివున్న దుర్గ గభీమని లేచి కూర్చుని. ఉద్రేకంతో ఇలా అంది :

"మరిదీ!—చెబుతున్నాగదా, ఇదే నా కడసారి ఆశీర్వాదం నీకు. నువ్వు మహారాజువి అవుతావు, తప్పక. కనక. నే బతికుండగా నాపిల్లని ఎక్కడో అక్కడ, ఎవరిచేతిలోనో ఒకరి చేతిలో అప్పగించెయ్, నాయనా!—

ఈ విషయంలో మరిదికూడా, ఏం ఉపేక్ష చెయ్యలేదు. పట్టుదలగానే వున్నాడు. ఆ రోజునే గోపాలభట్టాచార్యకోసం వెళ్ళాడు. ఆయన పెళ్ళాడబోతాడనే సంగతి వినగానే క్షణంపాటు స్తంభించిపొయ్యాడు. పెళ్ళిమాట నిజమే నన్నందుకు కాదు, అతడిఆశ్చర్యం. ఈలోపుగా అప్పుడే ఆడపిల్లల తండ్రులు నలుగురైదుగురు వచ్చి ఆయన్ని వేధించేస్తున్నారుట।

పెళ్ళికావటం ఇంత కష్టమైన పని అయినా, గోపాలభట్టాచారికి కన్యాదానం చేయడమంటే, తల్లిమనస్సు జంకలేదు. ఏమంటే—పరలోక యాత్రకు సిద్ధమైవున్న మనిషి ఆమె. ఆ యాత్రకు శాస్త్రపద్ధతిలో పాథేయాన్ని సమకూర్చుకోవడం కోసం ఏ పనయినా చెయ్యాల్సిందే. చెయ్యకతప్పదు.

కాష్టానికి కన్యలను బలులివ్వడం జన్మజన్మాంతరాలనించీ వస్తున్న శాస్త్రపద్ధతి. అంత గాఢమయిన నమ్మిక ఈనాడు ఎలా తొలిగిపోతుంది? అలాంటి పడుచులు ఇవాళ ఎందుకు వెనక్కి తగ్గుతారు? కనుకనే, దుర్గకూడ తనకు పరలోకంలో గతులు కలగటం కోసమని, కూతుర్ని బలిపెట్టటానికి జంకటంలేదు.

తరుముకు వస్తున్న విచార పరంపర ఇలా వుంటూండగా, ఇందులో మళ్ళీ ఒక కొత్తవిచారం!—పిల్లని చూసికాని చేసుకోనని చెప్పిపంపాడు, ఆ గోపాల భట్టాచార్య. ఇది పాడుదేశం, గనక నలుగురు పిల్లల్ని చూసి మరీ వివాహం నిశ్చయించుకోగల గొప్ప అవకాశాలెన్నో ఆయనకున్నాయి.

ఎట్లో కొట్టుకుపోయేవాడికి గడ్డిపరక చేతికి దొరికినా అది పట్టుకోవాలనుకుంటాడు. అలాగే, ఇప్పుడీ [illegible] వివాహం కావాలనే కాంక్ష మిక్కిలి [illegible] దుర్గ మనస్సులోంచి [illegible]

అనాథని చెయ్యిపట్టుకు [illegible], ఆమె ఇలా వేడుకుంది. "మరిదీ




చచ్చిపోయిన మీ చిన్నన్నకోసమని ఈ కాస్త ఉపకారం చేసిపెట్టు, బాబూ!— ఇది చేశావంటే దురదృష్టవంతురాలైన నాపిల్ల చేత్తోపెట్టే అగ్నినయినా పొందగల్గుతాను. నేను వచ్చే పంచమికి ముహూర్తాలున్నాయిట. దాటిపోనివ్వకు. ఎలా అయినా ఆ ముహూర్తానికి మూడుముళ్లూ పడేట్టు చూడు!—ఇవాళే వచ్చి, పిల్లని చూసుకుని, తాంబూలాలు పుచ్చుకు వెళ్ళమని వాళ్ళతో చెప్పిరా, బాబూ!—

దుర్గ ఇంతిలా ఇదైపోవటానికి ఒక్కటే కారణం—పెళ్ళికానిపిల్ల తల్లికి అంత్య క్రియలు జరపటానికి వీల్లేదు. వంగదేశంలో ఇది శాస్త్రనిషేధం.

ఈ సంగతి విన్నప్పటినించీ జ్ఞానద తిండీతిప్పలూ మానేసింది. ఆమె వంగదేశపు యువతి. కనుక, ఆమె హృదయంలో ఆరని అగ్గి ఏదో ప్రజ్వరిల్లుతూ వున్నదంటే ఆశ్చర్యం దేనికి?—

అపరాహ్ణ సమయం. వంటింటో జ్ఞానద ఒక్కర్తే కూర్చుని తల్లికి పథ్యం తయారుచేస్తూంది ఈ సమయంలో పెళ్ళిచూపులకోసమని మరోసారి జ్ఞానదకు పిలుపు వచ్చింది.

స్వయంగా పరుగెత్తుకుంటూ వచ్చింది, స్వర్ణ. 'ఒసేయ్ జ్ఞానీ!—వాళ్ళు చూడటానికని వచ్చారు. ఆ పని వొదిలేసి, చప్పున రా!—ఏదో ఇంకోటి మారుచీర కట్టుకురా, వాలు!—వాళ్ళు ఆపళంగానే చూసి వెళతారు'', అని చెప్పేసి, గబగబా వెళ్లిపోయింది.

అప్పటికింకా అనాధ్ ఆఫీసునించి రాలే. అంచేత, వచ్చిన వాళ్ళని మర్యాద చెయ్యాల్సిన భారంకూడా స్వర్ణమీదనే వుంది.

చూట్టానికి వచ్చినవాళ్ళల్లా వరుడూ, అతడి మేనల్లుడున్నూ. ఈ రోజుల్లో పిల్ల నచ్చడం నచ్చకపోవడం కుర్రాళ్ళకైతే బాగా తెలుస్తుందనే ఆలోచనతో గోపాల భట్టాచార్య తన దూరపు మేనల్లుణ్ని వెంటబెట్టుకు వచ్చాడు

"ఎలా వున్న పిల్ల అలా వస్తే చూస్తా" అని వార్త పంపింది కూడా ఈ మేనల్లుడి సలహా ప్రకారమే. ఇందులో వున్న అంతర్యమేమిటంటే—మామూలుగా పెళ్ళి కూతురు [illegible] పిల్లని అలంకరంచేసి తీసుకు వస్తుంటారు అందులో ఎన్నో రకాల [illegible]తూంటాయి. అందుకోసమే. ఇప్పుడు భట్టాచార్య మేనల్లుడు ఈ సలహా ఇచ్చింది.

మర్నాడు ఆరుగంటల రైల్లో మళ్ళీ కలకత్తా వెళ్ళిపోవాలి పెళ్ళివారు అందుకనే వరుడి మేనల్లుడు అంతగా తొందర పెట్టాడు.

చాటుగా నించున్న స్వర్ణ గొంతు నొక్కుకుని జ్ఞానదాని పిలిచింది. కాని ఆమె ఇంకా రాలేదు. చీరమట్టుకు మార్చుకు రావడమైతే నిజానికి అంత సేపు పట్టదు. ఈ ఆలస్యం చూసి దాసీని వెళ్ళింది, చెయ్యిపుచ్చుకు లాక్కొచ్చేసింది. పిల్ల నేసి చూడగానే పెద్దమ్మ చకితురాలయింది. "ఇవన్నీ పెట్టుకుని ఇలా అలంకరించుకు రమ్మని ఎవరు చెప్పారూ? తీసెయ్ వెళ్లు. చప్పున అవన్నీ తీసేసిరా!" అంటూ వేగిరపెట్టింది.

హఠాత్తుగా స్వర్ణకేకలు వినబడటంతో ఆ చూట్టానికి వచ్చినవాళ్ళు ఆశ్చర్యపోయి, ముందుకి [illegible]రు. ఆచార్య వెంటవచ్చిన కుర్రాడు ఈ సంగతంతా గ్రహించాడు. "పోన్లెండి, అలాగే తీసుకొచ్చెయ్యండి. ఇంకా ఆలస్యం చేస్తే కుదరదు" అన్నాడు.

దాసీది పిల్లని ఎదటికి తీసుకొచ్చి నిలబెట్టింది. అస్తవ్యస్తంగా, అందవికారంగా అలంకరించుకున్న జ్ఞానదాను చూశాడు, యువకుడు.

అతికష్టంమీద ఉబికివస్తున్న నవ్వాపుకుని, "ఏ సంగతీ రేపు కబురంపుతాం లెండి! అని చెప్పి, మేనమామని వెంటబెట్టుకు వెళ్ళిపోయాడు

మొదట్లో అసలు వారి భోజనాలిక్కూడా అక్కడే ఏర్పాటు, కానైతే, రైలు తప్పిపోతుందేమోననే జంకుతో వాళ్ళు భోజనానికి ఉండిపోలేదు.

"రేపు కబురంపుతాంలెండి!" అనేమాటకు అర్థం వెంటనే గ్రహించారందరున్నూ.

* * *

దుర్గ పరిస్థితి ఏం బాగాలేదుకదా, ఒక్కసారి చూసిపోదాం అని వచ్చి, ఇరుగు పొరుగులు ఒక్కొక్కరే వచ్చి గుమిగూడారు.

అదే సమయంలో ఎక్కడినించి వచ్చాడో మరి, అతులుడు కూడా వచ్చి ఊడి పడ్డాడు. అతడూ ఇవాళ ఆరుగంటల రైలుకి కలకత్తా వెళ్ళవలసిందే. పెళ్ళిటోతున్న



వాడల్లా దారిలో ఈ గందరగోళం విని, వెనక్కి పరుగెత్తుకొచ్చేశాడు.

అతులుడు కంటబడేసరికల్లా స్వర్ణ రోషం నషాళానికెక్కింది. వెయ్యి రెట్లయిం జ్ఞానద బక్కచిక్కి శల్యమైంది. భయంతో సగం చచ్చివుంది; దౌర్భాగ్యురాల అటువంటి ఆ పిల్లముఖం బలవంతంగా పైకెత్తింది, స్వర్ణ. "చూడు, అతుల ఒక్కమాటు ఈ మొహంకేసి చూడూ, పాడుమొహం. ఒక్కసారి చూడవేం. కోతి మొహాన్ని?" అంటూ గర్జించింది.

నిజానికి ఇప్పు డామెముఖం అలాగే తయారై వుంది కూడా. చూస్తే, ఎవ కయినా నవ్వాగదు, పెదవులకు వేసుకునే రంగు బుగ్గలకీ, బుగ్గలకు వేసుకునే రంగ పెదవులకూ వేసుకుంది. చీకట్లో ఎక్కడో మూల కూర్చుని వేసుకున్న జడ వంక టింకరగా, గూడ గూడలుగా వచ్చిందంటే ఆశ్చర్య మేముంది? ఆ చింపిరి జుత్తు హడావుడిలో రాసుకున్న నూనె ఇంకా చెంపలంట కారుతూనే వుందాయిరి!

ఆ పక్కనే వున్నారు నలుగురైదుగురు పిల్లలు. ఈవేషం చూసి వాళ్లు కిల కిల

నవ్వుతున్నారు. కాని అతులడు మాత్రం గుండెలో బల్లెం గుచ్చుకున్నట్టుగా బాధ పడ్డాడు.

పట్ట పగటిపూట ఇటువంటి రూప లో జ్ఞానదాను అతడు చూసి చాలా రోజు అయింది. జబ్బు పడ్డాక అసహ్యంగా తయారైందని ఎవరో చెప్పగా విన్నాడు. అంతే. అయితే, ఇంత అసహ్యంగా తయారయిందని అతడు కలలో కూడా అనుకోలేదు.

ఒకప్పుడు తను ఎంతో జబ్బులోపడి, చావుకి సిద్ధమైవుండగా, ఈ ముఖాన్నే అతడు ప్రేమించాడు. పై చూపులకు భ్రమపడి కాదు కేవలం కృతజ్ఞత తెలుపు కోవడం కోసమనీ కాదు. నిష్కపటంగా, మనస్ఫూర్తిగా ప్రేమించాడు

అటువంటి దివ్యుడు—ఈ ముఖంమీదనే యముడు తన "డిక్రీ" జారీచేసి కడా పటి నోటీసు అంటించినట్టు చూసేసరికి అతడు తనకు తనే పడిచి పోయాడు.

ఏదో అనబోయాడు. కాని స్వర్ణ గళంముందు అతడి గొంతు పెగల్లేదు

అంతలో స్వర్ణ మళ్లీ అందుకుంది: "ఆం!—ఎంతసిగ్గు విడిచేశావే? ఆ ముసిలి ముండావాణ్ని ఆకర్షించటానికని బోగందానిలా ఈ వేషమంతా వేసుకోవాల్సి వచ్చిందా? ఇంతావేసి, నీ వేషంతో మోసగించగలిగావా వాళ్ళని? మొహంమీద కొట్టినంత పని చేసిపోయారు!" అన్నది.

స్వర్ణ కేకలు విని, వెనకనించి ఎవరో ఇలా అడిగారు: "ఇలాంటి భూతం వేషంవేసి పంపింది ఎవరమ్మా? ముసిలాడికి నచ్చలేదు కాబోల్నే?"

ఆ అడిగిన వారికేసి చూసి, స్వర్ణ జవాబు చెప్పింది—"ఇంకెవరు వేస్తారు? తనకి తనే స్వయంగా అలంకరించుకు వచ్చింది. తల్లి చూడబోతే స్మృతి తప్పిపోయింది. మనలోకంలో లేకపోయె. అక్కడికీ నే చెప్పా—ఒక్క చీరెమాత్రం మార్చుకురా తల్లీ అని. నామాట నచ్చితేగా?—ఇంత గొప్పవేషం గీషంతో తయారై వెళితేగాని ముసలాయన్ని ఆకర్షించుకో లేననుకుంది.

"అందులోనూ మళ్ళీ ఆ అద్దకం చీరా, అతులుడిచ్చిన ఆ గాజుల జతాను. ఆ గాజులు రోజూ పదిమాట్లు వేసుకుని మళ్ళీ తీసేస్తూంటుంది. అవి తొడుక్కుని బయటి కెలా వస్తామా అని సిగ్గయినా లేదు. ఈ కోతి మొహానికి. ఛీ—ఫో!—నా ఎదట నించి దూరంగా ఫో!—" అంటూ కసిరికొట్టింది.

"సిగ్గులేని పిల్ల!—సిగ్గు పడాల్సిన విషయం!! ఛీ ఛీ" అనుకుంటూ అందరూ ఎవళ్ళదారిని వాళ్లు పోయారు.

తను నల్లటిదానిననే సంగతి ఆ పిల్లకు పుట్టినప్పట్నించీ తెలుసు. ఇటువంటి లోపానికి తనలో తను సిగ్గుపడుతూ, తల ఎత్తకుండానే లోకంలో మసులుకుంటూ



వుంటూంది

అటువంటిది—ఇవాళ ఆ ఎగ్గంతా ఎ.వేసుకుని కళాకాంతులు లేని తన శరీరాన్ని స్వయంగా అలంకరించుకుంటుందా? అలంకరించుకుని, ఎదుట ఆరాధించాలనే వుద్దేశంతో ఆ వృద్ధుడి దగ్గరికి వస్తుందా? ఎవరు నమ్ముతారు ఈ మాటలు?—నిజా నిజాలు భగవంతుడికే తెలుసు.

ఇవాళ అందరూ "ఛీ ఛీ" అంటూ వెళ్ళిపోయినవారే కాని, క్షమించినవాళ్లు ఒక్కరూలేరు. దౌర్భాగ్యబాలిక అయిన జ్ఞానద అపరాధభారాన్ని ఎవ్వరూ ఆమోదించ లేదు. బహుశా సర్వలోక విచారకుడైన ఆ సర్వాంతర్యామి మాత్రమే తన హస్తాలతో ఆ భారాన్ని స్వీకరించాడేమో!—

జ్ఞానదా లేచి నించుంది. ఇతరుల ఎదట, ఆమె ఎప్పుడూ ఏడ్చియెరగదు. కాని, ఇవాళ అతులుడి ఎదట నించున్నప్పుడు ఆమె కళ్ళవెంబడి నీళ్ళు ప్రవాహంగా స్రవిం చాయి. ఆమె ఒక్కమాట అయినా సంజాయిషీ ఇచ్చుకోలేదు ఎవరి ముఖంకేసీ చూడ లేదు. మాటాడక, కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

అతులుడు కలకత్తా వెళ్ళటానికి మళ్ళీ ఇప్పుడు రైలులేదు. అంచేత అతడు సాయంకాలమయ్యాక ఇంటికి తిరిగివెళ్లాడు.

ఇంటికివెళుతూ దారిలో ఈ సందర్భాలన్నీ చిన్నత్త చెప్పే మాటలతో సమన్వ యించి చూసుకో నారంభించాడు.

ఆమె పుట్టింటికెళ్ళే రోజున అతణ్ణి చాటుగా పిలిచి ఇలా అన్నది: అతుల్!— నేతనుండే వజ్రాన్ని జారవిడుచుకుని గాజుముక్కని దాచుకునేవాళ్ళు తరవాత ఎంతైనా విచారించాల్సి వస్తుందిసుమా!''

ఆనాడు ఈమాట పూర్తిగా అర్థంకాలేదతనికి. కాని, ఇప్పుడు జ్ఞాపకమొచ్చి మననం చేసుకుంటే, ఇది తనని వుద్దేశించి చెప్పినమాటేనని స్పష్టంగా తెలిసింది

ఆనాడు సిగ్గులేదని ఎవరినయితే అందరూ దూషిస్తున్నారో ఆమె సిగ్గు బిడియాల అవధి ఎక్కడో కూడా అతడి స్ఫురణకు వచ్చింది.

*　　*　　*

ఇంకా తెల్లారలేదు. అప్పటికి.

"మరి, చిన్న వదనని దహనం చేసి రావాలిగా?'' అంటూ అతుల్ణి పిలిచాడు నాథ్‌నాద్

"పదండి, వెళదాం!" అని ఇవతలికి వచ్చాడు, అతులుడు

తండ్రిపాదాలను ఒళ్లో పెట్టుకుని రెండుమూడేళ్ళ కిందట ఆ తులసి కోటముందు కూర్చుంది, జ్ఞానదా. అలాగే ఇవాళ, తల్లిపాదాలను ఒళ్లో పెట్టుకుని మౌనంగా కూర్చుంది అదే తులసికోట ముందు.

గంభీరమైన వ్యక్తి జ్ఞానద. అంత తొందరగా చలించిపోదు. ఉద్రేకపడదు. ఇప్పటివరకు ఆ అమ్మాయి యథాస్థితినుంచి చలించడం ఒకేఒక్కమాటు— అదయినా, ఆనాడు తండ్రి మరణసమయంలో అతులుడి పాదాలపైన తల మోదుకు ఏడ్చటం. అంతే. లోకానికి తెలిసిన సంగతి ఇదంతే కనుక, ఇప్పుడామె బాధపడుతూ వున్నదంటే ఎవరూ యేమీ పట్టించుకోలేదు అసలు ఎవరి దృష్టి అటు కేపి లేనుకూడా లేదు. అక్కడున్నవాళ్ళంతా దహనసంస్కారం ముగించాలనే ప్రయత్నంలో వున్నారు.

అనుకున్నవేళకు మృతకళేబరాన్ని శ్మశానానికి తీసుకుపోయారు. అందరూవెళ్లారు అందరివెనక జ్ఞానదకూడా వెళ్ళింది ఆమె పేదస్థితిలో పిల్ల కాబట్టి. ఇరుగుపొరుగు ఆడవాళ్లెవరూ జ్ఞానదకు తోడుగా వెళ్ళలేదు. వెళదామని కూడా ఒక్కళ్ళకూ అనిపించ లేదు.

ఇప్పుడు వర్షకాలం కావటంచేత గంగ భవాని శరవేగంతో అలలు మొయ్యా ప్రవహిస్తోంది. తల్లి అంత్యక్రియలు నిశ్శబ్దంగా నిర్వర్తించింది, కూతురు. చితి బాగా అంటుకుని, ప్రజ్వలంగా వున్నది.

ఈ సమయంలో జ్ఞానద మగవాళ్ళలోనించి తప్పుకుని ఇవతలికి వచ్చేసింది.



యువ

శ్మశానానికి దిగువని గంగ ఒడ్డుకి వచ్చి అక్కడ కూర్చుంది

"అలా వెళ్ళకమ్మా అమ్మాయీ!—అంత ఒడ్డుగా కూర్చుంటే ప్రమాదంసుమా!" అని ఎవరూ జ్ఞానదని హెచ్చరించలేదు. "పాపం!—ఈ శోకదృశ్యం చూసి తట్టుకో లేక కాస్త కనుమరుగ్గా వుందామని అలా వెళ్ళింది కాబోలు!" ననుకున్నారందరూ.

అతులుడికి తెలుసు—జ్ఞానద మొదటినించీ చాలా ఓరిమికలదీ, శాంతస్వభావు రాలూ అని. అటువంటప్పుడు ఆమె ఏదైనా అఘాయిత్యం చేస్తుందా ఈ దుఃఖసమయంలో—అన్న భయం ఎందుకు కలుగుతుందతడికీ?

అయినా, ప్రవాహానికి దగ్గరగా జ్ఞానద కూర్చోవటం చూస్తే అతడి మనస్సుకి అదోలా అనిపించింది.

"వొద్దుసుమా!" అని హెచ్చరిస్తే బాగుండునని అనుకున్నాడు, ఒకమాటు. పోనీ, దగ్గరసా వెళ్ళి నించుని ఏంచేస్తుందో చూదామా అని ఇంకోమాటు అనుకున్నాడు అనుకున్నాడే కాని, సిగ్గుచేత చివరికి ఏదీ చెయ్యలేకపోయాడు

చితినుంచి జ్వాలలు ఎగసిపడుతున్నాయి. అందరూ కాస్తదూరంలో కూర్చున్నారు. అతులుడు కూడా అక్కడికే వెళ్ళి వాళ్ళతోపాటు కూర్చున్నాడు.

తన ఎదట మహోజ్వలంగా మండుతున్న ఆ చితికేసి చూసేటప్పటికి అతడి మనస్సులో పూర్వకాలపు వేదాంతసూత్రాలు ఎన్నో కెర్లటానికి ప్రారంభించాయి!

"నిన్న ఉన్నది ఇవ్వాళలేదు. ఇవాళ ఉన్నది రేపు కనబడదు ఈ దేహంకూడా అంతే, అశాశ్వతమైంది. ఎప్పుడో ఓనాడు ఈ శరీరం కూడా నామరూపాల్లేకుండా, గుర్తు తెలియకుండా భస్మమైపోవల్సిందే!

ఇహంలో ఈ దేహాన్ని అంటిపెట్టుకుని ఎన్ని ఆశలు, ఎన్నెన్నో కోరికలు, ఎన్ని బెంగలు, ఎన్ని విచారాలు ఆశ్రయించుకునుంటున్నాయో కదా! ఏవీ అవన్నీ?—క్షణంలో ఎక్కడివక్కడ అన్నీ మాయమైపోయాయి! రెప్పపాటులో అదృశ్యమైపోయాయి! ఏమాత్రమూ నిలకడలేని వీటికి విలవేమిటుంది? ఇంత బతుకూ బతికి, చావటానికూడా ఎంతోసేపు పట్టదుకదా!—ఆహా, విధివైపరీత్యం!—ఇదంతా యేమిటో, మనకర్థంకాదుగా, ఉపలేశమయినా!—"

ఇలా అతులుడు వేదాంత ధ్యానంలో ఉండగా చటుక్కున తన గతజీవితం స్ఫురణకు వచ్చింది:

తనూ మూడేళ్ళకిందట చావుకి సిద్ధమయ్యాడు, కాని చావలేదు తెలియకుండానే అతని దృష్టి ఆ ఎదటవున్న చితిలోనించి వచ్చే పొగతెరను భేదించుకుపోయింది

ఆరోజున తనని యముడి పాశాలనుంచి తప్పించినది ఎవరూ?—"ఆమే!—"

అన్నమాట జ్ఞప్తికి వచ్చింది. పావన గంగాతీరాన ఆ స్వచ్ఛమయిన ప్రవాహంమీద ఎవరి కీపీశ అయితే పడుతూవుందో, ఎవరి ఛాయ అయితే శోకమూర్తిలా ఆ పవిత్ర జలంమీద కనబడుతూవుందో, ఆ కూర్చున్న "ఆమే ' తనని రక్షించింది!—అక్కడ వీస్తున్న గాలికి ఆమె జుత్తు చెదురుతున్నది, ఆమె చీరె వలిస్తున్నది. కాని "ఆమె" మాత్రం నిశ్చలంగా, నిశ్శబ్దంగా అలా కూర్చునేవుంది!—

అతడి రెండుకళ్లవెంటా అశ్రువులు పొర్లి ప్రవహిస్తున్నాయి. "ఛత్!"—ఏమిటి అందం?" అనుకున్నాడు మనస్సులో.

మానవుడి రూపానికి విలువ వుందా?—ఉండడమే నిజమైతే—మూడేళ్ళకిందట తను రూపు చెడ్డాడే? మరణాసన్నుడై వున్నాడే? ఆ రోజున తనకి పరమ ఆప్తులూ ఆత్మీయులూ అనుకున్న అందరూ కూడా అసహ్యించుకున్నారేగాని, ఒక్కళ్లూ దగ్గరకి రాలేదేం?—

ఈ తదేకస్మరణతో ఎంతసేపు గడిచిపోయిందో అతులుడికి తెలియనే తెలియదు. ఎదట మండుతూవున్న ఆ చితి ఎప్పుడు ఆరిపోయిందో కూడా చూళ్ళేదతడు. అక్కడ కూర్చున్నంతసేపూ అతడి దృష్టి అంతా నిశ్చలమూర్తిపైనే లగ్నమైవుంది.

అంతలో అనాథ్‌నాథ్ వచ్చి "ఇంకా ఎందుకు బాబూ కూర్చోవటం? లే, పద, తక్కిన కర్మకాండ కాస్తా పూర్తిచేసేద్దాం" అన్నాడు.

"పదండి!" అన్నాడు అతులుడు, ఏదో కల వచ్చినట్టుగా లేచి నిలబడి.

అప్పటికి సూర్యభగవానుడు పడమటికి బాగా వాలిపోతున్నాడు. అంటే ప్రభావం తగ్గిపోతూ-దన్నమాట. ఆ మసకవెలుగులో అతుడి దృష్టి రేవు మెట్లమీద విరిగి పడివున్న గాజుల జతమీదికి పోయింది!—దృష్టి పడగానే అతడు స్తబ్ధుడై నిలబడి పోయ్యాడు. ఏమీ?—తనిచ్చిన ఉపహారమే ఆ గాజుల జత!—ఆ చిన్ని బహుమతి ఎంత విలువైనది? ఎంత అమూల్యమైంది?—

ఎన్ని తిట్లుతిన్నా, ఎన్నెన్ని దూషణలు పొందినా, ఈ గాజులజతమీది వ్యామోహాన్ని చంపుకోలేకపోయింది, జ్ఞానద. అయితే, అంత ప్రియమైన, ప్రాణప్రదమయిన ఆ గాజుల్ని తనే స్వయంగా ముక్కలుచేసింది. ఇదే ఆమె చెప్పిన జవాబు!—

గబగబా ముందరకి వచ్చి, అప్యాయంగా ఆ ముక్కలు ఏరి తీసుకున్నాడు, అతులుడు. అవి పగలకుండా పదిలంగా ఉన్నన్నాళ్లూ వాటి కతదేమీ గౌరవాన్ని కలిగించలేకపోయాడు, ఇవాళ విరిగి ముక్కలై పోయాక అతడి దృష్టికి అది మహా విలువయిన వస్తువుగా కన్పించింది!—

తన వెనకాల పాదాల చప్పుడయింది. గభీమని వెనక్కి తిరిగిచూసింది, జ్ఞానద.




అప్పుడు ఆమె చూసిన చూపు సహించలేకపోయాడు అతులుడు. తక్షణమే అతడి మనస్సులో ఒక వుద్దేశం మెరుపులా మెరిసింది—ఆమెని చెయ్యిపట్టుకు తీసుకు వద్దామా అని. కాని అంతలోనే మళ్ళీ తనను తను సర్దుకున్నాడు.

"జ్ఞానదా!—పొరపాట్లనేవి అందరకూ వస్తాయి. కాని...." అని అంటూ అతడు ఒక్కమాటు గుప్పిట తెరిచాడు. తెరవగానే ఆ సాయంత్రకాలపు నీరెండ గాజుముక్కలమీద పడి, అవి మిలమిల మెరిసిపోయాయి.

"ఏవేటినయితే నువ్విక్కడ ఇవాళ విరగ్గొట్టిపారేశావో, వాటిని నేను మళ్ళీ శ్మశానంనుంచి తీసుకుపోదామని వచ్చా"నన్నాడు.

ఈమాటల్లో భావం గ్రహించలేకపోయింది, జ్ఞానద.

అంచేత పొంగివస్తున్న ఆ దుఃఖంతోనే, సహజమైన ఆమె ఉదారదృష్టి అతులుడి ముఖంమీద పడింది. చాలారోజుల తరవాత మళ్ళీ ఇవాళే మాటాడటం ఎందుకనీ?" అనడిగింది, ఎంతో మృదువుగా.

జవాబు చెప్పబోయాడు, అతులుడు. కాని, అతడి నేత్రాలు అశ్రుధారలతో నిండిపోయాయి, కొంచెం సర్దుకుని ఇలా అన్నాడు :

"జ్ఞానీ!—చిన్నత్త చితాగ్నిలోంచి ఏదయితే నేను చూడగలిగానో ఇవాళ, అది ఎంతమాత్రం నన్ను విడిచిపోయేదికాదు. బలవంతంగానైనా సరే, పొగొట్ట డానికి వీల్లేనిది, అది నేనిచ్చిన గాజులజతను బలవంతంగా పగలగొట్టిపారేశావు. గాజులయితే విరిగిపోయాయి కాని, అవి నేనే భావంతో నీకు ఇచ్చానో, ఆ భావం ఇప్పటికీ అలా నిలిచేవుంది, భగ్నం కాలేదు. దాన్ని భగ్నపరిచే శక్తి ఎవ్వరికీ



లేదు నామట్టుకి నేను భగ్నపరచలేకపోయాను. నువ్వూ భగ్నపరచలేవనే నా విశ్వాసం.

ఇటువంటి విశ్వాసం నాకు నిశ్చింతగా ఉండటంవల్లనే, ఆ పగిలిపోయిన గాజు ముక్కల్ని తీసుకుబయల్దేరాను, ఇంటికి.''

ఈమాటలు విన్న జ్ఞానదాకు చైతన్యం లేదు, తదేకదృష్టితో అలా నిలబడిపోయింది.

హఠాత్తుగా అతులుడు తన రెండుచేతులూ చాపి, చిక్కిపోయిన ఆమె కుడిచేతిని తనచేతుల్లోకి తీసుకున్నాడు.

''నేనెన్నో పాపాలు చేశాను. వాటన్నింటికీ తగినశిక్ష ఎవరయినా విధిస్తే విధించనీ. నువ్వుమాత్రం ఆపని చెయ్యాలని ప్రయత్నించకు, జ్ఞానీ!—నేనెన్ని అపరాధాలయినా చేసివుండవచ్చుగాక, నిన్నుమాత్రం నేను వెనక్కి తిప్పి తీసికెళ్ళాల్సిందే. నన్ను విడనాడి, నాకు శాస్తిచేసే శక్తి నీ కేమాత్రం లేదు!'' అని చెప్పాడు

ఇప్పటిదాకా జ్ఞానదా తలవంచుకునేవుంది. ఆమె నోటినుంచి మాట పెకలి రానేలేదు—బలంలేని ఆమె చెయ్యిమాత్రం అతులుడి చేతులో ఒక్కమాటు కంపించింది.

ఇద్దరూ అలా కొంతసేపు మౌనంగా వున్నారు.

ఆ తరవాత, అతులుడు తన చేతుల్లోంచి ఆమె చేతిని మెల్లిగా జారవిడిచాడు.

''వాళ్ళప్పుడే చాలా దూరం ముందుకి సాగిపోయారు. పద, ఇంటికి పోదాం!''




అలవాటు ప్రకారం పోస్టుకోసం ఎదురు చూస్తున్న మాధవికి ఎదురుగా తండ్రి మెట్లెక్కుతూ కనిపించేటప్పటికి తన పరధ్యానానికి సిగ్గుపడి వెనుదిరిగింది. ఆమె అంతర్యం గ్రహించినట్టుగా చలపతిగారు జేబులోంచి ఒక కవరును తీసి ఇదిగో నమ్మా! నేను రాఘవయ్యగారి యింటి దగ్గర ఉంటే ఇచ్చిపోయాడు అంటూ కూతురికి అందించారు. ఆ మాటలువిన్న మాధవి మదిలో ఏదో అవ్యక్తమైన ఆశ ఒక్కక్షణం మెదిలి అది కాస్తా ఉత్తరం మీద అడ్రసు రాసిన వైఖరి గమనించి మాయమయ్యింది. అది అక్కగారి రైటింగని గ్రహించిన ఆమె ఉత్తరం చదవటంలో నిమగ్నమైపోయింది.

ఏనాడయినా అత్తవారి దగ్గరనుంచి చల్లని కబురుతో తనకు ఆహ్వానం రాకపోతుందా అన్న ఆశతో మాధవి రోజూ

పోష్టుకోసం ఎదురుచూస్తుందని చలపతికి తెలుసు. పోస్టుమేన్ వెళ్ళిపోగానే నిరాశతో నిండిన ఆమె ముఖం చూస్తే ఆయనకు గుండెమీద వెయ్యి సమ్మెట దెబ్బలు తగిలినంత బాధగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు తన అసమర్థతే ఆమె బాధకు కారణమేమో అని ఆయన కనిపిస్తుంది మరోమారు. అత్తింటివారు మూర్ఖులైతే ఆడపిల్ల బ్రతుకింతే కదా అనిపిస్తుంది. ఆయన భార్య మాత్రం "అందని పండ్లకు అర్రులు చాచారు" అంటుంది. తను మాత్రం ఏం చేస్తాడు! ప్రతి ఆడపిల్ల తండ్రికి మల్లేనే తాహతుకు మించినా కొంచెం కష్టం ఎక్కువ ఇస్తే పిల్ల సుఖపడుతుందనే ఆశతో మూడువేల రూపాయల కట్నంతో మాధవి పెళ్ళి స్థిరపరిచాడు. తనకున్న ఇద్దరాడపిల్లలలోనూ మాధవి చిన్నది. పెద్దమ్మాయి రాధ పెళ్ళయి సలక్షణంగా కాపరం చేసుకుంటోంది. ఉన్న ఒక్కగానొక్క మొగపిల్లాడూ ప్రాజ్ఞుడై ప్రక్కనున్న పల్లెలో బడి పంతులుగా బాగానే జీవిస్తున్నాడు. యిక యీ ఒక్క శుభం అయిందనిపించి తనూ, భార్యా ఉంటే తిని లేకపోతే పస్తుండవచ్చునన్న తలంపుతో అన్నీ ఆలోచించే కనీ నిర్ణయానికి వచ్చాడు. కాని వాస్తవంలో జరిగిందేమిటి? అంతా తారుమారై మొదటికి వచ్చింది. కాబోయే వియ్యాలవారు మంచివారుగా కనిపించినా డబ్బు దగ్గర ఆలస్యం చెయ్యటం ఎందుకన్నట్లు తనదగ్గరున్న మొత్తానికి సాయం వెయ్యిరూపాయిలు అప్పుతెచ్చి నిశ్చింతగా పెళ్ళిపనులలో తను నిమగ్నమై ఉన్న తరుణంలో అకస్మాత్తుగా కొడుకు వచ్చి తనతోటి ఉపాధ్యాయులకు తనకూ గవర్నమెంటు వారిచ్చిన జీతాన్ని తను పట్నంనుంచి తెస్తూండగా దొంగలు దారిలో అడ్డగించి మొత్తం సొమ్ముతోపాటు చేతినున్న వాచీ, ఉంగరం కూడా దోచుకున్నారని చెప్పి, తనపరువు నిలబెట్టటం కోసం చెల్లెలిపెళ్ళికని ఉంచిన సొమ్ములోంచి కొంత ఇమ్మని ప్రాధేయపడుతూ అడిగితే తాను కాదనలేక పోయాడు. డబ్బుకంటే పరువే ప్రధానమని భావించే తను కొడుక్కి కావలసిన డబ్బిచ్చి పంపాడు. పెళ్ళికి ముందుగానే వియ్యంకుడి పేర తను ఇవ్వవలసిన డబ్బుకు సాధారణ పద్ధతంటే అదనంగా నేవేసి నోటురాసి ఇచ్చాడు. మేళతాళాలమధ్య బెదురుతున్న గుండెను చిక్కబట్టుకుని నోటును వియ్యంకుని చేతిలో ఉంచి ఆందోళనతో ఆయన ముఖంలోకి చూచాడు. మౌనం వహించిన ఆయన గాంభీర్యాన్ని చూసి తను కొంచెం స్థిమితపడబోతున్న సమయాన పట్టుచీరను విసవిసలాడించుకుంటూ వచ్చిన వియ్యపురాలు విషయం తెలుసుకుని తనను అనరాని మాటలంది. మూడుముళ్ళూ ఎల్లాగా పడనే పడ్డాయి కనుక ఇక మిగిలినడబ్బు తీసుకుని మరీ పిల్లను కాపరానికి తీసుకు




రమ్మని పెళ్ళికొడుకును పీటలమీదనుంచి తీసుకుపోయింది. ఆ షాక్ ధోరణికి విస్తుపోయిన తను స్థాణువే అయిపోయాడు. ఆక్షణం నుంచీ తాను పడరానిపాట్లు పడుతూనే ఉన్నాడు ఆ డబ్బుకోసం. ఇలా గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూన్న చలపతిగారు భార్య సుభద్రమ్మ పిలుపుతో ఏమిటన్నట్లు చూచారు.

"కాఫీ ఇక్కడ ఉంచి పావుగంటైంది చల్లారిపోతుంది త్రాగండి" అంది. తన తప్పు ఒప్పులను సమర్థించుకోవడానికి పట్టినకాలం కేవలం పదిహేను నిమిషాలు మాత్రమేనా అని ఆశ్చర్యపోతూ గబగబా కాఫీని పూర్తిచేసి మళ్ళీ భార్యకేసి సాలోచనగా చూస్తూ ఉండిపోయారు. అందుకు సమాధానంగా ఆమె "ఇంతసేపు మీ ఆలోచనలను ఆకట్టుకున్న ఆ ఉత్తరం ఎక్కడినుంచి వచ్చిందని" అడిగింది. పెద్దమ్మాయి రాధ తనకు ఒంట్లో బాగుండలేదనీ, డాక్టరు రెస్టు తీసుకోమన్నాడనీ. అందుకు వారంరోజులలో ఇక్కడకు వస్తున్నాననీ వ్రాసింది. అని ఉత్తరంలోని సారాంశాన్ని చెప్పి చలపతిగారు పైమీద ఖండువా దులుపుకొని వీధిలోకి వెళ్ళిపోయారు

సంచిలోంచి కూరలన్నీ ఒక్కొక్కటే తీస్తూ చలపతిగారు భార్యనుద్దేశించి "నీ కొక శుభవార్త చెప్పనా" అన్నారు. ఏమీ ఉత్సాహం చూపకుండానే ఆమె చెప్పండి అంది.

మన యింటిని సుబ్బారాయుడుగారు కొంటానన్నారు. అప్పుతీరిపోగా మిగిలిన డబ్బుతో మాధవుని అత్తవారింటికి పంపవచ్చునని క్లుప్తంగా చెప్పారు. ఆ సంగతి విన్న సుభద్రమ్మగారు గుడ్లు రు కుక్కుకొని ఆ యిల్లు మాత్రం అమ్మడానికి వీల్లేదంది. అది వాళ్ళతాతగారు కట్టించి వాళ్ళ

నాన్నకిస్తే, వాళ్ళనాన్న తనకిచ్చాడని, తను ఆ ఇంట్లోనే పుట్టాననీ, ఆ గుక్కెడు ప్రాణం అక్కడే పోవాలనీ ఖచ్చితంగా చెప్పింది. ఆ మాటలు విన్న చలపతిగారు కోపంగా "నీ గుక్కెడు ప్రాణంకంటే మాధవి [illegible] ముఖ్యం అని మరిచి పోకు" [illegible] అందుకామె "ఈ బాధ లన్నీ చూడ[illegible] ప్రాణం తొందరలోనే పోతుంది లెండి" అంది రోషంగా.

తల్లినింత ఏడ్పించి తను అత్తారింటికెళ్లి ఏంబావుకోవాలి అనుకుంది మాధవి. అసలు ఈ అనర్థానికి మూలం తనుకదా! కన్నవాళ్ళ నింతబాధ పెట్టిన తను ఏ అర్ధరాత్రివేళో వెనక దొడ్లోఉన్న పాతబావిలో పడటం మేలనుకొని, ఆమాటలనే అనాలోచితంగా పైకి అనేసి ఏడుస్తూ తల్లి ఒళ్లో తల దాచు కుంది. తన [illegible] కూతురు విన్నం దుకు నిర్ఘాంత[illegible] సుభద్రమ్మగారు కూతు రును [illegible] చలపతి గారు మెల్లగా వీధిలోకి వెళ్ళిపోయారు.

యాంత్రికంగా గుమ్మంలోనిలబడిన మాధవికి పోస్టుమేన్ ఒక కవరును అందించాడు. తనకు ప్రత్యేకంగా ఉత్త రం ఎవరు వ్రాసారా అని ఆశ్చర్య పోతూ కవరు[illegible]వటం ప్రారంభించ గానే ఆమె ముఖం సిగ్గుతోనూ, ఆనందం తోనూ రంగులు మారింది. అది గమ నించిన తల్లి పూర్తిగా చదివేవరకూ ఆగి "ఎక్కడినుంచి" అని కూతురినడిగింది.

అందుకు మాధవి సిగ్గుతో వారిదగ్గరనుంచి వచ్చిందమ్మా అంది. మీఆయనదగ్గరనుంచా పట్టిపట్టి అడిగింది. అవునమ్మా! అంటూ మాధవి ఆ సంతోషంలో కవరును తల్లికి అందించబోగా నవ్వే చదివి చెప్పు అంది

సగం సిగ్గుతోనూ, మిగిలిన సగం ఆనందంతోనూ ఉక్కిరి బిక్కిరి అయి పోతున్న మాధవి ఉత్తరంలోకి చూస్తూ "ఆయన బి. ఏ. పరీక్షలు బాగా వ్రాశా రుటమ్మా—తన స్నేహితుడి తండ్రిగారి ఆఫీసులో ఆ ఊరిలోనే నెలకు నూట యాభై రూపాయల ఉద్యోగం కుదిరిందిట. ఇంక తన కాళ్ళమీద తను నిలబడగలరు కనుక త్వరలోవచ్చి నన్ను తీసుకు వెడతా ననీ—ఇప్పుడు తన తల్లి దండ్రులకు తను భయపడవలసిన అవసరంలేదనీ— ఎన్ని ఆటంకాలు వచ్చినా తను వచ్చి నన్ను తప్పక తీసుకు వెడతానని వ్రాస్తూ అసలు ఈ ఉపాయాన్ని చెప్పి వాళ్ళనాన్న దగ్గర ఉద్యోగం వేయించింది మా పెళ్ళికి వచ్చిన తన స్నేహితుడేననీ వ్రాశారు. ఈ విషయం నాన్నకు నీకు చెప్పి ప్రయా ణానికి సిద్ధంగా ఉండమని వ్రాశారు అని ముగించింది.

ఇదంతా గుమ్మంలోనే నిలబడి వింటున్న [illegible] దగ్గరకొచ్చి "నువ్వు అదృష్టవంతురాలవమ్మా! నీ భర్తలాంటి ప్రాజ్ఞులు, విజ్ఞులు నూటికి ఒక్కరున్నా చాలునన్నారు."



నిప్పులు తొక్కిన కోతిలా చిందులేస్తున్నారు పరాంకుశంగారు ఆ చిందులు తొక్కడానికి గల కారణం తెలిసిన భజగోవిందం ఒకమూలగా చేతులుకట్టుకుని నిల్చున్నాడు. సత్యవతమ్మగారు వెక్కి వెక్కి ఏడుస్తూ మధ్యమధ్యన ముక్కు చీదేస్తున్నారు.

"ఇప్పుడేం చేస్తామంట?" అంది వున్నట్లుండి. పరాంకుశం గారు ఒకక్షణం ఆగి శ్రీమతి ముఖంలోకి చూసి - పెదవి విరిచారు ఏం చెయ్యాలో తెలియదన్నట్లు.

భజగోవిందానికి చాలా ఆశ్చర్యమనిపించింది. పదిలక్షలకు ముందు డబ్బు కావాల్సొచ్చినపుడు గోడౌన్లోని ధాన్యం బస్తాలను ఊకబస్తాలుగా మార్పించి నిప్పు అంటించేశారు. అవి కాలి బూడిదగా మారినాక ఇన్సూరెన్సు డబ్బుకు క్లయిమ్ పెట్టారు. అప్పటినుండి శ్రీవారి తెలివి

తేటలమీద గొప్పనమ్మకం, భక్తి ఏర్పరుచుకున్నాడు భజగోవిందం. అటు వంటిది నేడిలా యింత చిన్న విషయాన్ని శ్రీవారు పరిష్కరించలేకపోవడం ఆశ్చర్య మనిపించింది.

శ్రీవారు తనచేతిని భజగోవిందం భుజంమీద వేసేసరికి ఉలిక్కిపడ్డాడతడు

"గోవిందం! నువ్వే చెప్పు. పావలా పూలుకొని, రూపాయి నోటిచ్చి, చిల్లర తీసుకోవడం చిన్నతనంగా భావించే అమ్మాయిని. పావలా పూలను పది పైసలకు బేరమాడే అబ్బాయికిచ్చి ఎలా పెళ్ళి చెయ్యమంటావు?" అన్నారు. ఆమాట విని రుసరుసలాడుతూ చూసారు సత్యవతమ్మ శ్రీవారివైపు.

"అలా చెయ్యకపోతే విషం మ్రింగి చస్తానంటుంది. మన అమ్మాయి."అంది. అదికూడా పాయింటే అన్నట్లు తలాడించారు. తరువాత కొద్దిక్షణాల పాటు ఆలోచిస్తూ పచార్లు చేసారు.

"సరే .... ఎలక్షన్లు వస్తున్నాయి ప్రెస్ రిపోర్టర్లకు ఫోను చేసి పిలు." అన్నారు భజగోవిందంతో.

శ్రీవారి ప్రవర్తనకు కోపంగా లేచి విసురుగా పక్కగదిలోకి వెళ్ళిపోయింది సత్యవతమ్మ.

"కూతురు పెళ్లిగూర్చి తలబద్దలగొట్టుకుంటుంటే మధ్యన ప్రెస్ రిపోర్టర్లెందుకని" తలగోక్కున్నాడు భజగోవిందం

* * *

మర్నాడు దేశంలోని అన్ని పత్రికలూ తాటికాయలంత అక్షరాలతో ప్రముఖ రాజకీయనాయకుడు పరాంకుశం గారి పుత్రికకు, హరిజన విద్యార్థి పైడిరాజుకు త్వరలో వివాహం జరుగనున్నట్లు ప్రకటించాయి. అంతేకాదు, ఈ వివాహంలో శ్రీవారు కనబరచిన గొప్పతనాన్ని కులవివక్షతను పాటించని అతని హృదయ విశాలతని, సంస్కారాన్ని గొప్పగా పొగిడాయి.

ఆ పేపర్లను చూసిన భజగోవిందం ముక్కుమీద వ్రేలేసుకుని "నిజమేనా?" అని ప్రశ్నించాడు శ్రీవార్ని. తలూపారు వారు.

"అవునోయ్. నేనే ఆ విషయం పత్రికలవారికి చెప్పాను. ఈ దెబ్బతో ప్రజలంతా మన గొప్పతనాన్ని గుర్తిస్తారు. ఇక ఎలక్షన్లలో మనకిక తిరుగుండదు" అంటూ చిద్విలాసంగా నవ్వేరు.

"ఔరా! ఎంత పెద్ద ఎత్తువేశాడు!" మనసులోనే అనుకుని బుర్రగోక్కున్నాడు భజగోవిందం.




పదింబావు అయిపోయింది

వల్లి ఆదరాబాదరా మందు గ్లాసులో పోసి తల్లికి యిచ్చి అన్నం అయినా తినకుండా పరుగులాంటి నడకతో ఆఫీసు చేరింది.

ఆఫీసు గడియారం పదిన్నర కొట్టింది.

రిజిష్టర్‌లో సైన్‌చేసి తన సీట్‌లో కూర్చుంది అదురుతున్న గుండెతో.

ఐదునిముషాల్లో రాము వచ్చి అయ్యగారు రమ్మంటున్నారని చెప్పాడు.

రుమాలుతో చిరుచెమట తుడుచు కుంటూ గదిలోకి వెళ్ళింది వల్లి.

చక్రవర్తి తలవంచుకుని రాసుకుంటు న్నాడు.

వల్లి రెండునిముషాలు అలాగే నిలబడి అసహనంగా కదిలింది. అతను తల ఎత్తకుండానే "ఇప్పుడు టైమెంత అయిందో తెలుసా?"

"పదిన్నర!" గొంతు పెగుల్చుకుని ఎలాగో అంది.

"నేను ఎన్ని గంటలకు రమ్మని చెప్పానో గుర్తువుందా!"

తల వూపింది వల్లి.

అతను రాత ఆపి బల్ల మీద వున్న ఆకుపచ్చని పేపర్‌వెయిట్ చేతితో కదుపుతూ "ఫస్టురాకుండానే కచ్చితంగా జీతం తీసుకుంటూన్నప్పుడు సిన్సియర్‌గా పని చెయ్యాలని తెలీదా?" అతని కంఠం ఎంత నిశ్చలంగా వుందో అంత కరుగ్గా వుంది.

అభిమానం దెబ్బతినింది వల్లికి. ఏదో చెప్పాలనుకుంది కాని నోరు పెగల్లేదు. గుండె గొంతులో కొట్టుకుంది. ఆవెంటనే

కన్నీరు కూడా తిరిగింది. తను అనుకున్న దేమిటి. జరుగుతున్నది ఏమిటి! తన తల్లికి యిలా వుందని నెమ్మదిగా నచ్చ చెప్పాలని అనుకుంది? ఆ ధైర్యమంతా యిలా దిగజారిపోయిందేం!

తను యీ మూడేళ్లుగా ఒక్కనా డయినా లేట్‌గా వచ్చిందా? ఈ రోజు ఒక్కరోజు వస్తే కనీసం కారణం కనుక్కొని సానుభూతి అయినా చూపించా ల్సిందిపోయి! "వెళ్ళండి. పెండింగ్ ఫైల్సన్నీ పూర్తి అయ్యేలాగుచూడండి" ...తను ఆమె కళ్ళవంక చూసీచూడనట్టుగా నటించి అన్నాడు. వొళ్లు మండింది పళ్ళికి. విసురుగా వెనక్కి తిరిగి స్ప్రింగ్ డోర్స్ "ఫెడేల్" మని నెట్టుకుని వచ్చేసింది.

తలుపుల చప్పుడుకు వులిక్కిపడ్డాడు భాస్కరమూర్తి. తన సీట్‌లోకి వెళ్ళి పోతుంటే, "పాపం. ఇవాళ ఏమి యిబ్బంది వచ్చిందో ఏమో!" అన్నాడు ఆమెకి వినపడేలాగు.

పళ్ళి ఏవగింపు దాచుకుని సీట్‌లో కూర్చుంది.

"ఏమయినాసరే రాత్రి పదిగంట లయినాసరే తను యివన్నీ పూర్తిచేసే వెళ్ళాలి. పుట్టి బుద్ధి తెలిపిందిగా తను ఎప్పుడూ యింత అసహ్యంగా కఠినంగా మాటపడలేదు.

తలతిప్పి బల్లమీది ఫైల్స్ చూసింది.

"అమ్మ అనారోగ్యంవల్ల కొన్నాళ్లుగా వర్క్ సరిగ్గా చెయ్యటం లేదు నిజమే. అయినంతమాత్రాన పని ఎగ్గొట్టాలని చూసేదా తను? అంత నీతిలేనిదా!"

పళ్ళి తల ఫైల్‌లోకి దించుకుంది నిట్టూర్చి.

గంటలు గంటలు గడిచిపోయాయి. పళ్ళి సగంపైగా పూర్తిచేసింది. పన్నెండు న్నర కొట్టింది గడియారం. లంచ్ టైమ్!

ఒక్కొక్కళ్ళె డెస్కులముందునుంచి లేచి కాంటీన్‌వైపు వెళ్తున్నారు.

పళ్ళి ఫైల్స్ మూసేసి కూర్చుంది. పొద్దున అన్నం తినని నీరసం. రాత్రి సరిగ్గా నిద్రలేకపోవటం వల్ల అలసటా కలిపి ప్రాణం తోడేస్తున్నాయి. సన్నగా తలనొప్పి ప్రారంభం అయింది.

రాము ప్లాస్టిక్ బుట్టలో ప్లాస్కు పళ్ళు తీసుకెళ్తున్నాడు చక్రవర్తి రూమ్‌కి.

నిట్టూర్చింది పళ్ళి.

"అలావున్నారేం? వొంట్లో బాగా లేదా?" కాటుక కరిగిపోయి, కళా విహీనంగా వేసవికాలంలో కాలవల్లా వున్న కన్నులకేసి చూస్తూ అన్నాడు భాస్కర మూర్తి.

"ఆ! కొంచెం తలనొప్పి!" నుదురు రుద్దుకుంటూ అంది.

"కాంటీన్‌కి వెళ్దాంరండి. వేడి కాఫీ పడితే తలనొప్పి ఎగిరిపోతుంది." చను వుగా అన్నాడు నవ్వుతూ.

అతని అతి చనువు ఆమె కసహ్యం కలిగించింది. డెబ్బైమంది పిల్లల తండ్రి

యువ




ప్పుడూ ఇదే రోగం! ఆముదంకంటే చేదు!"

"వద్దు." అంటూ తల తిప్పుకుంది ఇంకోమాటకి అవకాశం లేకుండా.

మాడిన మొహంతో వెళ్లిపోయాడు భాస్కరమూర్తి.

"తన తండ్రే బతికివుంటే! తను ఇప్పుడు ఒక మహారాణీలా వుండేది కాలు మీద కాలు వేసుకుని. ఊరూ పేరూ లేని అనామకురాల్లా యీ ఆఫీసులో ఒక యంత్రంలాగా ఎన్నటికీ వుండేది కాదు. ఇంతపెద్ద ఆఫీసులో ఇంతమంది మగాళ్ళ మధ్య తను ఒక్కర్తే ఆడది! తనకి యీ ప్రపంచంలో స్నేహితులంటూ ఒక్కళ్లూ లేరు. స్నేహితులంటే గుర్తు వచ్చింది. శంకరం ఎక్కడ వున్నాడో ఇప్పుడు!

పన్నెండేళ్ళ క్రితం తమ వూరిలో తన యింటిపక్క నేస్తం! ఏకైక నేస్తం! తన జీవితం ఎస్. ఎస్ ఎల్. సి. వరకూ ఎంత వెలిగిందీ! తన పెంపకమే ఓ ప్రత్యేకత! తన వూరులో వీధి మొత్తం మీద మొట్టమొదటిసారి సైకిల్ తొక్కుతూ తిరిగిన అమ్మాయి తనే కదూ! అంతా వింతగా, ఆశ్చర్యంగా చూసేవాళ్ళు. శంకరాన్ని వెనక కూర్చోపెట్టుకుని సైకిల్ మీద స్కూల్ కి వెళ్తుంటే, మొగపిల్లలు తనవి

రౌడీరాణీ అని ఎలిచే వాళ్ళు స్కూల్లో ఆ పేరు తనకి స్థిరపడిపోయింది అప్పుడు.

అమ్మ ఎప్పుడైనా నాన్నతో తన గురించి అంటే, ఆయన నవ్వుతూ గర్వంతో, "నా కూతుర్ని కలెక్టర్ చేస్తానే." అనేవాడు.

"అయ్యో! నాన్నా! నువ్వెంత అమాయకుడివో! నీ కూతురు కలెక్టర్ కాదు గదా, కనీసం గ్రాడ్యుయేట్ అన్నా కాదు. వూరూ పేరూ లేని అనామకురాలు! ఓ చిన్న మరమేకు ఈ యంత్రాంగంలో. దీర్ఘంగా ఆలోచిస్తున్న వల్లి ఘొల్లున నవ్వులు వినిపిస్తే, తల తిప్పి చూసింది

ఎదురుగ్గా వేప చెట్టుకింద నిలబడ్డ భాస్కరమూర్తి అంటున్నాడు: "ఈయన చూట్టానికి చిన్నవాడిలా వుంటాడు గానీ మహామొండీ, చచ్చే స్ట్రిక్టూ! ఐదు నిముషాలు లేటయితే వూరుకోడు. లీవ్ కావాలంటే యక్ష ప్రశ్నలు! ఇతని తండ్రే నయం అనిపిస్తున్నాడు ఇప్పుడు. దీనికంటే గవర్నమెంట్ ఆఫీసేనయం." ఇంకోళ్ళని విమర్శిస్తూ వుండటం అతని కెప్పుడూ ఇష్టం. "ఇటువంటి సంఘానికి వూటీస్" అనుకుంది వల్లి.

* *

సాయంకాలం ఆరుగంటలయిపోయింది. ఇంకొక్క పావుగంట వుంటే పని పూర్తి అయిపోతుంది. ఆఫీసంతా ఖాళీ అయిపోయింది. రాము గుమ్మంలో నిలబడి ఉన్నాడు.

చక్రవర్తి గదిలోంచి వచ్చాడు. అతను తనని దాటిపోతూ ఒక్కక్షణం తన సీట్ దగ్గర ఆగటం గమనిస్తూనే ఉంది. కానీ సీట్లోంచి లేవలేదు. ఇదేం ఆఫీస్ టైమా!

అతని అడుగులకు మడుగులొత్తుతూ లేచి నిలబడటానికి!

అతను వెళ్ళిపోయాడు.

"రామూ! ప్లీజ్ అయిదు నిముషాలు" అంటూ గబగబా పని చేసుకోటం ప్రారంభించింది.

పావుగంటలో అన్నీ సర్దేసి యింటికి బయల్దేరింది

చీకట్లు ముసురుతున్నాయి.

పరిసరాలు గమనించకుండా, మరో ఆలోచన లేకుండా ఇల్లు చేరుకుంది

ఇల్లంతా బావురు మంటోంది. చీకట్లు దట్టంగా వ్యాపించాయి. తల్లి మంచంలో మగతగా పడుకుని వుంది.

రాత్రి పడుకోబోయేముందు అనుకుంది వల్లి, రేపు అమ్మని నర్సింగ్‌హోమ్‌లో చేర్పించాలని! పగలంతా యిలాగ దిక్కులేనిదానిలా పడివుండేకంటే అదేనయం. కొంత ఆ నర్సులు కనిపెట్టుకునేనా వుంటారు.

ఆ మర్నాడే తల్లిని హాస్పిటల్లో చేర్పించింది వల్లి.

* *

రోజులు నిరాసక్తంగా గడిచి పోతున్నాయి. తల్లిని తను కనిపెట్టుకుని వుండ




లేకపోయినా కనీసం హాస్పిటల్లో సరైన వాతావరణమూ, నర్సులూ అయినా వుంటారు గదా! బోలెడంత డబ్బు అవుతోంది. కానివ్వు ఏం చేస్తాం! ఒకపూట తిండి మానేసి అయినా తల్లికోసం డబ్బు విలవ చెయ్యాలి.

ఒకరోజు ఆఫీసు వర్కు గంటకు ముందే ముగింపుచేసి సరాసరి హాస్పటల్ కొచ్చింది.

తల్లి ఆరోగ్యం మాత్రం మారలేదు.

ఓ గంట కూర్చుని ఖాళీ ఫ్లాస్కుతో తిరిగి వస్తూంది. వరండా దాటుతుంటే "హల్లో!" అని విన్పించింది దగ్గరగా.

పరధ్యానంగా వున్న వల్లి ఉలిక్కిపడి తల ఎత్తింది.

అతి దగ్గరగా నిలబడివున్న చక్రవర్తి!

''ఏమిటి యిక్కడున్నారు? మీవాళ్ల ఎవరయినా వున్నారా?'' కుతూహలంగా చూస్తూ అడిగాడు.

తడబడింది వల్లి. ''ఆ! మా అమ్మ వుంది.''

''ఏమిటి అనారోగ్యం?''

''బ్లడ్ ప్రెజర్!''

''ఎప్పుడు జాయిన్ చేశారూ?''

వల్లికి విసుగనిపించింది. ఏమిటీ యక్ష ప్రశ్నలు! చీకటి పడుతోంది. ఇంటికివెళ్ళి అన్నం వొండుకోవాలి. బట్టలు వుతుక్కోవాలి.

"వారం రోజులయింది."

ఆమె కళ్ళల్లో కలగా కన్పిస్తున్న విసుగు అతను గమనించాడు.

"ఓ అరగంట వెయిట్ చెయ్యండి. నేనూ వస్తాను. కారులో వెళ్దాం? సమాధానంకోసం ఆగకుండా వెళ్ళిపోయినాడు.

వల్లికి వొళ్ళు మండింది. ఏమిటి అదాటీ! ఇదేం ఆఫీసా! అతని గొం తులో ఎప్పుడూ అధికారమూ, గర్వమూ యేనా? ఇంకో ధ్వని వుండదా! అతను పెద్దన్నాను కాబట్టి తను తప్పకుండా వెళ్ళి తీరుతుంది.'' వల్లి విసురుగా వచ్చే సింది.

బాగా చీకటి పడింది.

కార్పొరేషన్ దీపాలు వెలుగు తున్నాయి. గుమాస్తా పేలవమయిన నవ్వుల్లా! ఏం సందడి! అంతా నవ్వుతూ గడపాలని ప్రయత్నించేవాళ్లే!

ఉనేగా సెంట్ వాక్కా అబ్బాయి వల్లిని రాసుకుంటూ వెళ్ళాడు

వల్లి భుజంమీది ఫ్లాస్కు అటూ యిటూ వూగింది.

''పీడమొహం తగలెయ్య! కళ్లు కని పించట్లా! దాన్ని కొట్టడానికి అంతు లేని ధైర్యం. మళ్ళీ పెళ్ళంటే అంతు లేని భయం!....'' నవ్వుకుంది వల్లి తన ఆలోచనలకు.

''పెళ్ళి! ఎందుకు! పెళ్ళి చేసుకుంటే అంటిం పెట్టుకుండే లేనిపోని బెడద నెత్తికి తెచ్చుకుంటమే: పిల్లలు - సంసా రం అదో తప్పుకోలేని గొయ్యి. నిలు వునా ఒగబడాల్సిందే: ప్రియుడు రాళ్లగా వుండే వేరు. భార్యగా చేసుకుంటే వప్పనయి పోదూ!''

చీకటియిల్లు ఆహ్వానించింది వల్లిని.

కాంతిలేని విగ్రహంగా దావమీద కూలబడింది కళ్లుమూసుకుని వ్యర్థమయిన జీవితం! మార్పులేని నిరాశ!

కన్నతల్లి పట్ల బాధ్యతకూడా సరిగ్గా నిర్వర్తించలేక పోతోంది.

* *

మధ్యాహ్నం! కాగితాలు టైపు చేస్తోంది అర్జెంటని. రామువచ్చి పిలి చాడు ఫోను వచ్చిందని.

తనకు ఫోను ఎక్కడ్నుంచి?

వల్లి రుమాలుతో మొహం తుడుచు కుంటూ చక్రవర్తి గదిలోకి వెళ్లింది రిసీవర్ బల్లమీద వుంది.

''హలో'' అంది వల్లి. చెయ్యి కం పించింది

* *

వల్లి మొహం పాలిపోయింది. గట్టిగా బల్లని పట్టుకుని

''ఎప్పుడూ?'' అంది వొణుకుతున్న గొంతుతో.

* *

వల్లి గొంతులో మార్పుకి చక్రవర్తి తలెత్తి చూశాడు.

రిసీవర్ పట్టుకున్న చెయ్యి వొణికి పోతోంది. మొహం పాలిపోయి పెది మలు నల్లబడ్డాయి. కళ్ళనుంచి నీళ్ళు జారుతున్నాయి.

చక్రవర్తి జాగ్రత్తగా విన్నాడు అటునుంచి విన్పడు తున్నదాన్ని. వాళ్ళ అమ్మగారికొక్కటే కండిషన్ ఏం బాగా లేదట. మాటకూడా పోయిందట.




వళ్లి మెదడు మొద్దుబారి పోయింది రిసీవర్ పెట్టేసి బయటికి వచ్చేసింది తడబడుతూ.

చక్రవర్తికి చెప్పనయినా లేదు. గబగబా రోడ్డును అడ్డంగా దాటబోయే ప్రయత్నంలో పరుగెత్తబోతోంది

చటుక్కున ఎవరో పట్టుకున్నారు. తల తిప్పిచూసే వోపికకూడ లేకపోయింది వళ్ళికి.

"కారులో వెళ్దాంరాండి." చక్రవర్తి వళ్లి చెయ్యి పట్టుకుని ఒక విధంగా లాక్కుపోయాడు.

హాస్పిటల్‌ముందు కారాగింది. వళ్లి దూకి పరిగెత్తింది.

"అమ్మా! అమ్మా!" ఏముంది అక్కడ! మొహంమీద దుప్పటి కప్పేశారు అప్పటికే.

వల్లి తల్లి మీద వాలిపోయింది ఏడుస్తూ.

అమ్మా! నేనొక్కదాన్నే ఎట్లా బతకనమ్మా! నన్ను వొదిలేసి పోయావా? కళ్లు తెరువు ఒక్కసారి. అమ్మా! అమ్మా! నే నెవరికోసం బతకాలమ్మా! నా వుద్యోగం, నా వూపిరీ ఎందుకమ్మా?" పిచ్చిదానిలా-అరుస్తూ హృదయ విదారకంగా ఏడ్చేస్తున్న వల్లిని ఎవరో యివతలికి లాక్కొచ్చారు. వల్లి ఏమీ పట్టించుకోలేదు అది ఎవరో.

ఇంటికెలా వచ్చిందో, ఎవరు తెచ్చారో ఏమీ గమనించే స్థితిలో లేదు.

ఒకటే బాధ! ఒకటే కన్నీరు! కనీసం ఆఖరి క్షణాల్లో అయినా తను దగ్గర లేకపోయింది. తల్లిని చూడలేకపోయింది. తన వుద్యోగమే తల్లి తనకు ఆఖరి చూపుని కూడా కరువు చేసింది.

రెండు రోజుల తర్వాత ఆఫీసుకు రిజైన్ పంపించేసింది. శ్మశానంలాంటి యింట్లో ఏడుస్తూ కూర్చుంది ఏకాకిలా.

ఏముందీ అంతా శూన్యం! తనకు ఎవ్వరూ లేరు.

మోకాళ్లల్లో తలదాచుకు వెక్కి వెక్కి ఏడ్చేసింది వల్లి

హఠాత్తుగా యిల్లంతా వెలుగు పడుతుంది. మండుతున్న రెప్పలు ఎత్తి చిట్లించి చూసింది.

ఎదురుగ్గా మసగ్గా ఎవరో కన్పిస్తారు. క్రమంగా తన కళ్ళకు కన్పిస్తున్నది ఎవరో అర్థం అయింది. వల్లి మొహం ఎర్రనయింది.

చటుక్కున లేచి నిలబడింది "కూర్చోండి. అయ్యో మీలాంటి గొప్పవాళ్ళు మా యింటికి వస్తే కుర్చీ అయినా లేదు. ఇదుగో ఈ మంచంమీద కూర్చోండి దాని మట్టి మీ బట్టలకు అంటుతుందేమో!" సాధ్యమయినంత వెటకారం గొంతులో నింపి అంది.

ఇద్దరిమధ్యా కాలం నిల్చిపోయింది. నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. వల్లి తల దించుకుని కూర్చుంది.

చక్రవర్తి హఠాత్తుగా అడిగాడు "రిజైన్ చేశారేం?"

చటుక్కున కళ్ళెత్తింది సంధ్యాసమయాన నిర్మలమయిన కొలనులో ప్రతిబింబించిన ఆకాశం ఎరుపురంగులా వుంది ఆ కళ్లు.

"ఉద్యోగం చెయ్యవలసిన అవసరం కన్పించలేదు. నేను సంపాదించిన జీతం కోసం ఎదురు చూసేవాళ్ళు ఎవరూలేరు. నేను ఎవరికోసం సంపాదిస్తున్నానో వాళ్ళు నన్ను విడిచి వెళ్ళిపోయినారు." వల్లి గొంతు జీరపోయింది.

"మరి సంగతి?"

"నేనా! నేనొక్కదాన్ని ఎలాగో బతక్కపోను. ఇంత విశాలప్రపంచంలో నాకు చోటు వుండదా? నా వొంట్లో యింకా నెత్తురు వుంది. నా జబ్బల్లో బలముంది. అంట్లు తోమటానికయినా నా క్వాలిఫికేషన్ నాకు అడ్డురాదు."

"అంట్లు అయినా తోముతారుగానీ నా దగ్గర పని చెయ్యాలన్నమాట" చక్రవర్తి సూటిగా అడిగాడు.

"మీకు నమస్కారం చేస్తాను. నన్ను వొంటరిగా వొదిలెయ్యండి మీ క్రింది వుద్యోగిమీద మీకు గల ఆదరానికి చాలా సంతోషం దయచేసి నన్ను వొంటరిగా వుండనివ్వండి" ఆమె చేతులు దీనంగా జోడించింది.

చక్రవర్తి మనసులో బాధనిపించింది. లేచాడు మంచంమీదనుంచి. అతని కళ్ళు అప్రయత్నంగా ఆ యింటిని తిలకించినాయి.

తాడుమీద వ్రేలాడుతున్న మాసిన చీరలు. కిటికీలో ఖాళీ మందుసీసాలూ!

నేలంతా ఎంతో అశుభ్రంగా. బత్తాయితొక్కలతో పాడుపడి మానవ

యువ




సంసారమే ఎరగనట్టుగా వుంది. సూర్య కిరణాలు పడి కిటికీలకు తలుపులకు యథేచ్ఛగా అల్లుకున్న సాలెగూళ్ళు మెరుస్తున్నాయి

చక్రవర్తి దృష్టి గోడమీద తగిలించి వున్న ఫోటోమీద పడింది. అతని కళ్ళు అక్కడే నిలిచిపోయాయి

''అదీ..... అది......వెంకట్రామయ్యగారిదికదూ?'' అతని ప్రశ్నకు తల వూపింది వల్లి.

అతని కళ్ళల్లో అంతులేని ఆశ్చర్యం తొంగిచూసింది.

"అది యిక్కడెందుకుంది? ఆయన మీకు బంధువా?" కుతూహలంగా అడిగాడు.

ఆమె అతని కేసి విసుగ్గా చూసింది. "ఆయన ఎవరనుకుంటున్నారు? మా నాన్న!"

చక్రవర్తి ఒక్క అడుగు ముందుకు వేశాడు ''నిజం!'' "నువ్వు వల్లివా? వెంకట్రామయ్యగారి అమ్మాయివా?" ఆమె పేరు అప్పుడే తెలిసినట్టుగా అడిగాడు సంభ్రమంతో.

వల్లి చిత్రంగా చూసింది యీ యనకి మతిపోయిందా అనుకుంటూ.

"వల్లీ! నన్ను గుర్తుపట్టలేదూ? నేను శంకరాన్ని. నీ చిన్ననాటి స్నేహితుణ్ని! గుంటూరులో మీ యింటిపక్కన వుండే ఆనందరావుగారి అబ్బాయి శంకరాన్ని!"

వల్లి నమ్మలేనట్టుగా, అంతా అయోమయంగా వున్నట్టు తోచింది. ఇదేమిటీ! ఈ మధ్య తరచూ గుర్తు వస్తున్న శంకరం యితనా? సన్నగా పీలగా టైఫాయిడ్ రోగిలావుండే శంకరం యీ హీరోలాంటి చక్రవర్తా! లక్షలకు అధికారా? అసంభవం!

ఆమె కళ్ళల్లో అపనమ్మకం అతను పసిగట్టాడు. ఒక్కడుగు ముందుకు వేసి ఆమెచెయ్యి పట్టుకున్నాడు. "నిజంగా నేను శంకరాన్నే, వల్లీ! మీరు గుంటూరు నుంచి వెళ్ళిపోయాక యేడాదికి కాబోలు మేమూ అక్కణ్ణుంచి వచ్చేశాము. నా బి. ఏ. అవటమూ నాన్న చనిపోవటమూ ఈ ఆఫీసుమీద అధికారాలు అన్నీ నాకు రావటమూ ఒక్కసారే జరిగాయి. నా పేరూ మార్చుకున్నాను అప్పుడే నా ఆఫీసులో నాకింద పనిచేసే ఓ అమ్మాయే వల్లి అని నాకేం తెలుసూ?"

వల్లి మొహం పాలిపోయింది. పెదిమలు బిగించి, "నేను నమ్మలేను." అంది.

"అవును. ఇక్కడ హఠాత్తుగా నాన్నగారి ఫోటో చూడలేకపోతే నేనూ నమ్మేవాడిని కాదు యీ నిజాన్ని. వల్లీ! మనిద్దరం ఆ రోజుల్లో ఎంత స్నేహితుల్లా వుండేవాళ్ళం. అదంతా యిప్పుడో మధురమయిన కలలా అన్పిస్తోంది. ఆ నాటి స్మృతుల్లో నేను ఒక్కటిగూడా మరచిపోలేదు. మీ నాన్నగారికి నువ్వు అమ్మాయివన్న సంగతి ఎప్పుడోగాని గుర్తువచ్చేది కాదనుకుంటాను. ఎంత అల్లరి చేసేదానివి అప్పుడు!

"నాతో బిళ్ళంగోడు, గోలీలూ ఆడేదానివి. నీతో తొక్కుడుబిళ్ళ, చెమ్మచెక్క ఆడేవాణ్ని నేను నీకు సైకిలింగ్ నేర్పించె నేను.

"సైకిల్‌మీద నువ్వు తొక్కుతూంటే నవెనక భయం భయంగా కూర్చుని ఏదో ఆనందంతో నీతో స్కూల్ కెళ్ళేవాడిని.

"ఆ రోజులు ఎంత మధురమయినవి! ఎంత హాయి వాటిల్లో! మనం యిద్దరం తెల్లవారుఝామున లేచి ఆవుపేడ తెచ్చి లాంతరవెలుగులో, పెచ్చుని దుప్పట్లు కప్పుకుని గొబ్బెమ్మలు చేసేవాళ్ళం కదూ! మీ యింట్లో అప్పుడు పెద్ద పున్నాగచెట్లు వుండేవి. వెన్నెల తివాచీ పరచినట్టుగా నేలమీద వత్తుగా రాలిన పున్నాగపూల్ని మనం ఏరితెచ్చి దండలు అల్లి ఆ గొబ్బెమ్మల చుట్టూ పరిచేవాళ్ళం. మా అమ్మకి సరదాలన్నీ ఏం లేవు. అందుకే మీ అమ్మప్రాణం తీసి ఆ చలిలో లేపి పెద్ద పెద్ద ముగ్గులు వేసేదాకా వుంచేవాళ్ళం. మీ అమ్మ నవ్వుతూ మధురంగా విసుక్కుంటూ, కూనిరాగాలు తీస్తూ ముగ్గులు వేసేదికదూ!

"శంకరం ఆడపోలిక్కి దీని మొగలక్షణాలకీ సరిపోయింది." అని మీనాన్నగారు నవ్వుతూ ఎగతాళి చేసేవారు. అబ్బ! ఎంత అద్భుతమయినవయస్సు!"

వల్లి యీ లోకం స్పృహలేనట్టుగా కళ్ళు విప్పార్చి చక్రవర్తి మాటలు వింటోంది. కళ్ళముందు పున్నాగపూలు కదులుతున్నాయి పున్నాగ పరిమళంలాంటి ఏవో స్మృతులు!—

"వల్లీ! నాకు ఎప్పటికీ మరపురానిది ఒక్క సంఘటన చెప్పనా?" నువ్వు గుర్తు వచ్చినప్పుడల్లా నాకు ఆసంఘటనే




నవ్వు తెప్పిస్తుంది. ఒకసారి యిద్దరం వాకిట్లో అరుగుమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాము. నువ్వు ఎన్నడూ లేంది ఆరోజు పరికిణీ, జాకెట్ వేసుకున్నావు. నీ జాట్ జుట్టుకి కష్టపడి సవరం కలిపి నడుంవరకు ఎరుపు, తెలుపు, పసుపు కలయికలతో మనోహరంగా వున్న పెద్ద పెద్ద బంతిపూలతో జడ వేసింది మీ అమ్మ. మనం పరిసరాలు గమనించకుండా మాటల్లో మునిగిపోయాం. ఇంతలో ఎక్కడ్నుంచో పెద్ద ఎద్దులాంటి మేక వచ్చి గభాల్ని పూలజడ బలంగా లాగి నోటితో కరుచుకు పారిపోయింది. తర్వాత మనం అందరం ఆ విషయం చెప్పుకుని ఎన్నాళ్ళు నవ్వుకున్నాం!"

చక్రవర్తి కళ్ళల్లోనుంచి జారి వల్లి కేసి చూశాడు. వల్లి కళ్ళు మూతలు పడుతున్నాయి, శరీరం కొంచెంగా వణుకుతోంది. పెదిమలు కదుల్తున్నాయి

కుదిపాడు చక్రవర్తి వల్లిని.

పెనుగాలికి పారిజాతం మొగ్గలా వల్లి చక్రవర్తి చేతుల్లో స్పృహతప్పి పడిపోయింది.

ఆమె పెదిమలు కదులుతున్నాయి "శంకరం!" అంటూ.



# ఢిల్లీ కా లడ్డూ




["ఢిల్లీ కా లడ్డూ'' ఒక సామెతలో కొంతభాగం. పూర్తి సామెత—''ఢిల్లీ కా లడ్డూ జోఖాయే సో పఛతాయే — జోనఖాయే, వోభీ పఛతాయే'' అంటే, ''ఢిల్లీలడ్డు తిన్నవాడెల్లా పశ్చాత్తాప పడతాడు — ఇక తిననివాడు అంటే వాడు కూడా'']

---


తారాశంకర్ బెనర్జీ


---

హీరేన్ ముఖర్జీ అడిగినవాడని వూళ్లో మగవాళ్లలోనే కాదు ఆడవాళ్లల్లో కూడా ప్రసిద్ధి! అలాంటివా డిలాంటి మగ పిరిపని చేస్తాడని యెవ్వరూ కలలో కూడా అనుకోలేదు—చెదలుపుట్ట అగ్ని పర్వతంగా మారింది!

ఏడుగురు పిల్లల్ని పెట్టుకుని నలభై మోయేట హీరేన్ మళ్ళీ పెళ్ళి చేసు కున్నాడు. పెద్దబ్బాయికి 19-వ యేడు. రెండోపిల్ల, కాపురానికి పోయింది. మిగతావాళ్ళు 15 యేళ్ళ దగ్గరనించి మూడేళ్ళ వరకున్నారు—హార్మోనియం మెట్లలాగా. ఇక వాళ్ళ అల్లరీ యేడుపూ అవశ్రుతిగావున్నా కోరస్ అని అనిపించ కుండా పోదు.

హీరేన్‌కి పదమూడోయేట పెళ్ళయింది. 18 యేట భార్య కాపరానికి వచ్చింది. అప్పటినించీ యీ 22 యేళ్ళ వైవాహిక జీవితంలో రాత్రి తొమ్మిది దాటినాక అతనెప్పుడూ బజార్లో వుండి యెరగడు. అంతేకాదు — యీ 22 యేళ్ళనించీ ఒకపూట అన్నం యితనే వండేవాడు. పొద్దున్న పక్కలు యెత్తే వాడు, పిల్లలకి నీళ్ళుపోసేవాడు. ఇక భార్య పురిటింట్లో వున్నప్పుడు సర్వమూ తానే చేసేవాడు!—వీటి అన్నిటిని బట్టి మాస్త్రే యితను పిల్లల పోషణకోసం పెళ్లి చేసుకున్నాడనటానికి వీలులేకుండా వుంది—ఒకవేళ అతను చెప్పినా అతికే టట్టు లేదు!

ఊళ్ళో మగవాళ్ళంతా హీరేన్ సాహసానికి విస్తుపోయారు. కాని వాళ్ళకి ఈ ఆశ్చర్యం తగ్గకముందే తమనడుములు విరిగిపోయినవనీ, యిక అఊళ్ళో తాము తలెత్తుకు తిరగటం అసంభవమనీ వాళ్ళు గ్రహించారు

•

ఆ రాత్రి :

తనపైనపడ్డ చేతిని తీసివేసి రాముడి పెళ్ళాం మొహం చిట్లించి. "ఫో— అవతలికి! మీ మొగాళ్ళ మొహాన మొద్దులు పెట్ట! మిమ్మల్ని అంటుకున్న పాపం గంగలో మునిగినా పోదు!" అన్నది.

రాముడు గాభరాపడ్డాడు ధోరణిచూసి. అసలే వాడు భార్యని పులిని చూసినట్టు చూస్తాడు. పైగా వాడు యివ్వాళ గొడుగు పూచతో భార్య పెట్టెతీసి ఒక రూపాయి డబ్బులు సంగ్రహించాడు! సంగ్రహించకమాత్రం యేం చేస్తాడు. ఆవాంతరం వచ్చి కూర్చుంది. బీడీల కొట్టువాడు. యిక అప్పు ఇవ్వనని నోటీసు ఇచ్చాడు. ఇదివరకే రూపాయిన్నర బాకీ! వీడికి హోం గవర్నమెంటులో బీడీల బడ్జట్ కింద శాంక్షన్ అయేది రోజుకు కానీ! కాని ఈ యుద్ధపు రోజుల్లో అదెలా సరి పోతుంది?

దడ దడమంటున్న గుండెతో వాడి పేటెంటు నవ్వు "హీ, హీ, హీ."




ఉపయోగించి— "ఏం—యేంచేశానూ?" అన్నాడు రాముడు.

పెళ్ళాం ఆముదం తాగిందానిలాగా మొహంపెట్టి— "ఇదిగో, నవ్వమాకు! నాకు బాగుండదు. చెప్తున్నాను.—కోతి నవ్వూ నువ్వూ?" అన్నది.

తను కోతైనాబాగుండే దనుకున్నాడు. రాముడు. భార్యను తోకతోచుట్టి వాలి రావణుణ్ణి ముంచినట్టు సప్త సముద్రాల్లో ముంచుకు రావచ్చుని. కాని, యేంలాభం? తోక లేకపోవడంవల్ల వున్నపళ్ళనే యికిలించి "నన్ను కోతంటావా?" అన్నాడు.

పెళ్ళాం రెండుచేతులూ వాడిముఖానికి తీసుకెళ్ళి— "అంటాను! లక్ష సార్లంటాను. ఏన్నేమిటి? మీ మొగాళ్ళందర్నీ! ఎదుగుతు పిల్లల్ని పెట్టుకుని నలభైయ్యోయేట పెళ్లి చేసుకోటానికి మీకు సిగ్గు వెయ్యటంలా?—మీరంతా హిరేన్ లే!" అన్నది.

పామునెత్తిన తెల్ల ఈశ్వరి పెట్టినట్టయింది. పాము పడగతోసహా చుట్ట చుట్టుకుంది. రాముడు మళ్లీ వాడి పేటెంటు నవ్వు హీహీతో అన్నాడు— "నువ్వనేది నిజమే! హి. హి. హి! కాని అంతా హిరేన్—"

"అంతా! మీ మొగాళ్ళంతా హిరేన్ ముఖర్జీలే."

రాముడిక వాదించలేక హిరేన్ ముఖర్జీని "తొత్తుకొడు" అని తిట్టాడు.

• •

కృష్ణుడి ఇంట్లో కూడా ఇదే గోల.

కృష్ణుడు యం. ఏ. యం. ఏ. అంటే అతని పరిచయం పూర్తికాదు-మోడరన్ అని కూడా అనాలి అతని భార్య అల్ట్రా

మోడరన్! బాబ్ కాదు గాని మిగతా హంగు లన్నీ ఉన్నాయి.

"రాముడు సీత దుఃఖంతో మంచ మెక్కాడనేది శుద్ధ అబద్ధం—వాల్మీకి బుర్రలో పుట్టిన కల్పన? నిజానికి అతని కింకో పెళ్ళి కాలేదనే దిగులుతో మంచ మెక్కాడు" అన్నది కృష్ణుని భార్య మూతి వంకరగా పెట్టి.

అప్పుడు కృష్ణుడు ఫ్రయిడ్ సైకాలజీ చదువుతున్నాడు "వాల్మీకిని నువ్వెరగవు!" అని మందహాసం చేసి—"కాని, నువ్వెవర్ని ఉద్దేశించి ఈ మాటలన్నావో నాకు తెలుసు హీరేన్ ముఖర్జీని—దట్ ఐ య్యామ్ షూర్" అన్నాడు.

"ఇంతవరకు మగవాళ్లు తమ పశుత్వాన్ని విద్యతోనూ, తెలివితేటలతోనూ కప్పిపెడుతూ వచ్చారు. ఈ సంగతి నాకు బాగా తెలుసు. హీరేన్‌లో ఉన్న పురుష ప్రకృతే రాముడిలోనూ ఉంది—ఒప్పుకుంటారా?"

"తప్పక! కాని హీరేన్ పెళ్ళి చేసుకున్నందువల్ల నీకు కోపం యెందుకు రావాలి? దీనికి ఫ్రయిడ్ తత్వం అప్లయి చేసి చూస్తే—"

"ఏమిటీ?" అన్నది కృష్ణుని భార్య. నూరు వోల్టుల బల్బుకు స్విచ్ ఆన్ చేసినట్టు! తర్వాత—"వాడు బ్రూట్" అన్నది ఫ్యూజ్ అయిపోయినట్టు. ఇక అక్కడ వుండలేదామె. గది అంతా అంధకారం పాలుజేసి కోపగృహంలో పోయి దూరింది—మోడరన్ దైనప్పటికీ.

కృష్ణుడు మళ్ళీ చదువులో మగ్నం కావాలనుకున్నాడు. కాని లాభంలేక పోయింది. కాసేపు లేచి పచారు చేశాడు. ఐనా అతనికి యెక్కడినించో కోపం ముంచుకొచ్చింది—హీరేన్‌ను 'బీస్టు' అని తిట్టాడు

ఊళ్ళో యిలా జరుగుతున్నదని హీరేనుకు తెలుస్తూనే వుంది. ఐనా అతను సిగ్గుపడలేదు వాళ్ళకి లొంగిపోలేదు. ఇంకా రకరకాల బజారిని పడి తిట్టటం సాగించాడు—"నాకు ఎవళ్ళేమనుకున్నా లెఖ్ఖలేదు! ఇదివరకు పెళ్ళాం చచ్చిపోతే చేసుకున్నాను ఈ దఫా వుండగానే చేసుకుంటాను. మళ్ళీ మాట్లాడితే ఒకదాన్ని కాదు పదిమందిని—ఎవరడ్డమొస్తారో చూస్తాను ..."

హీరేన్ ధైర్యంచూసి ఆశ్చర్యపోవటమే కాదు—చాటుగా మెచ్చుకుని గౌరవించారు కూడా. కాని బయటికి మాత్రం తిట్టుతూనే ఉన్నారు.

* * *

హీరేన్ యిలా పెచ్చు మీరాడనీ తెలిసి ఆడవాళ్ళంతా చెలరేగారు. మగవాళ్ళ జీవితం ఆడవాళ్ళ వాక్య బాణాలతో తూట్లుపడి పోయింది. ఈ ఆపదలో అంతా భగవద్భక్తులయ్యారు. కొంతమంది తాయత్తులు కూడా కట్టుకున్నారు.

ఎలాగయితేనేం భగవంతుడు వీళ్ళని కనికరించాడు, తాత్కాలికంగా! అంచే

గంగూలీగారి అబ్బాయి నరేన్‌ను యీ దుష్కార్యం చేయమని ఆయనే ప్రోత్స హించి వుండాలి లేకపోతే ఇలా జరగు తుందా?

నరేన్ యం. ఏ పాసయాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. రెండు సంవత్స రాలే అయింది వివాహమై. భార్యకి జబ్బు చేస్తే వుద్యోగానికి సెలవుపెట్టి కలకత్తా తీసుకుపోయాడు. అక్కడి డాక్టర్లు ఆమెకి క్షయ అని తేల్చారు. పాపం అతను రాత్రింబగళ్ళు నిద్రాహారాలుమాని భార్యకి సేవచేస్తున్నాడు. ఈ వార్త అతని తల్లి తండ్రులకి తెలిసి కలకత్తాపోయి రెండు రోజులుండి తిరిగి వచ్చారు. కాని వాళ్ళ ధోరణి చూస్తే మాత్రం ఎవ్వరికీ పలక రించటానికి ధైర్యం చాల లేదు—తల్లి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. తండ్రి విచా రంగానూ, గంభీరంగానూ ఉన్నాడు. కృష్ణుడు ఎందుకు పోయాడో స్టేషనులో చూశాడు వాళ్ళని. అతనేకాదు, అక్కడికి వచ్చినవాళ్ళంతా చూశారు. వాళ్ళకి వచ్చిన కష్టాలికి నిట్టూర్చారు కూడా.

కృష్ణుడు యింటికి వచ్చి భార్యతో— "పాపం! నరేన్ భార్య పోయింది" అన్నాడు నిట్టూర్చి.

"ఎవరూ?" అన్నది భార్య చకితురాలై.

"నరేన్ భార్య. వెరీ శాడ్!"

కృష్ణుడి భార్య స్తబ్ధురాలై అదో చిత్రంగా భర్తవంక చూసింది ఆ చూపుకు అతను అనుమానపడి ఆమె యుద్ధం ప్రక టించకముందే వీపు చూపాలని చూశాడు.

"ఎక్కడికి? మీ భార్య యింకా చావ లేదుగా. ఇప్పటినించే పల్లకీవాళ్ళని మాట్లాడుకోటానికి!"

"ఏమిటా వాగుడు? నీకేది మాట్లా డాలో కూడా తెలియదు" అన్నాడు కృష్ణుడు కోపంతో కూడిన విసుగుతో.

"నేను యదార్థమే మాట్లాడాను" అన్నది భార్య నవ్వుతూ.

"ఐతే, ఏమిటో కానివ్వు!" అని కూర్చున్నాడు కృష్ణుడు.

"ఒక పని చేయాలి మీరు. మన శేఫాలిని నరేన్ చేసుకునేటట్టు చూడండి. డబ్బుదగ్గర మానాన్న ఏమీ వెనకాడడు."

కృష్ణుడి ముఖాన ఒకరకమైన నవ్వు కనపడింది. నరేనూ హీరేనూ అన్న దమ్ములుకారా?" అన్నాడు.

"నాకు తెలియదావరసలు. నరేన్ మాత్రం మీకు కాబోయే షడ్రకుడు!" అన్నది కృష్ణుడి భార్య.

* *

సాయంత్రం షికారుకు పోయిరాగానే కృష్ణుడి భార్య—"నరేన్ వాళ్ళ ఇంటికి పోయి వచ్చావా?" అని అడిగింది భర్తని.

"ఆఁ" అన్నాడు కృష్ణుడు ఎద్దేవగా నవ్వుతూ.

ప్రశ్నార్థక దృష్టితో యిల్లాలు అతని వంక చూస్తూ వుండిపోయింది. నోటితో ఏమీ అడగలేదు.

కృష్ణుడు భార్యవంక చూస్తూ అలాగే

నవ్వి—"నరేనుకూ హీరేనుకూ ఏవిధమైన పోత్తూలేదు ఈ విషయంలో!" అన్నాడు.

"అంటే?" అన్నది భార్య నొసలు కుందించి తీవ్రంగా చూస్తో.

అంటే, నరేన్ భార్య ఇంకా చావలేదు. వాడు జబ్బుగా ఉన్న భార్య తలాపున సావిత్రిలాగా కూర్చున్నాడట. తల్లి దండ్రులు బ్రతిమాలినా వినలేదట. ఉద్యోగానికి ఆరునెల్లు సెలవు పెట్టాడట; అవసరమైతే వదలిపెడతాడట కూడా.

భార్య కాసేపు కృష్ణుడి ముఖంవంక చూసి "మీ జాతే ఇలాంటిది, తెలుసునా? పెళ్ళాంకోసం మీరు తల్లితండ్రుల్ని కూడా వొదులుకుంటారు!" అంది

అనేకవిద్యలో ప్రవీణుడూ, బుద్ధిమంతుడూ అయిన కృష్ణుడు భార్య మొహంకేసి చూస్తూ వుండిపోయాడు.

ఇటు రాముడి స్థితి కూడా యింతకంటే అధ్వాన్నంగావుంది. వాడు దర్జాగా ఒక బీడీ పారవేసి ఇంకో బీడీ ముట్టిస్తూ—"విన్నావా?" అన్నాడు భార్యతో.

భార్య వీడివంక చూస్తో—"ఎక్కడన్నా వారసత్వంలో డబ్బు వచ్చిందేమిటి?" అన్నది.

రాముడు తనివిదీరా నవ్వి తలతిప్పుతూ—"నువ్వు హీరేన్ పేరుయెత్తి యింత మండిపోయావు గదా—" అన్నాడు.

భార్య మధ్యనే అడ్డి—"రెండు పిల్పులు కూడా పీల్చలేదు. బీడీయెందుకు పారవేశావూ?" అన్నది.

రాముడు పారేసిన బీడీ తీసి గూట్లో పెట్టుతూ—"వెధవ బీడీకి కూడా నువ్వు మునమున లాడుతున్నావే!" అన్నాడు.

"కాక? నీకు రోజుకు కానీ యెక్కడినించి వస్తుంది బీడీలకి? దమ్మిడీ సంపాదించలేవుగాని నవాబుదర్జా పోతావు!"

రాముడికి కోపం వచ్చింది. ఐనా దిగమింగి—"క్షమించండి మహారాణీగారూ? దాసుడు తప్పు చేశాడు" అన్నాడు.

భార్య ఏమీ మాట్లాడలేదు. గంభీరంగా ఆకులు చిలకలు చుట్టుకోసాగింది—నోట్లో ఇంత వక్కచూర వేసుకుని.

రాముడు కాసేపు వుండి అన్నాడు:—"నరేన్ సంగతి విన్నావా? నువ్వెప్పుడూ హీరేన్‌ను తెచ్చి మమ్మల్ని యెత్తి పొడుస్తావు గాని—"

"పోయి, నీళ్లలేసి బావిలో పడమను. ఆడంగుల పద్దన్యాని! వాడి సంగతి నా దగ్గర తేవటానికి నీకు సిగ్గన్నా వేయటం లేదా? ఒక్కగాని ఒక్కకొడుకు—కాటికి కాళ్లు చాచిన అబ్బా అమ్మని వొదిలిపెట్టటమా? ఉరిపెట్టుకోమనుపోయి! నా కొడుకైనట్లయితే చెవుపట్టుకు లాక్కొచ్చి పెళ్ళి చేసేవాన్ని. పిల్లాలేరు—జల్లాలేరు, యీ యీడున.... హుం!"

రాముడు మంచంమీద పండుకుని, భార్యకు కనపడకుండా బీడీ అవతల పారేసి యిద్దల రామదాసు తత్వం ఒకటి యెత్తుకున్నాడు.




"ఎప్పుడా పాడు పాటలేనా? ఒక సినిమా పాటపాడు!" అన్నది భార్య.

రాముడిగొంతూ మంచిదే, చక్కగా పాడతాడు కూడా. కాని భార్య రంకెతో తత్వం ఆగిపోయింది—సినిమా పాట మట్టుకు గుర్తుకురాలా.

* *

ఒక్క రాముడూ కృష్ణుడేకాదు. యదు, మధు, హరీ—అందరి యిళ్ళల్లోనూ నరేన్ ప్రసంగమే. హీరేన్ పాతబడిపోయాడు. అతనిప్పుడు హాయిగా సంతకుపోయి సరుకులు తెచ్చుకుంటు న్నాడు; కచేరీవాకిట్లో చీట్లాడు తున్నాడు, నలుగురితోకలిసి అతనూ నరేన్ని విమ ర్శిస్తున్నాడు. నరేన్‌దే తప్పని, నలుగురితోపాటు అతని అభిప్రాయం కూడా.

నరేన్‌ది తప్పుకాదు. అహంకారమని ఆడవాళ్ళ అభిప్రాయం.

నరేన్ తండ్రి కొడుక్కు వుత్తరం వ్రాశాడు:—"ఊరంతా కూడా నీ ప్రవర్తనను ఆక్షేపిస్తున్నారు, నిందిస్తున్నారు. వాళ్ళ సంగతి వొదిలినా, నువ్వు చదువుకున్నవాడివి. నీ ప్రవర్తనను సైన్సుగానీ, శాస్త్రాలుగానీ సమర్థిస్తున్నాయా? నీది మిథ్యా వ్యామోహం. ఆ వ్యామోహంలోపడి నిన్ను నువ్వు నాశనం చేసుకోమాకు."

నరేన్ జవాబురాశాడు: — "ఊళ్లో వాళ్ళ దూషణ భూషణల్తో నాకు వచ్చేదీ పోయేదీఏమీలేదు సైన్సునీ, శాస్త్రాల్నీ వేటినీ నే నొప్పుకోను. వీటన్నిటికంటే వున్నతమైంది ప్రేమ: నేను దాన్నే వొప్పుకుంటాను"

శాస్త్రాల్ని వొప్పుకోనన్నా ఫరవా లేదు గాని సైన్సుని వొప్పుకోననటం మాత్రం అహంభావమే, కొద్దిమాసాలకే నరేన్‌భార్య చనిపోయింది.

మళ్లీ తల్లిదండ్రులు యింకోమాటు

కలకత్తా పరుగెత్తారు. కాని పూర్వం లాగానే మళ్ళీ తిరిగి వచ్చారు. తండ్రి ముఖం గంభీరంగా వుంది. తల్లి కంట నీరు. నరేన్ రాలేదు. అతను కాశీ వెళ్ళాడట. అక్కడ భార్య శ్రాద్ధంపెట్టి, దేశం తిరిగి వస్తాడట.

మళ్ళీ ప్రతి యింట్లోనూ యీ విషయమైయే విమర్శన ప్రారంభమైంది

"వాడిమొహాన మొద్దులు పెట్టాలి! ముసలి అబ్బా అమ్మనీ వొదిలి పెళ్ళాం శోకంతో సన్యాసి అయినాడి మొహాన మొద్దులు పెట్టాలి!'' అన్నది రాముడి భార్య

రాముడికి అప్పుడు బీడీలకు చాలా అవసరంగా వుంది—"తప్పకుండా! ముమ్మాటికి!'' అని వాడు భార్యని సమర్థించాడు.

రాముడి పెళ్ళానికి కోపంవచ్చింది:—ముమ్మాటికి కాదు. ముప్పైమాట్లకి! మళ్ళీ మాట్లాడితే మూడువందల మాట్లకి!" అన్నది.

''నేనుకూడా అదేగా అన్నది. నీకు కోప మెందుకూ?''

"ఎందుకా? మిమ్మల్ని చూస్తే వొళ్ళు మండి! మీరు మనుషులేనా? గొడ్లు!"

పొద్దుటినించి బీడీ కాల్చక పోవడం చేత రాముడికి అసలే చిర్రయెత్తి వుంది. ఆపైన తిట్లు అంతకంతకూ యెక్కువ కావటంచూచి వాడు బీడీలమీద ఆశ వదిలిపెట్టి, నడుంబిగించి లేచి నుంచున్నాడు--"ఏమన్నావు? మేము గొడ్లమా?" అంటూ.

"వందసార్లు? వెయ్యిసార్లు!! లక్ష సార్లు!!!"

''లక్షసార్లా?"

''ఆఁ! మళ్ళీ మాట్లాడితే కోటి సార్లు.''

"ఐతే చూసుకో!'' అని, పొయిగడ్డ రాయితీసి వుడుకుతున్న కూటికుండ మీద వేసి గబ గబ బయటికి వెళ్ళిపోయాడు రాముడు.

కాసేపు రాముడిభార్య యేమీ మాట్లాడ లేక పోయింది. నోరు తెరుచుకు చూసింది. ఆ తర్వాత బిగ్గరగా కేకలు పెట్టి యేడుస్తూ—''అమ్మోయ్! నన్ను తాగుబోతాడికిచ్చి నాగొంతు కోశావే!" అని శోకం పట్టసాగింది.

ఆ తర్వాత కాసేపటికి ఆపి తనతండ్రి వోలికి లోభించి తన్ను యితనికిచ్చినందుకు తండ్రిని తిట్టసాగింది.

రాముడికులంలో ఆడదానికి వోలి యివ్వటం ఆచారం.

రాముడు సరాసరి యింటినించి హీరేన్ యింటివేపుకు వచ్చాడు. అక్కడ రోడ్డుమీద దాదాపు వీడి స్నేహితులందరూ కూడివున్నారు. యదుతోసహా. రాముడు వాళ్ళలో కలిశాడు. అందులో ఒకడు బీడీతీసి రాముడికిస్తూ—''కూర్చో: వెలిగించు—!'' అన్నాడు.

"ఏమిటి కథా? యిక్కడే చేరారూ?" అన్నాడు రాముడు.

''నీకు తెలియదూ? ఇవ్వాళ హీరేన్



యువ




యింట్లో ధప్పళంవుంది. అతని పెళ్ళానికి సీమంతం. ఇవ్వాళ నువ్వు మంచి టప్పాలు పాడాలి, లేకపోతే ముందు ఆడవాళ్ళే వదిలిపెట్టరు'' అన్నాడు ఒకడు.

"ఆడవాళ్లుంటారా? అట్లయితే నేను రాను. వాళ్ళు దూరానవుంటే ఫర్వాలేదు గాని పంక్తిలో వుంటే మాత్రం నేనొప్పుకోను'' అన్నాడు యదు.

"నేనూ అంతే'' అన్నాడు రాముడు.

* *

రెండు మాసాలు గడిచినై.

ఒకనాటి అర్ధరాత్రిపూట. కృష్ణుడు ఇంకా నిద్రపోలేదు పుస్తకం చదువుతున్నాడు. అతని ఆధునిక పత్ని, వాదన పేరుతో పెద్ద కలహం సాగించి యిప్పుడే నిద్రపోయింది. వాదనకు విషయం 'మొత్తం పురుషజాతి సిగ్గులేనితనం' హీరేన్‌ను పురస్కరించుకుని ప్రపంచంలో యెంతో సిగ్గు విడిచిన వాడుతప్పితే ఈ ముసలితనంలో తరుణీ భార్యను ఈ మాదిరిగా తలకెక్కించుకోడనీ, కాన్పుకు యింత హడావుడి చెయ్యడనీ కృష్ణుడి భార్యవాదన. 'నేను కలుసుకోలేదుగాని, హీరేన్ భార్య పాపం సిగ్గుతో తనముఖం యెవ్వరికీ చూపించలేకుండా వున్నదని నానమ్మకం' అని తేల్చింది ఆమె చివరికి.

కృష్ణుడు జవాబుగా నరేన్ సంగతి తెచ్చాడు. ఫలితం అతని భార్య కళ్ళల్లోనూ, ముఖంలోనూ హిస్టీరియాలక్షణాలు కనిపించాయి. కృష్ణుడు యిక ఆ ప్రసంగం అంతట కట్టిపెట్టి పుస్తకం చేత పట్టి కూర్చున్నాడు.

హఠాత్తుగా అతనికి యెక్కడినించో గుండెలు చీల్చుకుని వస్తున్నటువంటి

ఏడుపు అతని చెవినిపడింది. అతను చకితుడై లేచి వరండాలోకి వచ్చి చెవులు రిక్కించి వినసాగాడు కాని మళ్ళీ అతనికేమీ వినపడలేదు.

ఒకఘంట గడిచినతర్వాత రాముడు వచ్చి—"కృష్ణా! కృష్ణా! అని పిలిచాడు.

"ఏమిటోయ్!" అంటూ చకితుడై, కృష్ణుడు కిటికీ తెరిచాడు.

"ఒకమాటు యిట్లా బయటికిరా! హీరేన్ భార్య పోయింది!"

"పోయిందా?"

"ఆఁ. ప్రసవించలేకచచ్చిపోయింది"

* *

శ్మశానంనించి తిరిగి వచ్చినతర్వాత రాముడు పెద్ద నిట్టూర్పు ఒకటి విడిచి— "హీరేన్ పాపం చాలా దురదృష్టవంతుడు" అన్నాడు.

"దురదృష్టవంతుడా? మహా అదృష్టవంతుడు. మళ్ళీ యెగిరి గంతేసి పల్లకీ యెక్కుతాడు" అన్నది అతని భార్య

రాముడు మెదలకుండా వూరుకున్నాడు. హీరేన్ తరఫున మాట్లాడటానికి అతనికి ధైర్యం లేకపోయింది అసలు మాట్లాడేది కూడా యేముంది?

"ఒక్క సహాయం చెయ్యి నాకు. మా పినతల్లి కుటుంబం అసలే చితికిపోయింది ఆపైన పద్ధెనిమిదేళ్ళ కూతురు ఒకటుంది వాళ్లనెత్తిని. ఎట్లాగన్నా హీరేన్ను వొప్పించి దానికి ముడిపడేటట్టు చూడు!" అన్నది రాముడి భార్య.

రాముడికి చాలా సిగ్గేసింది; కాని ఎదురుమాట చెప్పలేకపోయాడ. కాని వెంటనే పోయి హీరేన్ను అడగలేకపోయాడు. వాయిదాలువేస్తూ శ్రాద్ధమైన మర్నాటిదాకా జరుపుకు వచ్చాడు శాంతికూడా అయిన తర్వాత రాముడు హీరేన్ ఇంటికిపోయాడు పెళ్ళిసంగతి కదలిద్దామని

హీరేన్ ఇంటిముందు పెద్దగుంపు కూడారు జనం ఆ మధ్యను హీరేన్ మొదటి సంబంధపు మామ రెండుచేతులూ ఆడిస్తూ జనాన్ని వుద్దేశించి అంటున్నాడు: —"చూడండి. యీ ముసలితనంలో నాకెటువంటి శాస్తి చేశాడో. ఇంతమంది పిల్లల్నీ యీ ఆస్తినీ చూడటానికి నాలో ఓపిక వుందా అసలు నాకు తీరికవుందా?"

హీరేన్ రాత్రే యెక్కడికో వెళ్లిపోయాడు "సంసారంమీద అతనికి విరక్తి కలిగిందట పిల్లలభారం, ఆస్తిభారం నీమీదే వదిలాను" అని మామకు మాత్రం ఒక వుత్తరం రాసిపెట్టాడు.

రాముడు బ్రతికాను బాబూ అనుకుని యింటికి తిరిగివచ్చాడు

"విరక్తా?" అన్నది వాడి భార్య.

"ఆఁ" అన్నాడు రాముడు.

"వాడి విరక్తి మొహాన నిప్పులు పెట్టా! గంపెడు పిల్లలు. ఇంతమందినీ వదిలి వైరాగ్యమా!" ఆ తర్వాత రెండు చేతులూ రాముడి ముఖానికి తీసుకువచ్చి- "అసలు మీ జాతేయింత!" అన్నది

* * *




"వైరాగ్యమూ, ప్రేమా—ఇలాంటి మాటలు నేనేవీ వొప్పుకోను హీరేన్ మళ్ళీ పెళ్లికి పిల్ల యెవ్వతే దొరకదనే, నమ్మకంతోటే యీపూరు వదిలిపెట్టి వుంటాడు" అన్నది కృష్ణుడిభార్య.

కృష్ణుడు జవాబు చెప్పలేకపోయాడు.

"విడోమారేజ్ చేసుకుంటే పోయేదిగా, ఈ రోజుల్లో అక్కడక్కడా జరుగుతూనే వుంది, ఒక ఆదర్శంకూడా పెట్టినవాడయ్యేవాడు" అని మందహాసం చేసి-"నేను చచ్చిపోయిన తర్వాత నువ్వు తప్పక వివాహం చేసుకుంటావు: అప్పుడు విధవావివాహమే చేసుకో" అన్నది.

భార్యగూబ పదిరేటట్టు లాగి చెంప దెబ్బ వెయ్యాలనిపించింది, కృష్ణుడికి. అతనిలో ఆదిమ మానవుడు తొంగి చూశాడు.

* * *

ఊళ్ళో గోల మరీ యెక్కువైంది.

ఈగోలను అణిచివేస్తూ వూళ్లో ఒక వైపునించి నౌబత్ఖానా వినిపించింది.

ఈ నౌబత్ఖానా నరేన్ ఇంటిముందే. పెళ్ళిచేసుకుని, ఈ పన్నెండు గంటల బండిలో వస్తున్నాడట. ఇప్పుడే టెలిగ్రాం వచ్చింది.

కృష్ణుడి భార్య ఓరగా చూస్తూ ముసి ముసి నవ్వు నవ్వటం సాగించి ది.

రాముడు పెళ్ళాం యింటి ముంగిట్లో నిలబడి తాండవనృత్యం చేయసాగింది

"తను సన్యాసి చటం మంచిదా, కాదా?" అని కృష్ణుడు ఆలోచన్లో పడ్డాడు.

రాముడి ఆత్మ పితృద్రోహం చేస్తూ వున్నది వాడు "ఇంకో పెళ్లి చేసుకుందామా వద్దా?" అని అనుకుటున్నాడు

# తిరుపతి-శ్రీశైలం




"త్రిరుపతి—శ్రీశైలం" అని ముందు వెనుకల ప్రక్క భాగంలో, ఆరెండూ క్షేత్రాల మధ్యవచ్చే కొన్ని ముఖ్య పట్టణాలు (కాళహస్తి, నాయుడుపేట, గూడూరు, నెల్లూరు, కావలి, ఒంగోలు, పొదిలి, మార్కాపూర్, దోర్నాల) వ్రాసివున్నాయి నిగనిగలాడే బ్లూ కలర్ పెయింట్, మధ్యలో తెల్లబార్డర్, వెనుక భాగాన "టి. టి డి ఎక్స్‌ప్రెస్" అని ఇంగ్లీషులో వ్రాసివుంది. కిటికీలకు శాలింగ్ గ్లాస్. గజేంద్రుడులా నిలబడి వుంది టి. టి డి బస్‌షెడ్‌లో లైలాండ్ బస్సు. నాలుగువైపులా చక్రాలక్రింద నిమ్మకాయలు పెట్టబడివున్నాయి. మూడు నిమ్మకాయలు ముందుభాగాన, రేడియేటర్ టాంక్ మూతికి కట్టారు. షట్టూబాడీకి పసుపు, కుంకుమలు అలంకరించారు. సాంబ్రాణీవుద్దీల వాసన బస్సంతా నిండిపోయింది

ఒక పెద్ద గుమ్మడికాయకు కుంకుమ పూసి, మూడుసార్లు బస్సును ప్రదక్షిణం చేసి, ముందుకొచ్చి నేలకేసి కొట్టాడు విశ్వనాధం

కాకీచొక్కా, ప్యాంట్ వేసుకున్నాడు. మామూలు చెప్పులు, నుదుటిన కుంకుమ బొట్టు పెట్టుకున్నాడు. యువకుడు, ఉత్సాహవంతుడైన విశ్వనాథం, డోర్ తెరిచి, డ్రైవర్ సీట్లో కూర్చున్నాడు. దేవస్థానమ్స్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, డిపో మేనేజర్ వచ్చి బస్సులో కూర్చున్నాడు.

"రైట్ : కదులు" అన్నాడు హుందాగా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్. విశ్వనాధం బస్ స్టార్ట్ చేశాడు. ఎదురుగా బస్సులో కనిపిస్తున్న వెంకటేశ్వరస్వామి పటానికి నమస్కరించి, ఎడమచేత్తో గేరు మార్చి, కుడిచేత్తో స్టీరింగ్ సవరించుకుంటూ, ఎక్సలేటర్ మీద కాలువేసి నొక్కాడు మెల్లగా. అందమైన ఆ బస్సు, బయలుదేరింది. వచ్చి బస్టాండ్ లో ఆగింది.

అప్పుడే డ్యూటీ కొచ్చిన కండెక్టర్ రంగయ్య బస్సులో వున్న అధికారులకు నమస్కరించాడు. అధికారు లిద్దరూ బస్సు దిగారు. విశ్వనాధం గూడా బస్సు దిగివచ్చి వాళ్ళముందు నిలుచున్నాడు.

"మీకు శ్రీశైలం రూటు సరిగా తెలుసుకదా. మొదటిరోజు జాగ్రత్తగా వెళ్ళండి" ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అన్నాడు.

అలాగే అన్నట్లు తలలూపారిద్దరూ.

సమయం పేకువజామున నాలుగు గంటలు కావస్తున్నది

"కొత్తబండి జాగ్రత్త" అన్నాడు మేనేజర్.

తరువాత ఇద్దరూ వెళ్ళిపోయారు"

"ఈరోజునుండి శ్రీశైలం వరకూ దేవస్థానం వాళ్ల బస్సును నడుపుతున్నారు. ఉదయం నాలుగు గంటలకు శ్రీశైలం చేరుతోంది. ప్రయాణీకులు ఈ సౌకర్యాన్ని సద్వినియోగం చేసుకొనమని ప్రార్థన. బస్సు కొద్దిసేపటిలో బయలుదేరబోవుచున్నది" అన్నది మైకులో.

సరిగ్గా నాలుగుగంటలకు విశ్వనాథం బస్సు స్టార్ట్ చేశాడు. కొత్త ఇంజను గనుక, రొద విన సొంపుగా వుంది. బస్సు తారురోడ్డుమీద వేగాన్ని పుంజుకుంటూ పరుగెడుతూంది శక్తివంతమైన హెడ్ లైట్స్ కాంతిలో విశాలంగా కనిపిస్తున్న రోడ్డుమీద, బస్సును మంచినీళ్ళ ప్రాయంగా నడుపుకెళ్లుతున్నాడు.

ఆరు సంవత్సరాలనాడు అలా ప్రారంభమైంది. శ్రీశైలం బస్సు దిన చర్య. ఉదయం నాలుగు గంటలకు తిరుపతిలో బయలుదేరి సాయంత్రం అయిదుగంటలకు శ్రీశైలం చేరడం. అక్కడ మరురోజు ఉదయం నాలుగు గంటలకు బయలుదేరి సాయంత్రానికి తిరుపతిచేరడం దాని విధి.

బస్సులోని గంట టంగ్ మని మ్రోగింది. అసంకల్పితంగా కుడికాలు ఎక్సలేటర్ మీద నుండి వెళ్లి బ్రేక్ మీద పడింది బస్సు సున్నితంగా ఆగింది. విశ్వనాధం ఆలోచనలకూ బ్రేక్ పడింది.

"కావలిస్టేషన్ మర్చిపోయావా?" వెనుకనుండి కండెక్టర్ అరిచాడు.




ఏదో పొరపాటు చేశానన్న భావం వ్యక్తపరుస్తూ వెనుదిరిగి, మెల్లిగా నవ్వాడు విశ్వనాథం.

కావలి సెంటర్‌లో ఆగవలసిన బస్సు ఒక ఫర్లాంగు ఇవతల కొచ్చి ఆగింది.

బస్సు మళ్ళీ బయలుదేరింది నెల్లూరు ప్రాంతాల కొచ్చేసరికి ఇంజన్ నుండి వింత ధ్వని వినిపించసాగింది. బస్సు వేగం కూడా తగ్గిపోయింది. శక్తిహీను డిలా అరమైలుదూరం హోరున రొదతో, అవిచ్ఛిన్నంగా నడిచింది నెల్లూరులో ఒక వర్కుషాపు ముందు నిలిపాడు బస్సు

పెట్రోలు సప్లైచేసే వైపులో మడ్డి చేరి పెట్రోలు సరఫరాకు ఆటంకం కల్గించింది

మెకానిక్స్‌తో వివరాలు చెప్పి, వాళ్ళకు పని పురమాయించాడు విశ్వనాథం.

ప్యాసింజర్లు కూడా రిలీఫ్‌కోసం కిందకు దిగుతున్నారు విశ్వనాథం వెళ్ళి, ఎదురుగ్గా కనిపిస్తున్న కిళ్ళీకొట్టులో సిగరెట్ కొని, ముట్టించాడు.

సిగరెట్ త్రాగుతూ బస్సు కేసి చూచాడు విశ్వనాథం దాన్ని చూస్తే అతనికే బాధేసింది. బస్సు రంగు చాలా వరకూ మాసిపోయింది ఇటీవల బ్రేక్ ఇన్‌స్పెక్షన్ సందర్భంలో రంగు వేశారు గాని, దానికి సహజత్వం కనిపించడం లేదు. ఎక్కడో కొమ్మలు రాచుకొని ప్రక్క భాగం చొట్టలు పడివుంది పైభాగాన చెక్కలుగూడా అక్కడక్కడ విరిగి వున్నాయి. ఆ బస్సు కొత్తగా వున్న

ప్పుడు. అది అతనికి ప్రాణప్రదమైనది. స్టాపింగ్‌లలో బస్సు ఆపినప్పుడు, కాఫీ త్రాగివచ్చి, సిగరెట్ వెలిగించి, కాస్త దూరంగా నిల్చుని బస్సుకేసి ముచ్చటగా చూస్తూ నిల్చోవడం విశ్వనాథానికి సరదా. ఎందుకో అతనికా బస్సంటే అంతిష్టం

ఎప్పుడూ బస్సును నీటుగా వుంచుతాడు చిన్నరిపేరు వచ్చినా వెంటనే బాగు చేయించేస్తూంటాడు అయినా బస్సుకాంతి మాసిపోయింది.

ఆరుసంవత్సరాలుగా, రోజుకు మూడు వందల మైళ్లు పరుగెత్తే బస్సు అలా మాసిపోక ఏమౌతుంది?

"ఎండకు ఎండి, వానకు నానీ అది అలా పోయింది గాని అలాగే షెడ్‌లో వుంచి వుంటే??"

తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది. అప్పుడు ఆ బస్సు ప్రయోజనమేముంది. యంత్రంలోని ఎక్కడి భాగాలక్కడ తుప్పు పట్టిపోయి వుండేవి."

ఏదైనా అంతేనేమో?

బస్సు రిపేరు పూర్తయింది. బస్సు మళ్ళీ బయలుదేరింది.

* * *

ఒకవేమని బాబూ ఏడుస్తూంటే ఏదో పుస్తకం తిరగేస్తున్న విశ్వనాథం పుస్తకం ప్రక్కనపెట్టి, బాబు వున్న ఊయల వద్దకొచ్చి సమాధానపరుస్తూ ఊయల ఊపసాగాడు విశ్వనాథం. ఆ రోజతనికి డ్యూటీ లేదు.

మూడేళ్ళ పాప ఊయల ప్రక్కన కూర్చుని బతాణీలు నములుతూంది.

ఇంతలో బావివద్ద కెళ్ళిన కమల నీళ్ళబిందె చంకనేసుకొని వచ్చింది.

ఆమెకేసి పరిశీలనగా చూచి ఒక చిరునవ్వు చిందించాడు విశ్వనాథం.

కమల బాగా సన్నపడింది. కళ్ళలో మునుపటి కళలేదు. అంగసౌష్ఠవంలో గూడా మునుపటి మెరుగులు లేవు. తల వెంట్రుకలు గూడా చాలావరకూ రాలిపోయాయి.

నీళ్ళబిందె ఒలికి చీరంతా తడిసి పోయింది. కమల నడుస్తూంటే అలసట పడుతున్నట్లు కనిపించింది

"ఎందుకలా చూచి నవ్వుతున్నారు?" తదేకంగా తనకేసి చూస్తున్న భర్తను నవ్వుతూ అడిగింది కమల, ఒక్కక్షణం ఆగి.

"ఏంలేదు." అన్నాడు ముక్తసరిగా విశ్వనాథం

ఆ సమాధానానికి సరిపెట్టుకొని వంటింటివైపు సాగిపోయింది కమల.

విశ్వనాథం ఊయల ఊపుతో ఆలోచనలలోకి జారిపోతు.

ఆరోజు బస్సు నెల్లూరుస్టేషన్ వదిలింది. ముందుసీట్‌లో కూర్చున్న ఒక యాభై సంవత్సరాల వ్యక్తి తదేకంగా తనవైపే చూస్తూండడం గమనించాడు విశ్వనాథం. బస్సు అరవై మైళ్ళ వేగంతో పరుగెడుతోంది.

కాసేపు అతన్ని గమనించిన విశ్వ



యువ




నాధం వుండబట్టలేక అడిగాడు

''మీరేవూ రెళ్ళాలి?''

"మార్కాపురమండి.'' ఆ వ్యక్తి అప్యాయంగా సమాధాన మిచ్చాడు. విశ్వ నాధం పల్కరింపు అతనికి సంతోషాన్ని కల్గించినట్లుంది.

రెండు నిమిషాలు ఆగినాక అడిగాడు ఆ వ్యక్తి. ''మీదేవూరుబాబూ?''

"మాది నెల్లూరండి. అయితే ప్రస్తుతం తిరుపతిలో వుంటున్నాము" విశ్వనాధం జవాబిచ్చాడు.

తరువాత వాళ్ళమధ్య ఏలాంటి సంభాషణా జరగలేదు. విశ్వనాధం ఆగవలసిన చోట ఆగుతూ, తన విధి నిర్వహణ అన్నట్లు బస్సును పరుగెత్తిస్తున్నాడు.

బస్సు పొదిలి చేరింది.

''ఇక్కడ ఒక అరగంట అగుతాము. భోజనం చేసేటైతే చేసిరండి. విశ్వనాధం బస్సులోంచి దిగుతూ చెప్పా డా వ్యక్తికి.

"అక్కరలేదు లెండి. ఇంకొక గంటలో మావూరు చేరుతాముకదా?'' అన్నాడా వ్యక్తి నవ్వుతూ.

ఒక్కొక్కమనిషికి ఒక్కొక్కమనిషి మీద ఇలాంటి బంధా లేర్పడుతుంటా యేమో!

బస్సు మార్కాపూరు స్టేషన్‌లో

ఆగింది.

విశ్వనాథం డోర్ తెరుచుకొని దిగాడు.

ఆ వ్యక్తి బస్సు దిగి విశ్వనాథం వున్న చోటికొచ్చాడు.

"వెళ్లొస్తాను. మిమ్మల్ని చూడాలంటే ఈ టైమ్‌కు ఇక్కడికి రావాలన్నమాట." నవ్వుతూ అన్నాడాయన.

విశ్వనాథం గూడా చిన్నగా నవ్వాడు.

"నా పేరు రంగస్వామి. మీ పేరేమిః"

"నా పేరు విశ్వనాథం. మీకు నామీద అంత అభిమానం కల్గిందేంః" అన్నాడు విశ్వనాథం.

దానికి ఓ రకంగా నవ్వాడాయన.

తరువాత ఆయన వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన ఓనెల రోజులకు ఒక నాడు బస్ మార్కాపూర్ బస్టాండు వదల బోతోంది.

"ఆగండాగండి" అని అరుస్తూ బస్సు దగ్గరకు పరుగెత్తుకొచ్చా డాయన.

విశ్వనాథం బండి నిలిపాడు.

"మేము శ్రీశైలం వెళ్ళాలి. మా సంసారం బయలుదేరాం. కాస్తాగండి" అన్నాడాయన.

ఆయన సంసార సమేతంగా వచ్చి బస్సులో ఎక్కాడు. డ్రైవరు వెనుకసీటు ఖాళీగా వుంది. ఆయన, ఆయన భార్య, ఇద్దరు చిన్నపిల్లలు, ఒక పదహారేళ్ళ అమ్మాయి....వచ్చి ఆ సీట్లో సర్దుకొని కూర్చున్నారు....

విశ్వనాథం ఒకసారి వెనుతిరిగి చూచాడు. ఆ అమ్మాయి కళ్లు తనవైపే కేంద్రీకృతమై వున్నాయి. ఆ చూపు లలో అతన్నిగూర్చి ఏదో తెల్సుకోవాలన్న భావమో, లేక తెల్సునన్న భావమో గోచ రిస్తూంది. ఆమె చూపుల తాకిడి విశ్వ నాథం యువహృదయాన్ని పులకింప చేసింది. తల మామూలుగా తిప్పి, గేర్లు మార్చి బస్సు ముందుకు సాగించాడు.

ఎదురుగావున్న రిఫ్లెక్షన్ మిర్రర్ లోంచి బస్సులోకి చూచాడు. అమ్మాయి చూపు తనమీదనే వున్నట్లు తెల్సు కున్నాడు. అద్దంలో తన ముఖం ఒకసారి కనిపించేలా ముందుకు వంగాడు. వంకులు తిరిగిన క్రాపు, సన్నని మీసం, నునుపుగా బలంగావున్న బుగ్గలు, కాంతినిండిన కళ్ళు, అతని ముఖం అతనికే కొత్తగా తోచింది.

ఆయన ముందుకు వంగి

''బాగున్నారాః'' అని అడిగాడు.

''బాగున్నామండీ!'' అన్నాడు జవా బుగా విశ్వనాథం.

తరువాత ఏ సంభాషణా జరిగేందుకు అవకాశం లేకపోయింది.

బస్సు సాయంత్రం అయిదుగంటలకు శ్రీశైలం చేరింది. దేవాలయం ముందు ఆగిన బస్సునుండి జనం ఒక్కరొక్కరే దిగసాగారు. దిగుతున్న మనుష్యులను చూస్తూ, తనసీటులో వెనక్కు తిరిగి కూర్చున్నాడు విశ్వనాథం.

బస్సు ముందుభాగాన వున్నందున

యువ



రంగస్వామివాళ్లు అందరూ దిగేవరకూ ఆగవలసి వచ్చింది.

"మాకు శలవులిచ్చారు. శ్రీశైలం చూడాలని అందరం వచ్చాం. నేను స్కూలు టీచర్ని; ఈ అమ్మాయి నా పెద్దకూతురు కమల. వీళ్ళిద్దరూ గూడా మా పిల్లలే." తన సంసారాన్ని పరిచయం చేసాడు రంగస్వామి.

"మంచిది. రేపే బయలుదేరుతారా మీ వూరికి" విశ్వనాధం అడిగాడు.

"లేదు. రేపు ప్రాజెక్టుగూడా చూడాలనుకుంటున్నాము. అందువల్ల ఎల్లుండి వస్తాము" రంగస్వామి బదులిచ్చాడు.

విశ్వనాధం చెవులు రంగస్వామి జవాబు వింటున్నా కళ్లుమాత్రం ఆ అమ్మాయి మీదే వున్నాయి.

ఆ అమ్మాయిని చూచిన క్షణం ఏలాంటిదో గానీ, విశాలమైన కళ్ళు, కోటేరులాంటి ముక్కు, విశాలమైన నుదురు, నల్లని పొడవైన కురులు, వయస్సుకు తగిన శరీరం, చామనఛాయ కల్గి, చూపరులను ఒక లిప్తకాలంలోనే ఆకర్షించుకోగల్గే ఆ అమ్మాయి అందం, విశ్వనాధం హృదయంలో ఒక దివ్యానుభూతిని కల్గించి, అలాగే నిల్చిపోయింది.

ఎన్నడూ వెళ్ళనివాడు విశ్వనాధం,

త్వరత్వరగా బస్సును సత్రం పక్క మామూలుగా నిలిపేచోట నిలిపి, వచ్చి కాళ్ళుచేతులు కడుక్కొని, టెంకాయ ఒకటి కొని, ఆలయంలోకి వెళ్ళాడు.

శ్రీశైల దేవాలయం ప్రశాంతంగా వుంటుంది, చుట్టూ దట్టమైన చెట్లతో నిండిన కొండలమధ్యగల ఆ ఆలయం ఎన్ని వందల సంవత్సరాల నాటిదో లెక్క సరిగా తెలియదు. ప్రాంగణం లోకి అడుగెట్టగనే, గంభీరమైన నంది విగ్రహం కనిపిస్తుంది. ఆ మండపానికి ఎదురుగా ఈశ్వరునిగుడి, తరువాత కొన్ని మెట్లెక్కితే అమ్మవారిగుడి వస్తాయి.

విశ్వనాథం దర్శనం టికెట్టుకొని ఈశ్వరుని ఆలయంలోకి ప్రవేశించాడు. సాయంత్రంవేళ కాబట్టి జనం వరుసగా నిలబడి ముందుకు సాగుతున్నారు. విశ్వనాథం కళ్ళు రంగస్వామి కుటుంబం కోసం వెతకసాగాయి. రంగస్వామి వాళ్ళు అతనికంటే ఓ ఇరవైమంది ముందున్నారు, విశ్వనాథానికి నిరుత్సాహమేసింది.

విశ్వనాథం దేముడి దగ్గరకు చేరేసరికి కమలవాళ్ళు పూజలు పూర్తిచేసి బయటి కొస్తున్నారు. విశ్వనాథం లోనికెళ్ళి టెంకాయ కొట్టించి, కుంకుమబొట్టుతో బయటి కొచ్చాడు.

ఇతని కోసం బయట కాచుకొని వున్నారు రంగస్వామీ వాళ్ళు.

వాళ్ళతో కలిసి అమ్మణ్ణి గుడిలోకి వెళ్ళాడు.

నిండుగా కనిపించే అమ్మణ్ణి విగ్రహానికి మనసారా నమస్కరించాడు. "అమ్మా! నాకు అనురాగవతియైన అమ్మాయి అర్థాంగి అయ్యేలా దీవించు."

అతని ప్రార్థన అతనికే నవ్వొచ్చింది. తనలో తాను నవ్వుకున్నాడు.

అక్కడనుండి వాళ్ళవద్ద శలవు తీసుకొని వచ్చేశాడు విశ్వనాథం.

ఆ రోజునుండి విశ్వనాథంలో కమల పూరికే మెదలసాగింది. కమల కూడా శ్రీశైలం బస్ మార్కాపూరు వచ్చే వేళకు అక్కడ ప్రత్యక్ష మౌతూండేది.

కొన్ని రోజులకు కమల విశ్వనాథాల మధ్య పెనవేసుకున్న అనురాగబంధంవల్లనైతేనేమీ, రంగస్వామికి విశ్వనాథంపట్ల గల సద్భావంవల్లనైతేనేమీ, కమల— విశ్వనాథంల వివాహం ఒక శుభముహూర్తాన జరిగిపోయింది.

ఒక కన్నెపిల్లతో జీవితబంధం ఏర్పరుచుకోవడం, పెళ్ళినాటి వైభవం, అందులో ఎంత తీయదనముందో అర్థం చేసుకున్నాడు విశ్వనాథం.

కమల అత్తవారింటికి బయలుదేరింది ఇంతకాలంగా వాళ్ళలో ఒకతెగా పెరిగిన, ఆ అమ్మాయి పరాయి పిల్లగా బయటికి రావడం ఎంతో బాధనిపించింది. ఏదో బంధాలు తెంచేస్తున్నానేమో అనుకున్నాడు విశ్వనాథం. పెళ్ళిరోజు తీయని అను

భూతితోపాటు ఈ చేదును కూడా భరించక తప్పలేదు విశ్వనాథానికి

ఇన్నాళ్ళూ స్వేచ్ఛగా ఒక పాపగా, తల్లిచాటు బిడ్డగా స్కూలుకెళ్ళి చదువుకుంటూ వచ్చిన ఆ అమ్మాయికి తాను జీవిత పాఠాలు నేర్పించాలి. ఇలా అనేక ఆలోచనల మధ్య కమలను ఇంటికి తీసుకొచ్చుకున్నాడు విశ్వనాథం.

తల్లిదండ్రుల ఆప్యాయతతో మెలిగిన కమల ఇక్కడ ఇంటి కోడలుగా బాధ్యతలను, బానిసత్వంతో మెలగ గల్గడమంటే కష్టమనిపించింది విశ్వనాథానికి.

కాలప్రవాహం ముందుకు పురికింది. కమల విశ్వనాథంల అనురాగాల పంటగా ఇద్దరు పిల్లలు కల్గారు. ఎన్నో మధురమైన రాత్రులు, ఎన్నో సమస్యాపూరితమైన దినాలు వారి మధ్య గడిచాయి. యువతీయువకుల హృదయాలు అరవిచ్చిన కుసుమాలవంటివి. అవి వెదజల్లే పరిమళాలు జీవిత సోపానాలు. అయితే ప్రతి ఆనందమూ అశాశ్వతమే. కాలగమనంలో జీవితంలో కొన్ని మార్పులు, చేర్పులు జరుగుతూంటాయి. కమల కళ్ళను, వెన్నెల తిన్నెలుగా, ఆమె హృదయాన్ని రవీంద్రుని శాంతినికేతనంగా అనుకొనేవాడు విశ్వనాథం.

* *

"ఏరా విశ్వం! బాబూ అలా ఏడుస్తూంటే చూస్తూ పూరుకున్నావు." అంటూ ఆ ఇంట్లోకి వచ్చింది విశ్వం తల్లి. తల్లి పిలుపుతో ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు విశ్వనాథం.

బాబు చెవులు చిల్లులు పడేలా ఏడుస్తున్నాడు.

వాణ్ణి చేతుల్లోకి తీసుకొని. తల్లికేసి చూచాడు విశ్వనాథం

తల బాగా పండిపోయింది. పళ్ళూడిపోయాయి. బుగ్గలు చొట్టలుపడి ఉన్నాయి కళ్ళలో జీవకళలేదు. వంటిమీద ముడతలు కనిపిస్తున్నాయి. నడుము శక్తిక్షీణతవల్ల కాస్త వంగి ఉంది.

ఆమెను, చేతిలోని బిడ్డను మార్చి మార్చి చూచాడు విశ్వనాథం అమ్మ కూడా ఒకనాడు ఇలాంటి పాపే. బాబు కూడా ఒకనాటికి అలా మారేవాడే. మానవజీవితాలే, ఇలా ప్రవాహం లాంటివైనప్పుడు, మానవ నిర్మితమైన బస్సు మాటేముంది?

విశ్వనాథం కళ్ళముందు ఆనాడు దేవస్థానం షెడ్‌లో తాను ప్రారంభం చేసిన లేలాండు బస్సు, ఇప్పటి చొట్టలుపడ్డ లేలాండు బస్సులో ఎక్కి తనకు కళ్ళతో పరిచయమైన పదహారేళ్ళ కమల రూపం, ఈ రోజు, ఇద్దరు బిడ్డల తల్లిగా, పాతిక సంవత్సరాల కమల రూపం కనిపించాయి.

కన్నెపిల్ల జీవితం పెళ్ళితో పాడు చేశానేమో అనుకున్నాడు మొదట. కానీ ఆమె జీవితానికి సార్థకత చేశానని తెలుసుకున్నాడు తర్వాత.




కె. కె. రావ్

ఇది సుబ్రహ్మణ్యం చెల్లెలి కథ. తెలిసిన వారి కిందులో పాపమూ ఉంది ఫలమూ ఉంది.

సన 1929 డిసెంబరు 13 తేదీ లగాయతు సుబ్రహ్మణ్యం చెల్లెలు పంకజాక్షి తాలూకు శీలం పాడయిపోయింది. ఆ రోజున ఆ అమ్మాయి శరీరం దాని మొగుడయిన లక్ష్మీనారాయణ వశమయింది. లక్ష్మీనారాయణకు దొరికిన ఆడుదాని శీలం పాడుగాకుండా వుండటమనేది ఎన్నడూ జరగలేదు.

పంకజాక్షి భర్తకు అచ్చిరాలేదు. అది కాపరానికి వచ్చినరోజు లగాయతు లక్ష్మీనారాయణ తన పాపాలకు ఫలితం అనుభవించ సాగాడు. యములవాళ్ళు వైద్యుల రూపాన వచ్చి అతన్ని నానా బాధలూ పెట్టారు. అతని రక్తంలో అగ్నిహోత్రం ప్రవేశపెట్టారు. అతన్ని బల్లమీద పడుకోబెట్టి కోశారు. రెండు నెల లయినతరవాత లక్ష్మీనారాయణ గుర్తుపట్టటానికి వీలులేని స్వరూపంతో, మొహంమీది చర్మం తోలల్లే అయి, వేళ్లు శాశ్వతంగా కొంగర్లు పోయి ఒకకాలు పక్షవాతం పాలయి బయటపడ్డాడు.

వాడు ముందు ముందు అటే పాపాలు చెయ్యలేడని వైద్యులు భరవాసా ఇచ్చారు.

లక్ష్మీనారాయణ విషయంలో పుణ్యం గట్టుకున్న మహానుభావులెవరో తెలీదు కాని, చుట్టపక్కాలంతా — ముఖ్యంగా లక్ష్మీనారాయణ వేపువాళ్ళు—పంకజాక్షి కేసి చూశారు. "నువ్వే దీనికంతకి కారణ" మన్నట్టు. పాపిష్ఠివాడు పాపఫలం అనుభవించటం ఎవరికీ ఇష్టంలేనట్టు కనపడ్డది. ఆ పాపఫలంలో పంకజాక్షికి పత్నీభాగం లేకపోవటం మరీ అన్యాయంగా కనిపించింది అందరికీ.

అయితే, నేనూ కామేశ్వర్రావూ చాలా సంతోషించాం. మేమా? మేమిద్దరమూ ఈ కథకు ప్రేక్షకులం. మమ్మల్ని వదిలెయ్యండి.

ఇక ముందు పంకజాక్షి గతేమిటి? వాడు—ఆ లక్ష్మీనారాయణ — దాంతో కాపరం చెయ్యటానికి పనికిరాడు" అన్నాడు కామేశ్వర్రావు నాతో ప్రైవేటుగా.

''దాన్ని పెళ్ళాడటానికే పనికిరాదు వన్నడిగితే!'' అన్నాను.

నా బుద్ధిమాంద్యానికి వాడు విసుక్కుని, 'అది సరే—వాడికి—వాడు—వాడితో అది—'' అని తడుపుకోసాగాడు నా మిత్రుడు

''పోనీ, హాయిగా బ్రహ్మచర్యం ఆచరించి ఇంత పరమైనా సంపాదిస్తుంది!'' అన్నాను.

''ఎంత అన్యాయం!''

''ఏమిటా అన్యాయం? నన్ను చూసి ఎవరూ జాలిపడరేం? నేను రోజూ చేసేది బ్రహ్మచర్యం కాదూ'' అన్నాను

కాని, పంకజాక్షి బ్రహ్మచర్యం చెయ్యలేదు. ఆమాటకొస్తే నేనూ చెయ్యలేదు. కామేశ్వర్రావు నాతో మాట్లాడటం మానేశాడు—బొత్తిగా కాదు, వెనకటి మాదిరిగా.

పరస్త్రీ గమనం మహాపాతకమనీ, పరపురుష గమనం కూడా అటువంటిదేననీ కామేశ్వర్రావు నాకు వినపడేటట్టు అప్పుడప్పుడూ అంటూ వచ్చిన మాటల్నిబట్టి నేను గ్రహించగలిగాను.

నేను చాలావరకు కామేశ్వర్రావు వైఖరి సహించి ఊరుకున్నాను గాని అది రానురాను దుర్భరమయింది.

''ఒరే, కామయ్యా, నువ్వు కొందరు సోషలిస్టులల్లే మాట్లాడకు, నాకు బాగుండదు'' అన్నాను.

''సోషలిస్టులకేం?'' అన్నాడు కామయ్య పళ్ళుబిగబట్టి.

'అది నీకు చాలా అప్రస్తుతం. నువ్వు సోషలిస్టువా?''

''కాను. నువ్వే నన్ను సోషలిస్టన్నావు.''

''నే నన్లేదు. సోషలిస్టల్లే అన్నాను''

'సోషలిస్టు లెట్లా మాట్లాడతారు?''

''నీమల్లే.''

''నేనెట్లా—''

''సోషలిస్టల్లే.''

''నేను సోషలిస్టల్లే మాట్లాడటంలేదు'' అన్నాడు కామేశ్వర్రావు ఒక క్షణం ఆలోచించి.

''ఐతే ఎవరల్లే మాట్లాడతావు?''



అన్నాను. దాంతో కామయ్య ఏత్తయినాడు.

వాదనలో గెలిచానన్నమాటే గాని కామయ్య చెప్పింది నిజమేనని నాకుకూడా తెలిసివచ్చింది. ఎవరూ లేరనుకుని కామయ్యగాడు పంకజాక్షి బుగ్గగిల్లటం నాకంట పడినప్పుడు.

అటుతరవాత పంకజాక్షి నన్ను చూసి నవ్వినప్పుడు నేను తిరిగి నవ్వలేదు అది మొహం చిట్లించి, తలవిసిరి, జడ ఝాడించి నామీద ఆగ్రహం విసిరింది. దాంతో నా కణత పగిలింది.

"ఒరే, కామయ్యా!" అన్నాను సౌమ్యంగానే.

"నేను నీ అంత దొంగస్వాములార్ని కాను. ఆడది రంకుతనం చేస్తే, హరి హరీ అని చెవులు మూసుకోను కాని, రంకుతనంలోకూడా ఒక నియమం ఉండాలి. ఎవడైనా ఒకడు—"

"ఒకడో, ఇద్దరో! అట్లా నియమంగా ఉండటం మంచిది! చెప్పు, చెప్పు!" అన్నాడు కామయ్య.

నా క్కోపంవచ్చి, వాడితో తాత్కాలికంగా మాట్లాడటం మానేశాను.

తరవాత కొన్నాళ్ళకు కామయ్య నాతో రాజీకి వచ్చాడు.

"ఒరే పంకజాక్షి చూశావా! మరీ అన్యాయమైపోతున్నది."

"పోనీ మనకెందుకు?" అన్నాను

"ప్రతి విషయంలోనూ మనం అట్లా ఉదాసీనంగా ఉండబట్టే సంఘం ఈ విధంగా అఘోరిస్తున్నది. మన సుబ్రహ్మణ్యానికెంత అప్రతిష్ఠో చూడు. ఫలానివాడి చెల్లెలు—"

మేమిద్దరమూపోయి సుబ్రహ్మణ్యాన్ని హెచ్చరించాము

"ఇంకోరు చేసేపన్లకి నన్ను సిగ్గుపడమంటే నావల్ల కాదు. నా సిగ్గంతా నేను చేసేపనికే చాలీ చాలకుండా వుంది" అన్నాడు వాడు. వాడు లెక్కలబియ్యే లెండి.

మొదట మొదట పనిపోయింది కాని కాలక్రమాన పంకజాక్షి అల్లరిపాలయింది. ఒకటి రెండుసార్లు పంకజాక్షిని పట్టుకున్నారు. ఒకసారి దానికి శాస్తికూడా చేశారు. చావగొట్టి మూలగదిలో కూర్చోబెట్టి బయటికి రానివ్వలేదు.

"అంతే కావాలి!" అన్నాడు కామయ్య.

"నా కళ్ల హారతికర్పూరం పెట్టినట్లు చల్లగా ఉన్నై" అన్నాను. కామయ్య చూడకుండా కళ్ళు తుడుచుకున్నాను.

అటుతరువాత పంకజాక్షిని పట్టపగ్గాలు లేకపోయినై. దాని మొగుడికి జరిగిన శిక్షే దానికీ జరిగింది ఇంకా అంతకన్న కూడా ఎక్కువే జరిగింది. ఆడది గనక.

"చూశావా. పంకజాక్షి పాపఫలం ఎట్లా అనుభవిస్తున్నదో!" అన్నాడు కామయ్య.

ముఖ వ




"పెద్దవాళ్లూరికే చెప్పారుట్రా?" అన్నాను.

"అంతే కావాలి దానికి!" అన్నాడు కామయ్య

"ఆమాట అనకు. నాకు చాలా కష్టం వేస్తుంది" అన్నాను.

కామయ్య నాకేసి ఆశ్చర్యంగా చూశాడు

"ఇంకా అంతకంటె పదింతలయినా పాపంలేదు" అన్నాను

కామయ్య తృప్తిపడ్డాడు.

పాపఫలం అనుభవించడం పూర్తి అయిన తరువాత పంకజాక్షి పవిత్రమైన ఆత్మమాదిరిగా తళతళ లాడసాగింది అసలే అందగత్తె. ఇప్పుడు తేరి చూడ రానిదై పోయింది.

ఈ సంగతి కామయ్యకూడా గమనించాడు కామాలు. ఒకనాడు నాతో తనంతట తనే అది కాస్తా బయటపెట్టాడు.

"నేను నీ వెధవనీతి విని చెడ్డాను!" అని కామయ్య నిట్టూర్పు విడిచాడు.

పంకజాక్షికి తనహృదయం అర్పించడానికి వాడు చేసే ప్రయత్నాలు నేను గ్రహించగలిగాను. నేను గమనించినంత వరకు అది వాటి వేడికి కరగలేదు

ఆ సంగతి వాడే నాకు చెప్పాడు.

"పంకజాక్షి పతివ్రతలకన్నా పాడుగా తయారయింది అయినా నువుకూడా కదిలించి చూడు! ఏం జరిగిందో మాత్రం నాతో చెప్పు!" అన్నాడు కామయ్య

రెండు రోజులైన తరవాత కామయ్య మళ్ళా నాతో ఈ ప్రస్తావన ఎత్తినప్పుడు "లాభంలేదురా కామయ్యా! ఇప్పటి పంకజాక్షిని చూపి ఆకాశంలో అరుంధతికూడా బయటికి రావటంలేదు" అన్నాను.

"మొగుడి దగ్గిరికి పోతుందిట్రా?"

"పోదుట."

"ఈ మొగుడులేని పాతివ్రత్యం చూస్తే నాకు మండిపోతుంది" అన్నాడు కామయ్య. "ఏం చేస్తుందిటా?"

"నేను చెప్పిన బ్రహ్మచర్యమేమో!" అన్నాను.

"నీ మాటంటే దాని కంత గురేం?" అన్నాడు కామయ్య

తరవాత ఒక నెలకు పంకజాక్షి మాయమయింది. మరి రెండు రోజులకు తెలిపింది, పంకజాక్షి ఎవరితోనో లేచి పోయిందని. ఆయన ఎవరో డిప్టీ కలెక్టరుట. భార్య పోయిందిట, నడి వయస్సు వాడుట.

"ఆయనకూ దీనికీ ఎట్లా లంగరందిందో నే నూహించుకో లేకుండా వున్నాను" అన్నాడు కామయ్య.

నేను మాట్లాడలేదు.

"ఇక దాని పాట్లు కుక్కలూ నక్కలూ పడవు" అన్నాడు కామయ్య తన దివ్య దృష్టితో చూసి.

"ఇది అదివరకు మాట. ఇక కుక్కలూ, నక్కలూ పడేపాట్లు అది పడదు." అన్నాను.

"నీ కెట్లా తెలుసు?"

"నీ కెట్లా తెలుసూ, అది పడే పాట్లు కుక్కలూ నక్కలూ పడవని?"

"ప్రశ్నకు ప్రశ్న వెయ్యకు!"

"నువ్వు కాంగ్రెసు వాళ్లల్లే మాట్లాడకు" అన్నాను

"కాంగ్"—నాకేసి ఒక్కసారిచూపి బుద్ధిమార్చుకుని కామయ్య విషయంకూడా మార్చాడు.

"ఆ డిప్టీ కలెకటేరు ముసిలివాడై ఉంటాడు."

"కట్టుడు పళ్ళుట" అన్నాను.

"కోతి అయివుంటాడు" అన్నాడు కామయ్య.

"నేనది ఒప్పుకోను. రెండూ ఇవ్వటం అన్యాయం. వాడికి ముసలితనమన్నా ఇదాం, లేదా కురూపితనమన్నా ఇద్దాం. రెండూనా?" అన్నాను.

"రెండూనూ!" అన్నాడు కామయ్య ఖచితంగా.

"పోనీ, వోటుకు పెడదాం తీర్మానాన్ని" అన్నాను.

"చాలా అనవసరం. ఆ డిప్టీ....దాన్ని రోజూ చంపుకు తింటాడు. వాడు చావగానే దాని పాట్లు కుక్కలూ నక్కలూ పడవు" అన్నాడు కామయ్య.

"పడతై." అన్నాను.

"నీకంతా వేళాకోళంగా వుంది." అన్నాడు కామయ్య.

"నీకే వేళాకోళంగా వుంది. ఆ డిప్టీ... వాడు పదివేల ఇన్స్యూరెన్సు పాలసీ పంకజాక్షికి ఎస్సైను చేశాట్ట"

"నీకెట్లా తెలుసు"

"చెయ్యలేదని నీకెట్లా తెలుసు?" అన్నాను

"నీతో మాట్లాడటం నాదే బుద్ధి పొర పాటు!" అన్నాడు కామయ్య.

"ఉండుండు. ఈ ఒక్కముక్కా విని నాతో మాట్లాడటం మానివెయ్యి. పంక జాక్షి నాకు ఉత్తరం రాసింది. రేపాది వారంనాడు నిన్నూ నన్నూ బయలుదేరి రమ్మన్నది. వాళ్ళింట్లో రెండురోజులుండి పొమ్మన్నది."

"నీకు రాసిందా?"

"ఇదుగో ఉత్తరం."

"నాకెందుకు రాయలేదూ?" అన్నాడు కామయ్య.

"రేపు వెళ్ళి స్వయంగా కనుక్కుందాం." అన్నాను.

రాను రానంటూనే కామయ్య నాతో బయల్దేరాడు పంకజాక్షినీ, డిప్టీ కలెక్టరునూ చూడటానికి.

పంకజాక్షి ఇల్లు వైభవంగా వుంది. పడిమంది నౌకర్లూ, పెద్దమేడా, కుర్చీలూ, ఇంటోనే క్రోటన్లూ, వాకిళ్ళకూ కిటికీలకూ అందమైన పరదాలూ అదీను. డిప్టీ కలెక్టరుగారి డబ్బంతా ఇదే వాడటం. ఆయన ముప్ఫయిరెండేళ్ళవాడు. అంత అందమైనవాణ్ణి నేను చూడలేదు. అతనూ, పంకజాక్షీ పక్కపక్కనే నిలబడితే రాజూ, రాణీ ల్లే ఉన్నారు. అతను పంకజాక్షిని పువ్వుల్లోపెట్టి పూజిస్తున్నాడని రుజువయింది. వాళ్ళిద్దరూ క్షణానికోసారి కీచులాడుకోవటం చూస్తే కామయ్యకు ముచ్చటెయ్యలేదు.

మేం వెళ్ళేటప్పటికి డిప్టీ కలెక్టరుగారు ఒక నిక్కరూ, బనీనూ వేసుకుని లోడీలు తిప్పుతున్నాడు. అతని కండరాలు సముద్రపు అలలల్లే తిరుగుతుంటే కామయ్య కళ్ళు తిరిగినై.

అతను పంకజాక్షితో మాట్లాడినట్లు మాతో మాట్లాడలేదు. ఎటాగైనా మా దగ్గర కాస్త హోదా కనబర్చాడు. పంకజాక్షిమాత్రం మాతో మామూలుగానే మాట్లాడింది.

మే మక్కడవున్న రెండురోజులూ చాలా హాయిగా గడిచినై. మేం వచ్చేటప్పుడు డిప్టీకలెక్టరుగారు మా ఇద్దరి చేతులూ మథించి, నాతో 'మీ ఉపకారం ఎన్నటికీ మరవను. మీరు అప్పుడప్పుడూ వస్తూ ఉండండి." అని లాంఛనంగా అన్నాడు.

బయటికి రాగానే కామయ్య "నువ్వాయనకు చేసిన ఉపకారమేమిటో కాస్త చెబుతావా?" అన్నాడు.

"పంకజాక్షి ఆయనతో లేచిపోవటానికి నాకూ ఏమీ సంబంధంలేదు" అన్నాను.

"ఆ సంగతి తెలుస్తూనేవుంది. ఆ విషయం నీతో దీర్ఘంగా మాట్లాడాలి పద!" అన్నాడు కామయ్య

"నువ్వుపో. నేను నీవెంట రాను. నేను తరవాత బండికి వస్తాను." అన్నాను.



మదనకదన కుతూహల రాగం

# పెంపకం



వై. రాంబాబు రాయి

బయట వెన్నెల. బరువైన భోజనం.

వాకిట్లో వాలు కుర్చీలో కన్నుమూత పడుతోంది. చప్పుడైతే చూశాను కాసులు ప్రక్కనే నిలబడున్నాడు.

పదేళ్ళవాడు కాసులు. పదునైన చాకు లాంటి వాడు.

"ఏం కాసులూ! భోజనమైందా?" అనడిగాను.

కాసులు తలూపాడు.

"కూచో" అన్నాను. మెట్టుమీద కూచున్నాడు.

"ఏవిటి విశేషాలు?"

ఏం మాట్లాడ్డంలేదు. ఏదో ఉంది. చెప్ప డానికి భయపడుతున్నాడు.

"భయంలేదు. చెప్పు కాసులూ!"

నన్ను చూశాడు తలవాల్చుకున్నాడు. తటపటాయించాడు.

'ఏం లేదండీ! బాబయ్య చదవొద్దం టున్నాడు. మీరు చెబితే వింటాడు...."

ఆలోచనలో పడ్డాను. అదేమంత సులభమైన పనిగాదు.

చదువు విలువ అందరికీ తెలీదు. తెలీనివాడు ముందే తోసిపారేస్తాడు.

"పొద్దుట చెప్పేను. ఆరోక్లాసులో చేరతానంటే అగ్గైపోయాడు. ఎగసాయం చెయ్యమంటున్నాడు" అన్నాడు కాసులు, తలవాల్చుకునే.

వాడికి చదువుపైన వున్న మమకారం చూసి ముచ్చటైంది. కాని—రామ్మూర్తి తిక్కమొగుడు. ఒకరు చెబితే వినేరకం కాదు.

నా మీద ఎంతో నమ్మకంతో వొచ్చిన వాడికి వట్టి చేయి చూపించలేను. అవునంటూ బాధ్యత నెత్తికెత్తుకోలేను. ఇది గొంతునబడ్డ వెలక్కాయవతు.

"చెబుతాలే"

అన్నానేగాని ఆ అనడంలో చెబుతానన్న ధీమాలేదు. నాలో చెప్పాలన్న కోరికాలేదు పులి గుప్పిట్లో కాసుల పేరుంది. తలచుకుంటే ఒళ్లు పులకిస్తుంది. అడుగు ముందుకు పడదు.

కాసులు చూశాడు—మళ్ళీ. అతని నమ్మకం చాల్లేదు ఏదో చెబుదామనుకున్నాడు. ఏం అనడానికీ తోచలేదల్లే ఉంది

రామ్మూర్తి రెండో కొడుకు కాసులు. పెద్దవాడు పేరయ్య కాసులుకంటే వాడు ఘటికుడు. గొప్ప తెలివైనవాడే గాని, కాసులుకున్నంత ధైర్యం వాడికిలేదు

వాడి విషయంలోనూ ఇంతే జరిగింది

అయిదయ్యాక వాడు ఆరులో చేరతానన్నాడు. రామ్మూర్తి అగ్గిరాముడై పొయ్యాడు

"సదువుకుంటావ్రటా సన్నాసి ఎదవా! సదివి ఏం సేద్దామని. కలకటేరు సేత్తావా — గవర్నరు గిరీ ఎలిగింతావా! సదువు కూడెట్టే పళవైతే సదువుకో. నేనొద్దన్నా. కాని—సదువు మన యింటావంటా లేంది నువ్వు సదువుతేమటుకు వొత్తాదేంటి? ఎర్రోడా! మా తాత మట్టి పిసికేడు. మా బాబు మట్టి పిసికేడు. మనం మట్టిలో పుట్టేవురా! మట్టే మనకి కూడెడతాది"

అంతే. ఆ దెబ్బతో పేర్యయ్య తలకి గుడ్డ చుట్టుకున్నాడు. చేత కర్ర పుచ్చుకున్నాడు. ఉన్న నాలుగెకరాల పొలాన్నీ పుస్తకమనుకున్నాడు అ కలతో అక్షరాలు రాయడం ప్రారంభించాడు

పేరయ్య పెద్ద తెలివైనవాడు. వయసుకు మించిన తెలివుందని ఋజువు చేసుకున్నాడు చదువులో తప్పక రాణించేవాడు. ఆ మాణిక్యం మట్టి పనికి వెళ్ళిపోయింది రాచబాటకు మళ్ళవలసినబండి అడ్డదారి తొక్కింది

తలెత్తి చూస్తే కాసులు లేదు

అతనికి అన్న స్థితి చూస్తే భయం వేసినట్టుంది గొప్ప చదువులు వొద్దు— కనీసం నాలుగు ఇంగ్లీషు అక్షరాలైనా ఒంటబట్టకపోతే నడిచే రోజులు కావు మరి

కళ్లు తెరిపిళ్లు పడింది తడవు కాసులే తలపుకు వొచ్చాడు కాఫీనీళ్ళు గొంతులో పడనిచ్చి, రామ్మూర్తికోసం బయలుదేరాను.

మకాంలో మంచంమీద కనిపించాడు. చుట్ట కాల్చుకుంటున్నాడు పాలేరు దూళ్ళ దగ్గిర పేడ తీస్తున్నాడు వాడేదో చేశాడు. రామ్మూర్తి వాడిని దులిపేస్తున్నాడు

నన్ను చూశాడు. చూస్తూనే అనుమానించాడు అనుమానించినట్టు నిపర్శనంగా నన్ను నిలువునా పరీక్షగా చూశాడు.

పక్కను కూచోమన్నాడు

"ఏం మావయ్యా! ఈ సంవత్సరం




పంటలెలా ఉంటాయ్'' అనడిగాను— కూచుంటూ.

''ఏం పంటల్లేవయ్యా అల్లుడా! వాన పడతాదనుకుంటే ఎండ మాడిపోద్ది. ఎండ కావాలనుకుంటే వానలు దంచుతాయి కాలం బాగోపోతే, మనం ఎంత దొళ్ళినా అంటుకోదు.'

అదృష్టం అంటూ ఒకటుండాలి అది కలిసిరాకపోతే. ఎంత తన్నుకున్నా అంతే మరి.

''అది సరేగాని — నువ్వెందుకొచ్చి నట్టు?'' అనడిగాడు రామ్మూర్తి

ఓక్కులు చూశాను సూటిగా అడిగితే ఏం చెప్పను!? అయినా తప్పదు మెల్లగా చెప్పాను

రామ్మూర్తి నావైంక చూళ్ళేదు పాలేరు తనపని ముగించుకొని వెళిపోయాడు పాలు పితకడానికూర్చున్నాడు రామ్మూర్తి.

నాకేం సమాధానం రాలేదు అలాగే కూచున్నాను.

పాలధారలు చెంబులో పడి రాగాలు పాడుతున్నాయి గేదె మౌనంగా నిలబడింది. దూడ జాలిగా చూస్తోంది నోరు లేని జీవాలు మనిషి ఆకలిని తీరుస్తున్నాయి.

పాలు పితకడం అయిపోయింది

''నడవ్వయ్యా!' అన్నాడు రామ్మూర్తి.

దారిలో అతను నోరు విప్పలేదు.

ఇల్లొచ్చింది ఇంక శలవు తీసుకోవాలి.

''మరి నే వెళ్ళొస్తాను మావయ్యా!'' అన్నాను

రామ్మూర్తి వెనక్కు చూడలేదు నా మనసు చివుక్కుమంది ఆలోచనలో

ఉన్నాదేమో! నాకు అవుననిగాని కాదని గాని సమాధానం చెప్పలేదు. గబగబ అడుగులు వేసేను.

ఆ రోజంతా కాసులుగురించే ఆలోచన. ఏంచేయాలి? ఏంచేస్తే బావుంటుంది? అతని చదువుగురించి చెప్పినప్పుడు రామ్మూర్తి నాకేమీ సమాధానం యివ్వక పోడానికి్కారణం ఒక్కటే అయ్యుండాలి. కాసులు చదువుకోడం అతని కిష్టం లేదు. నా అంతటివాడు ఈ విషయంలో సలహా యిచ్చినపుడు అతను ఆలోచనలో మునిగిపోయాడు

ఆ సాయంకాలం కాసులు మళ్ళీ వొచ్చాడు. బిక్కమొగంతో ఉన్నాడు. ఒంటిని ఎర్రటివాతలు చూపించాడు. నేను సలహా చెప్పబోతే—దానికి ఫలితం అది.

బావురుమని ఏడ్చేశాడు కాసులు. ఎంతకూ ఊరుకోడు ఒళ్ళో తలపెట్టి, పసిబిడ్డలా వెక్కి వెక్కి ఏడ్చాడు. ఏం చెప్పడానికీ తోచిందికాదు. ఏమని సముదాయించను! నే చేసినదానికి ఫలితం ప్రత్యక్షంగా అనుభవిస్తున్నవాడిని ఎలా ఓదార్చడానికీ నోరాలేదు.

ఉద్యోగమే ఆధారం నాకు బక్క పంతులు నాలుగురాళ్ళు వెనకేయడం సాధ్యంకాదు. పిట్టనుకొట్టి పొయిలో పెట్టడమే అవుతుంది. ఈ స్థితిలో—ఒక కుర్రాడిని ఎక్కడో దూరంగా ఉంచి, చదివించడం నావల్ల కానిపని అయినా సాహసించాను.

బెజవాడలో నా స్నేహితుడున్నాడు. అక్కడికి వెళ్ళిపో. నేను డబ్బు పంపిస్తాను" అన్నాను.

కాసులు ఏడుపు మానేసేడు అయినా ఏం చెప్పలేదు. కాసేపు అలానే కూచున్నాడు. ఏమనుకున్నాడో, చటుక్కున లేచి వెళ్ళిపోయాడు.

రెండు రోజులు గడిచిపొయ్యాయి కాసులు కనిపించలేదు.

రాచకార్యం ఒకటి మీదపడి రాజమండ్రి వెళ్ళవలసొచ్చింది. ఒకపట్టాన పనికాలేదు గవర్నమెంటు వారితో పనులు అంత జరూరుగా కావని తెలుసు. పూటలో కావలసింది వారమైంది.

తిరిగి వొచ్చేసరికి శ్రీమతి ఒక విచిత్ర వార్త చెవిని వేసింది కాసులు అంతకు రెండురోజులక్రితం ఎటో వెళ్ళిపోయాడు వార్త తెలిసీ తెలీగానే నేను రామ్మూర్తిని చూడాలని వెళ్ళాను.

అల్లంతదూరంలో నన్ను చూసీ చూడ నే రామ్మూర్తి ముఖంలో రంగులు మారడం గమనించి, గతుక్కుమన్నాను

నన్ను కూర్చోమనలేదు. మామూలుగా నైనా నవ్వలేదు. ఒకసారి ముఖమెత్తి —శత్రువును చూసినట్టు చూసి. "మావోణ్ణి ఎక్కడికి పంపించేవో చెప్పు" అన్నాడు.

దెబ్బతిన్నాను. ఈ పాపం నన్ను చుట్టేసింది.



"నువ్వంటున్న దేవిటో నాకర్థకావడం లేదు" అన్నాను. నిబ్బరించుకుని

"సంగనాపి ఊసులాడకు నీ సలహా లేంది ఆడెక్కడికి వెళ్తాడు?"

నాకోపం వొస్తోంది.

"రాజమండ్రినించి ఇదే రావడం కాసులు వెళ్లిపోయాడని మీ అమ్మాయి చెప్పింది. సంగతేవిటో కనుక్కుందామని వొచ్చాను"

నా సమాధానం రామ్మూర్తికి రుచింప లేదు

"ఇదిగోనయ్యో! ఈ కపటనాటకాలు నాదగ్గరాడకు. మర్యేదగా ఆడి ఆసూకీ సెప్పేవా సరేసరి—లేకపోతే పోలీసు రిపోర్టిత్తాను ఏవనుకున్నావో—"

వ్యవహారం ముదిరిపోయింది. అపవాదులకు భయపడే తత్త్వం కాదు నాది

"రిపోర్టిస్తావా—సరే-మని రిపోర్టు చేస్తావో చూస్తాను మర్యాదకోసం నిన్ను పలకరించిపోదామని వొస్తే తప్పంతా నా నెత్తివి పెడుతున్నావ్. రిపోర్టిస్తానంటున్నావుగా—కానీ"

నేనన్నది అంతే. మరి నిలబడలేదు.

* *

ఇన్నేళ్ళ తరవాత కాసులు సంగతి తలచుకుంటే చాలా విచిత్రంగా వుంది.

రామ్మూర్తిని ముసలితనం లొంగదీసింది. ఒక్కమాటలో—అతవిప్పుడు కోరలు తీసిన పులి.

ఎప్పుడూ ఇంటరుగుమీద కూచుంటాడు.

రత్నంలాటి పెద్దకొడుకు ఎందుకూ కొరగాని వాడయ్యాడు. అయినింటి ఆడపిల్ల ఆ యింటి కోడలైంది. ఆవిడ షోకులకు ఉన్న ఆస్తి, అత్తవారిచ్చిన తోటా చాల్లేదు. పేరయ్య ఆవిడ కొంగున మూట. ఆస్తి హారతికర్పూరంలా కరగిపోయాక, అతగాడు కూలీనాలీ చేసుకుంటున్నాడు.

రామ్మూర్తి కిప్పుడు వేళకు తిండి దొరకడం కష్టం. చిన్నకొడుకు పరారైపోయాడన్న బెంగతో రామ్మూర్తి భార్య ఒకరాత్రి నూతిలో దూకి, చచ్చిపోయింది.

రామ్మూర్తిని తలచుకున్నప్పుడు నా కెప్పుడూ జాలనిపించదు. అతను నాకేమీ అపకారం చేయలేదు. అతను చేసిందల్లా —రత్నాల్లాంటి ఇద్దరూ కొడుకుల్ని ఎందుకూ కాకుండా చేసుకున్నాడు.

పెద్దవాడు చదువుకుని వుంటే, బాగు పడి ఉండేవాడు. మట్టిని నమ్ముకోడం తప్పుకాదు. మట్టి కోసం మాత్రం రామ్మూర్తి బంగారంలాంటి జీవితాన్ని మటిపాలు చేశాడన్నదే నా బాధ.

కాసులు ఇల్లువిడిచి పోవటంలో నా ప్రమేయం ఏమీలేదని స్పష్టమయ్యాక ఓరోజు రాత్రి రామ్మూర్తి నన్ను వెదుక్కుంటూ వొచ్చాడు. క్షమాపణ చెప్పుకున్నాడు. తొందరపడ్డానన్నాడు.

అప్పుడడిగాను రామ్మూర్తిని— "వాడు చదువుకుంటానంటే ఎందుకు ఒప్పుకోలేద" ని.

చదువు మనిషికి అపకారం చేయదు. మనిషిని అది పెద్దవాడిని చేస్తుంది. అంతర్యాన్ని వికసింపచేస్తుంది. తనకు తాను అపకారం చేసుకోకుండా చేస్తుంది. మనసులో మంచితనాన్ని పెంచుతుంది.

రామ్మూర్తి చదువుకోలేదు. అతనికి చదువు విలువ తెలీదు. అతననుకున్నదల్లా— ఉద్యోగంకోసం మాత్రమే చదువని.

అతను చెప్పిన సమాధానం విన్నపుడు తలవాల్చుకున్నాను. అతని సమాధానం మరోసారి తలుచుకోడానికే భయపడ్డాను.

"కొడుకెప్పుడూ తండ్రి చెప్పుచేతల్లో ఉండాలి. నేను చదువుకోలేదు. నా కొడుకు చదువుకుంటే, నామాటింటాడా? ఇనడు. ఊళ్ళేలతానంటాడు. నామీదే పెత్తనం సేత్తాడు. అందుకోసమే చదువుకోవొద్దన్నాను"

ఇంత కల్మషం రామ్మూర్తి హృదయంలో ఉందని తెలీదు.

ఏ తండ్రీ ఇంత నికృష్టంగా ఆలోచించదు

ఏ తండ్రీ ఈవిధంగా కొడుకు భవిష్యత్తును కూలదోయడు

రామ్మూర్తి తండ్రిగా తన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించలేక పోయాడు.

కాసులు తిరిగిరాలేదు ఏమైపొయ్యాడో తెలీదు కాలం ఎవరికోసమూ ఆగదు కన్నీరుపెట్టేవాడినీ, కడుపునిండినవాడినీ అది కనికరించదు. దాని పని దానిదే

ఒకరోజు సాయంకాలం వార్తా పత్రికలో కాసులు సంగతి తెలిసింది. ఏజన్సీలో అరెస్టయిన విప్లవవాదుల ముఠాలో కాసులున్నాడు

చక్కగా చదువుకుని, సంఘంలో గౌరవంగా బతకాల్సిన కాసులు జీవితంలో దెబ్బతిని, విప్లవవాదయ్యాడు.

పెద్ద కొడుకు తండ్రి చెప్పినట్టల్లావిని, ఎందుకూ కొరగాకుండా పోయాడు.

వాళ్ళిద్దరిదీ ఏ మాత్రం తప్పులేదు. కొడుకుల్ని ఎలా పెంచాలో తెలీని తండ్రిదే ఈ తప్పంతా.




ఆమెకు చంప అనే పేరు ఎవరయినా పెట్టనీయండి. పొరపాటు మాత్రం పడలేదని చెప్పవచ్చు. ఆ పుష్పవర్ణానికీ ఈ దేహవర్ణానికీ తేడా ఏమీ లేదు. కావి చంప మందభాగిని. పదోయేట ఆమెను గోపాల భైరాగి కిచ్చి పెళ్ళిచేశారు; పదమూడో యేట విధవ అయింది. అప్పుడు చంప తల్లి ఇంకా బ్రతికే ఉన్నది. కూతుర్ని మళ్ళీ యింకొకని చేతిలో పెట్టాలని చూపింది. కాని కూతురు ఏమాత్రమూ ఇష్టపడలేదు. తర్వాత కొన్నాళ్ళకు తల్లి కూడా చనిపోయింది. చంపా

వైష్ణవి అప్పటి నుంచీ ఒడుదుడుకు లేకుండా జీవనం గడుపుకొంటూ ఇప్పుడు యిరవై యోయేట అడుగు పెట్టింది.

బొత్తిగా ఒడుదుడుకు లేకుండా కాలం గడుపుకు వస్తున్నదని చెప్పటంలో కూడా కొంత అసత్యం ఉన్నది ఆమె రూపాన్ని ఆరాధించేవా రేమీ తక్కువ లేరు నవీన యాదవుడు దగ్గర నుంచి గోపాలవైష్ణవుడు వరకూ. ఒకసారో, అరసారో ఆమె అనుగ్రహం కోరిన వారే. ఆమె బెదిరింపుకు తోక ముడిచిన వారే. కాని ఇప్పుడు చంపదగ్గర వివాహ ప్రసంగం ఎవ్వరూ తేవటంలేదు. దీనికి కారణాలు కూడా ఉన్నవి. ఒకటి: ఆ గ్రామ జమీందారు రాజీవణాబు చంపను కుమార్తెగా చూచుకుంటాడు; రెండోది: చంప తిరస్కారము. ఇక చంప ఇంటి చుట్టూ ఎవడు తిరుగుతాడు?

చంపకు కాస్త చదువుకూడా వచ్చును; ఎలిమెంటరీ పాఠశాలలో నేర్చిన విద్యను క్రమంగా వృద్ధి చేసి భారత రామాయణాలు చదవటం వరకు తీసుకువచ్చింది ఉదయం మరమరాలు వేయించటం. మధ్యాహ్నం రూపగ్రామం వెళ్ళి వాటిని అమ్మి సాయంత్రం ఇంటికిరావటం; వంటా భోజనం అయిన తర్వాత జమీందారుగారి వృద్ధదాసి లక్ష్మిని శ్రోతగా కూర్చుండ బెట్టి రామాయణమో, భారతమో చదవటం ఇదీ ఆమె దినచర్య. ఈ విధంగానే చంప దినాలు గడిచిపోతున్నవి.

శ్రావణమాసపు మేఘాలు ఆనాటి మధ్యాహ్నాన్ని సాయంత్రం చేసివేసినై. చంప త్వరత్వరగా మరమరాలు అమ్ముకొని ఇంటికి వచ్చేసిం . ఇంటి ముంగిలిలోని వేపచెట్టు ఉన్న కాస్త వెలుతుర్ని కూడా ఇంట్లోకి పోనివ్వకుండా చేసింది ఆమె పంచపాళిలో అడుగుపెట్టగానే. ఎవరో అక్కడ పండుకొని ఉండటం చంప చూసింది. ఆ చీకటిలో గుర్తు పట్టే ఉపాయ మేదీ లేదు. చంప "ఎవరు?" అని ప్రశ్నించింది. జవాబు రాకపోయే వరకు బుట్ట క్రింద పెట్టి ఇంట్లోకిపోయి దీపం వెలిగించి తీసుకు వచ్చింది

పండుకున్నతన్ని చంప యిదివర కెప్పుడూ చూడలేదు ఇరవై, ఇరవై రెండేళ్ళు ఉంటవి అతనికి కళ్ళు మూసుకు పడుకొని ఉన్నాడు. చంప అతని దగ్గరికి వచ్చి మళ్ళీ ప్రశ్నించగానే యువకుడు కళ్ళు తెరిచి—"నీరు" అన్నాడు.

'నువ్వెవరవు? ఎందుకిలా పండుకొన్నావు?" అని చంప ప్రశ్నించింది.

"నీరు! దప్పిక!" యువకు డిక ఏమీ జవాబు చెప్పలేదు—

ఆగంతకుడు రోగి అని చంప గ్రహించింది గ్లాసుతో నీళ్లు తీసుకువచ్చి త్రాగించి, ఒంటిమీద చేయి పెట్టి చూసింది. శరీరం పెనంవలె వేగిపోతూ ఉంది.—"నువ్వెవరవు? ఎట్లా వచ్చావిక్కడికి?" అన్నది మళ్ళీ.

యువకుడు చెప్పినదానికి సారమిది—అతనిపేరు వనమాలి. మహీస్థలి వెళ్ళుతూ జ్వరం ఎక్కువకావటం చేత ఇక్కడకు వచ్చి పండుకున్నాడు. జ్వరం తగ్గిపోగానే వెళ్ళిపోతాడట.

మహీస్థలి రూపగ్రామానికి రెండు క్రోసుల దూరం ఉంటుంది. అతని చుట్టాలు ఎవరన్నా అక్కడ ఉన్నారేమో కబురు చేయవచ్చుననే ఉద్దేశంతో చంప "అక్కడ మీవారెవరున్నారు?" అని ప్రశ్నించింది

"ఎవరూ లేరు. దేవాలయం చూడ బోతున్నా."

చంప కొంచెం విసుగుగా అన్నది.—"అలాగా! మరి నిన్ను ఇక్కడ ఎవరు చూస్తారు? ఎక్కడనుంచి వచ్చావేం?"

"ఎవ్వరూ చూడ నక్కర్లేదు. జ్వరం తగ్గగానే నాతోవను నేను పోతాను. ఇక నువ్వు వెళ్ళిపోవచ్చు."

ఆ స్వరంలో కొంచెం తీవ్రత ఉన్న దని చంప గ్రహించింది ఇక ఆమె ఏమీ అడగలేదు తల దగ్గర గ్లాసుతో నీళ్లపెట్టి "పోతున్నా. దప్పిక అయితే తాగు" అని చంప లోనికి వెళ్ళిపోయింది.

రాత్రి తొమ్మిది గంటలకు చంప ఒక సారి బయటికి వచ్చింది. జ్వర తీవ్ర తలో వనమాలి అప్పుడు ఏదో అస్పు టంగా కలవరిస్తున్నాడు. చంప ప్రమా దాన్ని గుర్తించింది. ఆమె కేమీ పాలు పోవటంలేదు. ఇటువంటి స్థితిలోవున్న మనిషిని బయట ఉంచవచ్చా? మరి, ఒక అపరిచిత యువకునికి లోపల చోటు మాత్ర మెలా యిస్తుంది? ఆమె మన స్సులో ఈమాదిరి ద్వంద్వం జరుగుతూ ఉండగా లక్ష్మివచ్చి విషయమంతా విని--"ఇంకా ఏమిచేస్తావు? మధ్యయింటిలో తక్తా బల్లమీద పక్క వెయ్యి. పాపం ఎవరిపిల్లవాడో! ఆపదలో ఉన్నప్పుడు ఎక్కడ పారశేస్తాం?" అన్నది.

రెండో మార్గంకూడా కనపడలేదు చంపకి. పక్కవేసి, ఇద్దరూ చెరో రెక్క పట్టుకొని వనమాలిని ఇంట్లోకి తీసుకువెళ్ళి పండుకో బెట్టారు. ఆ రాత్రంతా మాడు మీద నీళ్ళుజల్లుతూ, విసనకర్రతో విస రుతూ చంప అలా కన్నుమూసి తెరచే వరకు బారెడు ప్రొద్దు ఎక్కింది.

ఇక ఆరోజు మరమరాలు వేపటం పడలేదు.

* *

మరునాడు కూడా జ్వరం అలాగే ఉన్నది. చంప, మొట్టమొదట "ఎందుకు వచ్చిన పీడా యిది" అని కొంత అయిష్టతగానే ఉన్నదిగాని మధ్యాహ్నం జ్వర ఉద్రేకంలో వనమాలి ఆమె చేయి పట్టుకొని "నీవు నా కోసం చాలా ప్రయాసపడుతున్నావు కాని నేను బ్రతికేటట్టు లేదు." అన్నప్పుడు ఆమె కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది. ఒక్క క్షణంలో తను పడే శ్రమా, ఇబ్బందులూ అన్నీ మరచిపోయి, "భయం ఎందుకు?



తప్పకుండా నయమవుతుంది. నీవు నిద్రపో నేను వైద్యుణ్ణి పిలుచుకొస్తాను" అన్నది

మూడుగంటల వేళప్పుడు వైద్యుడు వచ్చి, మందిచ్చి పథ్యం చెప్పి, చక్కా వెళ్ళిపోయాడు.

అయిదు రోజులు బేరం కట్టిపెట్టి, "విసుగూ, విరామం లేకుండా చంప వనమాలికి సేవ చేసింది. వైద్యుడొచ్చి ఇక ఫరవాలేదని చెప్పిపోయిన రోజున చంప ఆనందాశ్రువులు రాల్చింది. వనమాలి ఆమె చేయి పట్టుకొని అడిగాడు: "ఏడుస్తావెందుకు? నాకు నయమయిందిగా?"

చంప చేయి వదలించుకొని పథ్యం పట్టుకురావటానికి లోపలికి పోయింది.

పథ్యం పెట్టిన తరవాత వనమాలి అన్నాడు: "నీ ఋణం నేను తీర్చుకోలేను. భగవంతుడు—"

చంప మధ్యనే: "ఇప్పుడు నాకు వింటానికి తీరిక లేదు. వారం రోజుల నుంచి బేరం మూలపడ్డది ఇప్పుడే పోతో తున్నాను. నువ్వు బయటకు పోమాకు. ఇంటోనే వుండు ఈ మందు—" అని కాగితంలో పెట్టివున్న కణికతీసి చేతికిచ్చి "మధ్యాహ్నం తులసిరసంతో అరగదీసి తాగు. నేను స్నానంచేసి తులసి ఆకు యిచ్చిపోతాను" అన్నది.

ఆ వేళల్లా వనమాలి ఏమేమో ఆలోచించాడు. ఈ దరిద్ర స్త్రీ సంపాదన తను ఊరక కూర్చొని తింటున్నాడు. తను



ఈమెకు ఎవరు? ఇలా తింటం న్యాయం కాదు.

సాయంకాలం, చంప, రాగానే "జ్వరం రాలేదుగా?" అని అడిగింది.

రాలేదు అన్నట్టు తల తిప్పి, అన్నాడు —"చూడు, నేను పోవాలనుకున్నాను."

చంపముఖం గంభీరమైంది. సంధ్యాంధకారంలో వనమాలి అది కనిపెట్టలేదు. కాసేపు నిశ్శబ్దంగా ఉండి ఆమె అన్నది: "సరే, వెళ్ళండి! ఈ సంగతి నన్ను అడగటం ఎందుకు?"

మాటధోరణి అనుమతి సూచకంగా ఉండకపోవటం కనిపెట్టి వనమాలి ఇంకేమీ మాట్లాడలేదు. మాపున పాలు — బారీ తీసుకువచ్చినప్పుడు కూడా ఆమె ముఖముమీది నల్లని ఛాయ పోలేదు. వనమాలి ఒక్క గుక్కను గ్లాసు ఖాళీచేసి అన్నాడు "ఇదిగో, నీవు పేదదానివి. నన్ను ఇంకా ఎన్నాళ్ళు పోషిస్తావు? ఇప్పుడు నాకు బాగా నయమయింది. అందుకనే పోవాలనుకుంటున్నాను."

చంప వనమాలి ముఖంవంక చూపింది అతను పోదగినస్థితిలో ఉన్నాడనేసంగతి ఆమెకు కూడా తెలుసు. కాని

ఈ అసహాయుడైన అతిథిమీద ఆమె మనస్సులో ఏదో ఒక మూలను కాస్త మమత కూడుకున్నది. పౌమ్మనటానికి ఆమె మనస్సు ఏ మాత్రమూ ఒప్పుకోవటం లేదు. చాలాసేపు ఆలోచించి "రెండు పూటలూ అన్నం తిన మొదలెట్టగానే వెళ్ళిపోవచ్చు" అన్నది.

"సరే"నని వనమాలి పండుకొన్నాడు.

*　　　　*

ఆరోజున వనమాలి హారంవేసుకు కూర్చున్నాడు — మధ్యాహ్నం తనకు అన్నం పెట్టమని. మరీ ఘట్టిగా వద్దంటే అతను ఏమిభావిస్తాడో నని చంప సరే నన్నది. కాని ముఖభంగిమ మారిపోయింది. ఆ పూటంతా ఆమె వనమాలితో సరిగా మాట్లాడలేదు. వనమాలి ఇది గ్రహించాడు. కొన్ని దినాలనుంచి విడుదకుండా స్త్రీ సంసర్గంలో ఉండటంచాత స్త్రీ చిత్తవృత్తిని గ్రహించే జ్ఞానంకూడా అతనికి కొద్దిగా కలిగింది.

మధ్యాహ్నం చంప పొయ్యి రాజేసి ఎసరు పెట్టుతూ ఉండగా చంకను జోలి తగిలించుకొని, వైష్ణవు డొకడు వాకిట్లో నిలబడి కరుణాపూరితమైన కంఠంతో— "దోసెడు బియ్యం పెట్టు తల్లీ! వైష్ణవుణ్ణి. ఏకాదశిపూట పారణచేసుకుంటాను" అని యాచించాడు.

ఇవ్వాళ ఏకాదశి అని వినగానే చంప హృదయంలో భారం చాలా తగ్గిపోయింది. వనమాలివైపుకు తిరిగి "ఇవ్వాళ ఏకాదశి అన్న సంగతే మరచిపోయాను" అన్నది.

వనమాలి ఆ పూట అంతా చంప ముఖలక్షణాలు కనిపెడుతునే ఉన్నాడు. ఈ మాటలో ఉన్న అర్థాన్ని చప్పున గ్రహించి "అయితే ఇవ్వాళ తినను. దించేసెయి" అన్నాడు.

చంప ముఖం కళకళ్ళాడింది. "అయితే రొట్టెలు కాలుస్తాను, పాలల్లో నానవేసుకు తిందువుకాని. ఏమంటావు?" అన్నది.

వనమాలి మంచి పిల్లవానివలె "అలాగే" నన్నాడు.

బిచ్చగాడు ఆనాళ చంప ఇంట్లోనుంచి మూడు రోజులకు సరిపోయే గ్రాసం గుంజుకు వెళ్ళాడు.

మరునాడు భోజనం పెట్టమని వనమాలి పట్టుపట్టలేదు. బజారుకు వెళ్ళేటప్పుడు ఒక దస్తా రంగుకాగితాలు తెచ్చిపెట్టమని చంపను అడిగాడు. ప్రొద్దు కూకాక రంగు కాగితాలు తీసుకొచ్చి వనమాలికిస్తూ చంప: "ఇవ్వాళ అన్నం తింటావా?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు జవాబు వనమాలి చాలాసేపటి క్రిందనే స్థిరపరచుకొని ఉంచాడు. "వద్దు. ఇన్నాళ్ళు ఆగినవాణ్ణి ఎలానూ ఆగాను; పౌర్ణందాకా ఉంటాను" అన్నాడు.

చంప సంతపించింది.

చంప ఉదయం లేచి చూసేవరకు, ఇంట్లో ఏడెనిమిది కాగితపు పంజరాలూ,

వనమాలి రంగు రంగుల కాగితాలతో కొట్టునంతా రెండు రోజుల్లో అలంకరించి వేశాడు. దుకాణం అలంకరించటం పూర్తి అయ్యాక ఒకనాటి సాయంత్రం చంప తన పొరుగింటి మణివైష్ణవిని వెంటపెట్టుకొని దుకాణం చూట్టానికి వచ్చింది. అలంకారం అద్భుతంగా ఉంది. వేలకొలది రంగు రంగుల సీతాకోక చిలుకలు ఎక్కడినుంచో ఎగిరివచ్చి కొట్లో వాలినట్టుగా ఉంది. శిల్పిని ప్రశంసిస్తూ మణివైష్ణవి చంప చెవిలో "వీది మంచి అదృష్టమే చంపా! జాగర్త. పోగొట్టుకోనేవు!" అన్నది.

చంప ముఖం లజ్జచే కందిపోయింది.

చంప ఆరోజు ఇంటికి తిరిగేవచ్చే వరకు పొద్దుపోయింది. కొట్టుదగ్గరనుంచి సిద్ధాంతిగారి యింటికిపోయి దుకాణం పెట్టటానికి మంచిరోజు ఎప్పుడో కూడా కనుక్కొని వచ్చింది. పొట్లాలు కట్టటానికి పాత వార్తాపత్రికలు కూడా ఒక ఒక వీశెడు తీసుకువచ్చింది.

"ఈ కాగితా లెందుకు చంపా?" అన్నాడు వనమాలి.

"పొట్లాలకు కావద్దూ? అందరూ చెరగులోనే తీసుకుపోతారా సరుకు?"

చేయిచాచి వనమాలి "ఇలా యివ్వు. రాత్రికి చించి అట్టే పెడతాను." అన్నాడు.

"పగలంతా పనిచేసి మళ్ళీ రాత్రంతా మేలుకొంటావా?" అని చంప ఇంట్లోకి వెళ్ళింది.

భోంచేశాక చంప కాయితాలు చింపటానికి కూర్చుంది. కొట్లోకి కావలసిన యితర సామానులు రేపే కొనాలి. చంప చేతిలో కత్తెర ఆడుతూ ఉన్నది. మనస్సు మాత్రం ఎక్కడెక్కడో విహరిస్తూ ఉన్నది. తన మరమరాల దుకాణం మారి పెద్ద మిఠాయి అంగడి అయింది. దుకాణం ముందు చాలామంది బేరగాళ్ళున్నారు. గుమాస్తా బేరం అమ్ముతూ ఉన్నాడు. వనమాలికి చిన్న బొజ్జకూడా వచ్చింది. ఖాతా పుస్తకాలు ముందు వేసుకొని లెక్కలు చూసుకొంటున్నాడు. తాను పంచపాళీలో కుర్చుని బంగరపు తీగతో చుట్టిన తులసిమాల తీసుకొని జపంచేస్తూ ఉన్నది. ఇలాంటి వింకా ఎన్నో సుఖస్వప్నాలు శరన్మేఘాలవలె ఆమె మనోగగనం మీదుగా ఎగిరి పోతున్నాయి.

హఠాత్తుగా వనమాలిబొమ్మని చూచి చంప చకితురాలయింది. వార్తాపత్రికలో వనమాలి బొమ్మ ఎందుకున్నది? చప్పున దీపాన్ని ఇంకా కొంచెం దగ్గరకు లాగి చిత్రంక్రింద రాసిఉన్న నాలుగు పంక్తులూ చదివింది. ఆ మరునిముషంలో ఎక్కడినుంచో అంధకారపువరద ఒకటి వచ్చి ఆమె దుకాణాన్నీ, ఇంటినీ ఊడ్చుకుపోయింది. ఇక మిగిలింది వనమాలి బొమ్మా, కొన్ని పంక్తుల అక్షరాలూ. చంపా! చంప రెండు చేతులూ హృద

యానికి హత్తుకొని నిట్టూర్చి అస్ఫుటంగా "అబ్బ!" అన్నది.

బెంగాలీ పత్రికలోని ప్రకటన పేజీలో వనమాలి బొమ్మ. దానిక్రింద ఈ విధంగా రాసి ఉంది:

"నా తమ్ముడు శ్రీ వనమాలీ వసు ఆరుమాసాల క్రితం ఇంటినుంచి వెళ్ళిపోయాడు మా తల్లి ఆతనికోసం బెంగ పెట్టుకొని నిద్రాహారాలు వదలివేసింది ఆమె బ్రతుకుతుందనే ఆశ లేదు. శ్రీవారు మామూలు కారణానికే అలిగి ఇంటినుంచి వెళ్ళిపోయారు. ఆతనిజాడ చెప్పినవారికి అయిదువందల రూపాయలు బహుమానమిస్తాము—శ్రీ కన్నయలాల్ వసు—బర్ద్వాన్."

తెల్లవారవచ్చినప్పటికీ పత్రికముందు చంప ప్రతిమవలె అలానే కూర్చుని ఉంది. కాకుల అరుపులు విన్నాక ఆమెకు పూర్వజ్ఞానం మళ్ళా వచ్చింది. లేచి నిలబడి చాలాసేపు ఏ మాలోచించుకొన్నదో ఆమెకే తెలియాలి. తర్వా ఆ ప్రక్క గ్రామంలో పోస్టుమ్యానుగా ఉన్న తన మేనమామకొడుకు వద్దకు పోయింది.

వనమాలి లేచి ముఖంకడుక్కొని వరండాలో చాపవేసుకుని కూర్చుని వుండగా చంప తిరిగి వచ్చింది. వనమాలి ఆమె ముఖంవంక చూసి "ఏమిటి చంపా అలా వున్నావు?" అన్నాడు.

చంప పళ్ళతో పెదవి బిగబట్టి "ఏమీ లేదు" అని మరమరాలు అమ్మకు రావాలనే నెపంతో బజారుకు వెళ్ళి సా యంత్ర తిరిగివచ్చింది.

వనమాలి చాలా ఉద్వేగంతో ఆ పగలంతాగడిపి సాయంకాలం వాకిట్లో నిలబడి చంపకోసం ఎదురు చూస్తున్నాడు చంప కనపడగానే "ఇవ్వాళ పగలంతా నువ్వు కనబడకపోయేవరకు పిచ్చివాడిమల్లే తిరిగాను!" అన్నాడు.

ఈ మాటకు చంప కళ్ళల్లో నీరు తిరిగింది. తన్ను ఏదో విధంగా సంబాళించుకుని "ఇవ్వాళ రత్నపురం వెళ్ళాను" అని జవాబిచ్చింది.

"అయితే ఇవ్వాళ పగలంతా ఉపవాసమేగా! చేతులూ, కాళ్ళూ కడుక్కో: తిండువుకాని అన్నం, కూరా మూతపెట్టి వుంది. నేను ఒకమాటు దుకాణం చూసి వస్తాను" అని వనమాలి వెళ్ళిపోయాడు.

చంప కాసేపు పైటపరచుకొని అరుగు మీదనే పడుకొన్నది. తర్వాత తులసికోట దగ్గర దీపం వెలిగించి అన్నం వడ్డించుకు కూర్చున్నది.

వనమాలి తనకోసం అన్నం వండి పోయాడు! ఇంతకంటే విధి వైపరీత్యమేముంటుంది? ముద్ద నోట్లో పెట్టుకోగానే ఆమెకు ఏడ్పు వచ్చి పొర పోయింది. వెంటనే ఆమె అన్నపుపళ్ళెం మూతవేసి లేచింది.

ఇక ఆ పూట భోంచేయలేదు.

ఈ రెండుమూడు రోజులనుంచీ చంప

యువ




యింత దిగులుగానూ, గంభీరంగానూ ఎందుకు ఉంటుందో వనమాలికి తెలియ లేదు. నాలుగోనాడు భోజనమయ్యాక చంపను అడిగాడు: "ఏం? ఇవ్వాళేకదూ దుకాణం తెరిచేది! అంతా నాకు తెలియ చెప్పవేం?"

చంప ఏదో చెప్పబోయి ఆగిపోయింది. కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి "ఇవ్వాళ కాదులే" అని అన్నది.

"ఎందుకని? దసరా దగ్గరకు వచ్చే సింది, ఇప్పటినుంచీ పెట్టకపోతే తీరా ఆ సమయంలో ఏమిచేయగలం? కనీసం దుకాణం ఉన్నదన్న సంగతైనా కొనే వాళ్ళకి తెలియాలిగా!"

చంప తులసి కోటదగ్గర అలుకుతూ ఉన్నది. హతాశతో కూడిన ఉదాసీన స్వరంతో మెల్లగా "ఇంకా దుకాణమే!" అని అనుకున్నది.

వనమాలికి వినపడలేదు. తిరిగి అలాగే ప్రశ్నించాడు. చంపలేచి "దుకాణంసంగతి దేవుడికి తెలుసు! నీవిక నన్నేమీ అడగ వద్దు" అన్నది.

వనమాలికి ఈ మాట ఏమీ అర్థంకాక పోయినా, చంప ముఖంవంక చూడగానే మళ్ళీ ప్రశ్నించాలనే ఆతురత అతనిలో అంతరించింది.

మధ్యాహ్నం చంప ఇంట్లో కూర్చుని ఏదో కుట్టుకుంటూ ఉన్నది. వనమాలి బయట అరుగుమీద కాళ్ళు వేలాడవేసి కూర్చుని, త్వరగా దుకాణం పెట్టటంవల్ల కలిగే లాభాలను గురించి ఉదాహరణలిస్తూ అనర్గళంగా వాగుతున్నాడు. ఈ సమయాన బయట వాకిలిదగ్గర ఎవరో కేకవేశారు: "చంపా వైష్ణవి ఇంట్లో ఉన్నదా?"

చంప జవాబివ్వకముందే ఒక నడికారు పెద్దమనిషి ఒక ముసలమ్మను వెంటపెట్టు

కొని ఇంటి ముంగిలిలోకొచ్చి నిలబడ్డాడు అకస్మాత్తుగా అన్ననూ, తల్లినీ చూచి వనమాలి విస్తుపోయాడు. ముసలమ్మ వనమాలిని కావిలించుకొని పెద్ద పెట్టున ఏడ్చింది చంప ఏమీ మాట్లాడకుండా బయట అరుగుమీద చాపపరచి పోయింది.

* *

బయట ఎద్దుబండి నిలబడి ఉన్నది. చంప వంట ఇంట్లో కూర్చుని వంట చేసుకోవటానికై పొయ్యిమీద ఎసరుపెట్టి పొయ్యిముందు కూర్చుని ఉంది. చాల ఆత్రంతో వనమాలి ఇంట్లో ప్రవేశించి "నేను పోతున్నా. కాని నా దగ్గర ఎందుకిలా చాతుర్యం చూపించావు? నేనుంటం నీ కిష్టంలేదు గనక నే నేను పోతున్నాను!" అన్నాడు

వనమాలిని చూసి చంపలేచి నమస్కారం చేసి దూరంగాపోయి నిలబడ్డది. వనమాలి ఆరోపించిన నేరానికి ఆమె ఏమీ జవాబు చెప్పలేదు. ఒక్కసారి మాత్రం అతనివంక చూసింది. ఆ సజల నేత్రాలలోని వ్యధను వనమాలి అర్థం చేసుకోలేదు. శ్లేషగా అన్నాడు: 'అయిదు వందల రూపాయలకు లోభించావను కుంటా!'' అన్న చేసిన ప్రకటన అతను చూశాడు.

వనమాలి మాటకు చంప కళ్ళల్లో అగ్నిజ్వలించింది. ఆమె ఏదో అనబోతూ ఉండగా "చంపా, మా తల్లీ! ఎక్కడ ఉన్నావు?" అంటూ వనమాలి తల్లి ఆ ఇంట్లో ప్రవేశించి చంపను కౌగలించుకొని "నేను వెళ్ళుతున్నా నే తల్లీ: ఈ ముసలిది పోగొట్టుకున్నవిధిని మళ్ళీ సమర్పించావు! నీకు అక్షయ వైకుంఠం కలుగుతుంది! ఇంకా ఏం చెప్పేది? ఈ ముసలిదాన్ని బ్రతికించావు. ఈ బ్రతికిన నాలుగు దినాలూ నీ పేరుతో నారాయుడికి తులసీ దళం అర్పిస్తాను. ఇదిగో తీసుకో. ప్రపంచంలో అనేక అవసరాలు కలుగుతూ ఉంటవి. దగ్గర ఉంచుకో!'' అని అనేక ఆశీర్వాదాలతోపాటు ఒక చిన్న సంచి కూడా ఆమె చేతిలోపెట్టి వెళ్ళిపోయింది. చంప రెప్పవాల్చకుండా సాగిపోతూ ఉన్న ఎడ్లబండివంక చూస్తూ నిలబడింది. ఇంతలో మణి వైష్ణవికొడుకు మాణిక్యం వచ్చి "అక్కయ్యా?'' అని పిలిచాడు.

చంప ఇంటికి ఎవరు వచ్చారో తెలుసుకురమ్మని మణి అతన్ని పంపించింది

మాణిక్యాన్ని చూడగానే చంపకు మళ్ళీ స్పృహ వచ్చింది. దీర్ఘ నిశ్వాసం విడిచి "కృష్ణ, కృష్ణ!' అన్నది

తరవాత వంట ఇంటి తలుపు మూయటానికి పోయి గుప్పటిలో ఉన్న సంచిని చూచుకొన్నది. తెరిచిచూస్తే వంద రూపాయల కాయితాలు అయిదు ఉన్నవి బహుమతి! వెటకారంతో కూడిన నవ్వు ఆమె ముఖంమీద చిగురించింది—"కొ చెంఅగు మాణిక్! బండి ఎంతదూరం




పోయిందో చూసి వస్తాను.''

*  *

బండి ఊరిబైటకు పోయేవరకూ మాణిక్యం రొప్పుతూ రోస్తూ పరిగెత్తుకు వచ్చి ''బండి కాస్త ఆపండి'' అని అన్నాడు.

కన్నయలాలు తల బయటకుపెట్టి ''ఎవరు?'' అన్నాడు.

''నా పేరు మాణిక్యఘోష్. ఇదిగో తీసుకోండి. చంపక్కయ్య మీ కివ్వమని పంపింది'' అని ఆ సంచి బండిలో పార వేసి అడ్డదోవను అదృశ్య మయ్యాడు.

వనమాలి ''ఏమిటి అన్నాయ్!'' అని అడిగాడు.

''ఆ నోట్లేనమకుంటా. మళ్ళీ తిప్పి పంపించింది'' అన్నాడు, కన్నయలాల్.

ఒక్క క్షణకాలం వనమాలి చక్షువులు విస్మయంతో విస్ఫారితమై మరుక్షణాన్నే జలంతో నిండిపోయాయి.

*  *

చంప నేడు కూడా బుట్ట నెత్తిన పెట్టుకొని మరమరాలు అమ్ముతూ ఉంటుంది. ఆ దుకాణం తలుపు మాత్రం తాళంవేసి ఉన్నది. కాని చంప ప్రతి మాసం దానికి అద్దె చెల్లిస్తూ ప్రతి మాపూ దాంట్లో నందెదీపం వెలిగిస్తూ ఉంటుంది. ఎందుకు యిలా చేస్తున్నదో మాత్రం ఎవ్వరూ చెప్పలేకుండా ఉన్నారు.

## ఏప్రిల్ నెల

# భావ పరిచయ పోటీ

**బహుమానం రూ. 10-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు మార్చి 5 వ తేదీలోగా చేరాలి యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుములేదు.




అన్నయ్య చెప్పిన కథ:—

కొత్త కథ రాయటానికి కూర్చున్నాను. ఇంతలో వాకిలి తలుపు చప్పుడయింది. ఈవేళప్పుడు వచ్చింది ఎవరనుకొంటూ వెళ్ళి తలుపు తీశాను.

అన్నయ్య!

తలుపుతీయగానే సుడిగాలిలా లోపలికి దూసుకువచ్చాడు. ఎండకి ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది.

"ఇదేవిటి—ఈవేళప్పుడు వచ్చావే. మంచినీళ్ళివ్వనా?" అన్నాను వెనక్కి తిరుగుతూ.

"ఏం అక్కర్లేదుకాని, నువ్వు కథలు రాస్తావా నిజంచెప్పు చెల్లమ్మా" అన్నాడు రుమాలుతో చెమట తుడుచుకొంటూ.

అంత హఠాత్తుగా దాంతో ఏం అవసరమొచ్చిందో. అసలా విషయం ఎవరు చెప్పారో నా కర్థం కాలేదు.

"అది అడిగేందుకా యింత ఎండలో పడొచ్చావ్" అన్నాను.

"అయితే అయింది కాని, నువ్వు నిజంగా కథలు రాస్తావా చెప్పు" అన్నాడు.

"ఇప్పుడదే చెయ్యబోతున్నాను" అన్నాను. అన్నయ్య ముఖం ఒక్కసారి వెలిగింది.

"అయితే కూర్చో చెల్లమ్మా. నీకో విషయం చెప్పాలి" అన్నాడు తనొక కుర్చీ లాక్కుని కూర్చుంటూ.

చెప్పమన్నట్లు అన్నయ్య ముఖంలోకి చూస్తూ, నేనూ టేబిల్ముందర కుర్చీ లాక్కుని కూర్చున్నాను.

"ఇది నాకథే చెల్లమ్మా. నువ్వు తప్పకుండా రాయాలి. రాస్తావుకదూ!" అని ప్రాధేయపడుతున్నట్లు చూశాడు. అలాగే అన్నట్లు బుర్ర వూపాను.

"మొదట్లో—అంటే బిజినెస్ ప్రారంభించకపూర్వం నేనేం చేసేవాడినను

కొంటున్నావ్?'' అని అడిగాడు కుతూహలంగా.

"బహుశ ఎవరిదగ్గరనైనా అసిస్టెంట్‌గా వుండివుంటావ్'' అన్నాను పెద్దగా నవ్వేసు.

'కూలిచేసుకు బతికేవాడివి" అన్నాడు

షాక్ తిన్నట్లు అయ్యాను. ఊళ్లో అందరికంటె ధనవంతుడు అన్నయ్యే యిప్పుడు

''మరి బిజినెస్ ఎలా మొదలుపెట్టా వనుకొంటున్నావో'' అని అడిగాడు లేచి ఫాన్ ఆన్‌చేస్తూ.

చిరునవ్వుతో బుఱ్ఱ అడ్డంగా వూపాను తెలీదన్నట్లు.

''సౌభాగ్యంతో. అది రావటంతో నే నా బిజినెస్ మొదలయింది.''

"కట్నమిచ్చుంటారు"

మళ్ళీ నవ్వాడు అన్నయ్య. కూలి చేసుకొనే వాడికి కట్నమెవరిస్తారు చెల్లమ్మా! పిల్లనిస్తేచాలు. అదీ జరగలేదు" అన్నాడు.

"వాళ్లు చెయ్యకపోతే సౌభాగ్యమే వచ్చేసివుంటుంది" అన్నాను.

''అంటే నిన్ను ప్రేమించిందంటావా?"

''కాక, నాల్గురోజులు వుండిపోదామని వస్తుందా?'' నవ్వుతూ అన్నాను.

''అదంతా సరేగాని, సౌభాగ్యం నన్ను ద్వేషించినంత ఈ ప్రపంచంలో ఎవర్నీ ద్వేషించదు" అన్నాడు టేబిల్‌మీదకు వంగి కుతూహలంగా నా ముఖంలోకి చూస్తూ.

''అందుకనేకదూ, 'సౌభాగ్యం నా జీవనభాగ్యం' అని రోజుకి పదిసార్లన్నా అనుకొంటావు'' అన్నాను నవ్వుతూ.

నవ్వాడు "ఇదిగో చెల్లాయి, నీకు జీవితానుభవం తక్కువ. నేచెబుతా విను. ఈ ప్రపంచంలో తనకోసం లోకంకోసం అని రెండురకాల బతుకులు బతికేవాళ్ళే ఎక్కువ. రెండూ ఒక్కటిగా బతికే వాళ్ళని చేతకాని వాళ్ళకిందే పరిగణిస్తారు. ఇంతకీ నే చెప్పింది తెలిసిందా చెలమ్మా! అలా రెండురకాల బతుకులు బతికేవాళ్ళ జాబితాలో మొదట మమ్మల్ని జేర్చు"

''నా కర్థం కావటంలేదు'' అన్నాను.

''అర్థమయ్యేట్లు చెబుతావిను. సౌభాగ్యమే కనుక నన్ను హీనంగా చూడకుండా వుండినట్లయితే, ఈ నాడు యిలా ఉండేవాడ్ని కాదేమో" సాలోచనగా అగాడు.

''హీనంగానా? ఎందుకని?''

''ఆవిడ రోజూ ఆ దోవంబడి వెళ్ళేది. చూస్తూనేవుండేవాడ్ని. ఒకరోజు—సరదాగా ఆవిడ దోవకి అడ్డం పెడితే ఏం చేస్తుందో చూద్దామనిపించి, వెళ్ళాను. ఆవిడ సౌందర్యాన్ని చూసి మతిపోగొట్టుకొన్నానని పోటీకొచ్చినట్లు వాగింది, తన అంతస్థుకి నా అంతస్థుకి వేలెత్తిచూపుతూ హీనపరిచింది. సహించలేకపోయాను. కష్టపడి బతికేవాడు చేసేది ఎలాంటి కష్ట



యువ




మైనా. గౌరవనీయుడే! ఆ భావం చిన్నప్పుడే నాలో మానాన్న కలిగించాడు అందు నే సౌభాగ్యం ఆటంటే సహించలేక పోయాను. విరవీగినందుకు ఫలితం అనుభవించింది. కొన్నాళ్ళకు తల్లిని కాబోతున్నా నంటూ వచ్చి పాదేయపడ్డది. కసిదీరా ఆనందించాను. నాకు తెలీకుండానే జాలిపడ్డాను కూడా. ఫలితం — పెళ్ళి చేసుకొన్నాను.

"ఆవిడకు తల్లీ-దండ్రీ లేరా? వాళ్ళ ప్రమేయమేం లేకుండా పోయిందా — అన్నయ్య చెబుతున్నదెందుకో నాకు కథలాగా అనిపించింది, వాస్తవం అనిపించలేదు.

"ఉన్నారు. వాళ్ళ కూతురు చేసిన పనికి తలెత్తుకోలేక ఊరొదిలి దూరంగా వెళ్ళిపోయారు. ఉన్నవాడే వాళ్ళ నాన్న. గుట్టు చప్పుడు కాకుండా కానిచ్చేస్తాను, వాడి పేరు నలుగురికీ రానివ్వకు అన్నాడట. ఒప్పుకోలేదు సౌభాగ్యం' అని ఆగాడు.

"తిరగవాత' అన్నాను.

"ఏముంది, నా దగ్గరకు వచ్చి పెళ్ళి చేసుకుంది. తన నగలమ్మి ముందు కిళ్ళీ కొట్టు పెట్టాను. చుట్టుపక్కలెక్కడా పెదే కొట్టు లేకపోవడంతో బాగా లాభం వచ్చింది. అలా.... అలా.... యిప్పుడింత

వ్యాపారినయ్యాను. ఈ మధ్యలో మాకు మా యిష్టాలతో ప్రమేయం లేకుండానే మరో యిద్దరు పిల్లలు పుట్టారు. ఆవిడ కిష్టంలేనిది చేసి ఆనందించడం అలవాటయి పోయింది. అందగత్తెనన్న అహం ఆ సౌభాగ్యం ప్రతి కదలికలోనూ పెళ్ళయ్యాక కూడా కనిపించేది. ఎంత అందగత్తెవైనా నువ్వు ఆడదానివి, మొగాడికి లోకువన్న విషయం గుర్తుంచుకో అన్నట్లుగా ప్రవర్తించేవాడ్ని నేను. నా ఇష్టం వచ్చినట్లు తిరిగేవాడ్ని. సౌభాగ్యం ఇల్లు కదలకుండా కట్టడి చేశాను."

"ఏమయినా జరిగింది జరిగిపోయింది. కట్టుకొన్న పెళ్ళాన్ని అంతలా హింసించడం నీకు క్షంతవ్యం కాదు" అన్నాను.

"ఆ ఆలోచన సౌభాగ్యానికీ వుండాలిగా మరి. జరిగింది జరిగిపోయిందని, కట్టుకొన్న మొగాడికి నాతో అందరి ఇళ్లాళ్ళలా మసలగలుగుతూంటే నా బతుకు ఈనాడు వేరోలా వుండి ఉండేది" అన్నయ్య గొంతుకలో బరువు గమనించాను.

కాని ఆవిడకది ఏకోశానాలేదు. ఇప్పటికీ అంతే! నలుగుర్లో ఉంచేమటుకు నా మొగుడంకటివాడు లేడు. ఒంటరిగావుంటే ఛీత్కారాలు. అంతేకాదు చెల్లమ్మా—నువ్వు నా బతుకు నాశనం చేశావు. నేను నీ అంతం చూస్తాను అంటుంది.

దాని అంతం అలా చెరలా ఆ ఇంట్లో అయిపోవడం నేను చూడాలి. అదే నా కోర్కె. పిశాచిలాంటి ఆడది."

"ఊరుకో అన్నయ్యా!" అన్నాను.

"అంతేనమ్మా చెల్లాయ్! అందులో అబద్ధమేం లేదు. ముగింపు నీకే వదిలేస్తున్నాను. ఎలా చేసినాసరే. నీ అన్నయ్య కోసం కాస్త శ్రమపడి అది కథమటుకు రాయాలి' అంటూనే నే పిలుస్తున్నా వినిపించుకోకుండా వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోయాడు. అతడి నెరసిన తల వెంట్రుకలు తమాషాగా గాలికి కదులుతూంటే, అది కనిపించనంతసేపూ చూస్తూనుంచుండి పోయాను.

సౌభాగ్యం చెప్పిన కథ:—

అన్నయ్య చెప్పిన విషయాలు ఆలోచిస్తూనే సాయంత్రంవరకూ గడిపేశాను. ఒకసారి వెళ్ళి సౌభాగ్యాన్ని కలుసుకు రావాలనిపించింది. కాఫీ కాచి ఫ్లాస్కులో పోసి ఎమురుగుంశా టేబిలుమీద పెట్టాను. టిఫిను ప్రమేయం పెట్టుకోలేదు. అయినా ఈ విషయం సౌభాగ్యందగ్గర ఎలా కదపాలో తెలీలేదు. నాకథపడ్డ "మాగజైన్" ఒకటి తీసుకొని, ఇంటికి తాళంవేసి, పక్కింటివాళ్ళకి తాళంచెవిచ్చి బయల్దేరాను.

గుమ్మం కర్టెను తొలగించి లోపల అడుగు పెట్టాను నన్ను చూడగానే సౌభాగ్యం కళ్లు తళుక్కుమన్నాయి. "నువ్వు కథలు రాస్తావా? మీ అన్నయ్య చెప్పారు. ఇన్నాళ్ళూ నాకు చెప్పలేదేం?"



అన్నది సంభ్రమంగా నా రెండు చేతులూ పట్టుకొంటూ.

"అందుకే వచ్చాను. నువ్వే అడిగావు" అన్నాను చేతిలో పత్రిక సౌభాగ్యానికి యిస్తూ.

ఆ పత్రిక నిర్లక్ష్యంగా టేబిల్ మీద పడేస్తూ అన్నది:

"ఈ విషయం తెలిసిన దగ్గర్నుంచి నేను ఆగలేకుండా వున్నాను. నువ్వు నా కథ రాసిపెట్టాలి."

నవ్వు దాచుకొంటూ అన్నాను. "అందరికీ కథలేనా?" అని.

"అందరి కథలాంటిది కాదు నాది. అందరి బతుకులాంటిది కాదు. రాసి తీరాలి నువ్వు. ఈ నిజం నువ్వు లోకం ముందర పెట్టి, ఆడదాని బతుకు ఎంత హీనంగా వుంటుందో లోకానికి చెప్పాలి" అన్నది.

అన్నయ్య చెప్పిన కథ ఒకమూల మనసులో మెదులుతూనే వుంది. "అన్నయ్యని కట్టుకొన్న నీ బతుకు హీనమా? అసంభవం" అన్నాను కుర్చీ లాక్కుని కూర్చుంటూ.

నా ముందుగా కుర్చీ లాక్కుని కూర్చుంటూ అంతకంటె పెద్ద గొంతుకతో అన్నది సౌభాగ్యం

"అన్నయ్యని కట్టుకొన్నా కాబట్టే నా బతుకిలా మాడి మసిబొగ్గయిపోయింది. మీ అన్నయ్యలాంటివాళ్ళు వుండకూడదు. కాదు వుండనివ్వకూడదు."

"అన్నయ్యలో చెడు అలవాట్లు వున్నాయి. కాదనను. కాని అన్నయ్యలో మంచితనం వుంది. దాన్నెవరూ కాదనలేరు" అన్నాను గొంతు తగ్గించి, చాలా సౌమ్యంగా.

"ఏవిటీ మంచితనం? ఆడదాని బతుకుతో ఆటలాడుకోవడమా? అయినింటి ఆడపిల్లని నిస్సహాయస్థితిలో కమ్మా

మిన్నూ కానకుండా బలవంతం చేయడం మంచితనమా? మంగళసూత్రమంటూ మెడకొక వురితాడు బిగించి. అన్నీ వుంచి కావలసిన స్వేచ్ఛలేకుండా చేసి బంది ఖానాలో పెట్టినట్లు వుంచడం మంచి తనమా?" సౌభాగ్యం ముఖం ఎఱ్ఱగా కందిపోయింది. మెడదగ్గర నరాలు వుబ్బాయి సాలోచనగా చూస్తూ మాట్లాడకుండా వూరుకొన్నాను.

"ఏం మాట్లాడకుండా వూరుకొన్నావేం. అన్నయ్యా — అన్నయ్య మంచితనం గురించి?" తలెగరేసి రెట్టించింది.

"అన్నయ్యమీద అబద్ధం చెప్పాల్సిన అవసరం నీకులేదని నాకు తెలుసు. కాని ఏ పరిస్థితిలో అన్నయ్య అలా చేశాడో నాకు తెలీదు." అన్నాను.

"పరిస్థితి" హేళనగా నవ్వింది సౌభాగ్యం. "పరిస్థితి వేరే ఏం కావాలి అతనికి మొగాడికి? అందమైన ఆడదాన్ని చూడగానే మతిపోయింది. మనిషి నన్న జ్ఞానం కూడా పోయింది. దాంతో బాసే తప్పు ఎవరిదైనా ఫలితం స్త్రీమీదే వేస్తుంది ప్రకృతి. అదే జరిగింది. ఫలితం వివాహం జరిగింది.

"అమ్మాయీ ఈ పూటకి కూర" అంటూ చీరకొంగుకి చేతులు తుడుచుకొంటూ వచ్చింది పనిమనిషి.

"చావు. ఏదో ఒకటి చావు. ఏది లేకపోతే కావాలని మారాం చేసినవాళ్ళకి యింత గడ్డి పెట్టు". సౌభాగ్యం ఒళ్ళెరగకుండా అరుస్తూంటే పనిచేసేది బిత్తరపోయి. మెల్లగా అవతలకు వెళ్ళిపోయింది. సౌభాగ్యంకూడా లేచివెళ్ళి తలుపు బోల్టు బిగించి వచ్చింది.

"అంత అయిష్టత వున్నప్పుడు నువ్వీ వివాహప్రసక్తి పెట్టుకోకుండా వుండాల్సింది. పొరబాటు చేశావ్" అంటూండగానే—

"అంటే సంఘం ముందర నన్ను దోషిగా నిలబెట్టమనా నీ వుద్దేశ్యం?" నా కళ్ళలోకి గుచ్చిచూస్తూ అన్నది.

"అబ్బే అదికాదు నా వుద్దేశ్యం— దానికి యింకేదో మార్గం" నామాట పూర్తికాలేదు—

"అంటే భ్రూణహత్య చేయమనా నీ వుద్దేశ్యం?" ధిక్కరిస్తున్నట్లు అన్నది.

"పెద్దపాపని చూశావు కదూ. దాని అందం. తెలివితేటలూ" అడ్డుతగులుతూ అన్నాను.

'ఆమాట అనడంలేదు సౌభాగ్యం. ఆ ఒక్కబిడ్డ నీకు బరువుకాదు. గుండె రాయిచేసుకొని...."

"పుట్టాక కాదు, పుట్టకముందే బరువు. నాకు కాదు, నా తలిదండ్రులకి. వాళ్ళ పరువు మంట కలసిపోతుందని వాళ్ళ భయం. వాళ్ళు చెప్పిన మార్గం నేనొప్పుకోలేదు. ఎందుకు ఒప్పుకోవాలి? ఆ మగాడ్ని వాడి దోవన ఎందుకు వదిలిపెట్టాలి? నా బతుకు నాశనం చేసినవాడ్ని తన బతుకు నాశనం చేయందే వదలను.




పగ, పగ. అందుకే కాళ్ళా వేళ్ళా పడి పెళ్ళి చేసుకొన్నాను''

''అన్నయ్య చేసుకోననంటే ఏం చేసు దేవానివి'' అప్రయత్నంగా అనేశాను.

''చేసుకోనని ఎలా అంటాడు? అందమైన ఆడది తనకి తానుగా వచ్చి కాళ్ళమీద పడుతూ ఉంటే'' సౌభాగ్యం గొంతులో హేళన

'సరే చేసుకొని నువ్వేం సుఖపడ్డావ్'' అన్నాను కనబరచకుండా.

'సుఖపడటానికి చేసుకోలేదని మొదటే చెప్పాను. పగ తీర్చుకోవాలని చేసుకొన్నాను' అన్నది కళ్ళలో ప్రతీకారవాంఛ ప్రతిబింబిస్తూ ఉంటే.

''అన్నయ్య తప్పుచేశాడు నిజమే। కాని మీరు ఆలుమగలు అయిన తరువాతైనా పాతపగలు మరచిపోవాల్సింది. అలా అయుంటె అన్నయ్య నిన్ను నెత్తినపెట్టుకొని చూస్తుండేవాడు ఇంతగా బజారు సరకుకు పరుగెత్తేవాడు కాదు'' అన్నాను సౌభాగ్యం వంక చూసి.

''నేనిక్కడకు వచ్చింది పగ తీర్చుకోడానికి మాత్రమే. అదిమటుకే చేసుకొంటాను. అంతవరకే నా కర్తవ్యం. ఆ మనిషి ఎంతగా నాశనమయితే నాకంత సంతోషం'' అన్నది.

''ఈ ధోరణి మార్చుకోలేవా సౌభాగ్యం? నువ్వు మారితే తప్పకుండా అన్నయ్యకూడా మారుతాడన్న నమ్మకం నాకుంది'' బతిమాలుతున్నట్లు సౌభాగ్యం కళ్ళల్లో కళ్ళు కలిపి అడిగాను.

''ఈ మనసెప్పుడో పాషాణమైపోయింది. ఇందుకో మారేందుకేమీలేదు'' అన్నది నిర్లక్ష్యంగా ఎటో చూస్తూ హఠాత్తుగా చూపులు నామీదకు తిప్పి

అన్నది

"నువ్వు యిలా మీ అన్నయ్యతో పూసకుతిరుగుతూంటే లోకం ఏమనుకుంటోందో ఎన్నడైనా గమనించావా." అని ఎందుకో నాకు ఫక్కుమని నవ్వువచ్చింది. కృష్ణశాస్త్రి గుర్తొచ్చాడు.

"నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు" అన్నాను.

"మాపని చేసేవాళ్ళు అనుకొంటూంటే విన్నాను." మొగాడు చేతకానివాడై నప్పుడు ఆడది ఎలాగన్నా తిరుగుతుందని! ఈసారి అలాంటి మాటలు అంటే చెప్పు తీసుకుంటా. నోరు మూసుకోమన్నాను. నలుగురూ అంటూంటె అన్నాను. ఉత్తినే మా కెందుకొచ్చిన గొడవ— అన్నారు" అన్నది.

"లోకం వున్నదెప్పుడూ చూడలేదు. పోనీవ్! నమ్మవలసినవాళ్ళు నన్ను నమ్మారు. చాలు" అన్నాను తృప్తిగా. సౌభాగ్యం మెదలకుండా వింటూ కూర్చుంది. కాసేపాగి హఠాత్తుగా నా రెండు చేతులూ పట్టుకొని "ఏమైనా సరే నువ్వు నా కథ రాయాలి. తప్పదు" అన్నది.

"ఏమని రాయమంటావు?" అని అడిగాను.

"చెప్పాగా. ఆ మనిషిమీద పగతీర్చుకోడానికే యింకా ఈ ఇంట్లో వున్నాను. ఈ ఇంట్లోంచి బయటపడాలనుకొంటె ఏదో ఒక సమయంలో పడలేకపోను. బైటపడి నేను చేసేదేమిలేదు. ఈ ఇంట్లో వుండే సాధిస్తాను. ఇది నువ్వెలా రాసినా సరే. ఎలా మొదలుపెట్టినా. ఎలా ముగించినా సరే" సౌభాగ్యంలో మళ్ళీ వుద్రేకం పెరుగుతోంది.

"అలాగే" అన్నట్లు తల పంకిస్తూ. "సాటిస్త్రీగానైనా నువ్వు కోరింది చెయ్యటానికి ప్రయత్నిస్తాను" అంటూనే తలుపుతీసుకు బయటపడ్డాను సౌభాగ్యానికి యిక మాట్లాడేటందుకు అవకాశం యివ్వకుండా. అప్పుడే ఆటలు ముగించి వస్తున్న పిల్లలు వెంటపడ్డారు. కాని వాళ్ళను పట్టించుకోకుండా వీధిలోకి వచ్చి నడక సాగించాను. నా బుర్ర నిండా ఒకటే సమస్య. దీనికి ముగింపు ఏమని చెయ్యను?

అన్నయ్య. సౌభాగ్యం. నేను ఎక్కడెక్కడో పుట్టాము. ఒకచోట కలుసుకొన్నాము. వాళ్ళ యిద్దరికీ మనసులో మనసునై అల్లుకుపోయాను. ఇప్పుడు వాళ్ళకథకు నేనెలాంటి ముగింపు యివ్వాలి?





# మెట్ట వేదాంతం

— పానగ్రాం —

## 2

ప్రాణకాంతుడు పొరపడుతున్నాడని నా నమ్మకం. గణేశుడు పాపులర్ వ్యక్తి. ప్రజలకు ఇష్టుడు కావటానికి ఏఏ గుణాలు అవసరమో అవన్నీ అతనిలో ఉన్నై. క్లుప్తంగా చెప్పాలంటే, అతను మిథ్యావాది, మిష్టభాషి, స్వార్థపరుడు. అనర్గళంగా అతను అబద్ధాలాడుతున్నా, అతని కమ్మని మాటలకు మనం కరిగి పోతాము; పైగా మన స్వార్థంకోసమే అతన్ని [illegible] పెట్టలేము. గణేశుని గనుక ఎదిరిస్తే ప్రాణకాంతుడికి పరాజయం తప్పదు.

ప్రజాప్రియుడు కాబట్టి గణేశుడు అజాత శత్రువని నేను చెప్పటం లేదు. ప్రజాప్రియుడు కాబట్టే అతనికి శత్రువు లున్నారు. కాని వీరంతా పరోక్షంగా ఉండవలసినవారే ప్రత్యక్షంగా అతన్ని ఎదుర్కొనేటందుకు తగినంతబలం వారికింకా కలగలేదు అందుకని వారు చాటుగా అతని సద్గుణాలను చిలవలకు పలవలుచేసి

ప్రచారం చేస్తున్నారు. ఐనా వీరు ప్రాణ కాంతునికి ప్రత్యక్షంగా సహాయం చేస్తారని నాకు నమ్మకం లేదు. అప్పుడప్పుడు నేను గణేశుని సంగతి తలుచుకుని విచారపడుతూ ఉంటాను. పాపం, అతను పాపులర్ కావటం మూలానే [illegible] నష్టం. అతనికి ఆంతరంగిక మిత్రులు తరుగుగా ఉన్నారు. అందరూ స్వార్థంకోసం సాధించుకోవటంకోసం అతని దగ్గర లౌకికంగా మెలుగుతారు; విధేయత చూపుతారు; కాని వాళ్ళ లోలోపల మాత్రం అతనిమీద అసంతృప్తి కలది ఉన్నారు. అతనిలో లోపాలను ఎత్తిచూపి, సవరించుకోమని హెచ్చరించే హితైషులు అతనికి లేరనే చెప్పవచ్చు. కాని అందరూ అతన్ని మర్యాద చేస్తారు; ఓట్లు ఇస్తారు; కాని ప్రేమించరు. కాగితాలమీద అతను జనప్రియుడు; అంతరంగంలో మాత్రం అతనికి చోటు లేదు.

ఒక్క గణేశుడికేకాదు, ప్రపంచంలో ఉన్న పాపులర్ వ్యక్తుల అందరికీ యిదే కర్మ. నిర్దుష్టమైన వ్యక్తి ఎప్పుడూ పాపులర్ కాలేడు. నడతలోనూ, శిక్షణలోనూ, దీక్షలోనూ కల్తీలేనిదే పాపులర్ కావటం కష్టం. మేలిమి బంగారం నిత్యావసరాల కెందుకూ పనికిరాదు; కల్తీవున్న నవరసు బంగారానికే బజారులో చెలామణీ ఉంది. కాని ఆ కల్తీ విషయంలో మాత్రం మన కళ్ళు మూసుకు ఊరుకోము. లెక్కప్రకారం పోరిపిడిపట్టి, మేలిమి బంగారంతో దాన్ని సరిపోల్చి, అంతా దానికి తక్కువ విలువ ఇస్తాము. ఒకవేళ నిర్దుష్టమైన వ్యక్తి ఎవరైనా పాపులర్ అయితే అతనిలో తప్పులు వెదికి, వాటిని ప్రజలకు చూపెట్టి, వారు అతన్ని [illegible] ఒట్టుగా చేస్తాము. పాపులారిటీ ఆకాశంలో క్రమంగా మేఘాలు వ్యాపిస్తాయి; ఇక హఠాత్తుగా అవి ఏనాడు కుంభవృష్టి కురిసినా కురవచ్చు.

కాబట్టి మనం ఎనలైజ్ చేసిచూస్తే నిర్దుష్టమైన వ్యక్తి పాపులర్ కాడనీ, పాపులర్ అయిన తర్వాత అతని దోషాలు కూడా పాపులర్ అవుతాయనీ తేలుతున్నది.

చంద్రుడు పాపులర్; అతని కళంకం కూడా పాపులర్.

సూర్యుడు పాపులర్; అతనిలో మచ్చలు కూడా క్రమంగా పాపులర్ అవుతున్నై.

కాబట్టి పాపులర్ కావలనుకున్న ప్రతి వ్యక్తీ, తన ఏయే లోపాలను మూలధనంగా పెట్టుకుని పాపులర్ కాదలచుకున్నాడో అవి అతను పాపులర్ అయిన తర్వాత ప్రతి ఇంటా విమర్శింపబడతాయని తెలుసుకోవాలి. వాటికి చలించకుండా నిర్వికారంగా ఉండటం కూడా అతను నేర్చుకోవాలి.

అది చేతకానప్పుడు అతను పాపులారిటీకి దూరంగా ఉండటమే మంచిది.

ప్రాణకాంతుడు ఈ ఓట్ల యుద్ధంలో



ముప్ప

"భార్యకు నగ చేయించే విషయంలో నీకు అనుకూలమైన కారణాలేమి ఉన్నాయో చూపగలవా? స్త్రీలు పురుషుడి మనస్సును హరించటంకోసమే నగలు ధరిస్తారు. నీ భార్య పరపురుషుని ఆకర్షించటంకోసం ఈ నగ ధరించి ఉండదని నేను అనుకుంటాను. అప్పుడిక ఆమె లక్ష్యం నువ్వేనని అనుకోవాలి కదా? నీ మనస్సు హరించటంకోసం నీ భార్య ఇంకా కొత్త నగలు ధరించాలని నీవు అనుకుంటున్నావా? ఒకవేళ ఉందనే అనుకుందాము. కాని ఆ అలంకారాలు నీవే తీసుకువచ్చి ఇవ్వడం ఎంత హాస్యాస్పదంగా ఉంది! దీన్నే డొంకతిరుగుడు లేకుండా చెప్పాలంటే—నా జేబులో డబ్బు ఖర్చుపెట్టి నా మనస్సు హరింపబడటం కోసం కావలసిన సామగ్రి తెచ్చి నీకిచ్చాను. నా మనస్సు బార్లాగా తెరుచుకు కూర్చున్నాను. రా, ఇక నీవు వచ్చి దాన్ని దొంగలించు—అని అనటంకాదా?"

ప్రాణకాంతుడు గనక రేగాడంటే ప్రాణాంతకంగా వుంటుంది.

అత నిలా రేగినప్పుడు ఆతనితో తర్కించటంకంటే వోటు పారవెయ్యటమే సులభమైన పని.

"సరే, ఈసంగతి పోనివ్వు. నీతో తర్కించటం నాకిష్టంలేదు నా వోటు నీకే ఇస్తాను." అన్నాను.

"నీ సద్బుద్ధికి నేను చాలా సంతసించాను. కాని ఎలక్షన్ అయిపోయింది. నువ్వు శ్రమ పడనక్కర్లే!" అన్నాడు ప్రాణకాంతుడు.

"అదేమిటి! పోలింగ్ 19 వ తేదీ అన్నారుకదూ! ఇవ్వాళ పదిహేనుగా!"

"నువు బెంగాలీ తారీఖులు చెప్తున్నావు. పోలింగు ఇంగ్లీషు తారీఖుతో జరిగిపోయింది."

ఒక్కమాటుగా ఆకాశంలో నించి క్రిందపడ్డాను.

"లెఖ్ఖలు అయినాయా?"

"ఆఁ, నేను ఓడిపోయాను. ఒక్క ఓటువారలో."

"నాకోసం ఎవరినైనా పంపినా పోయేదిగా."

"నేను ఎవరికోసం మనుషుల్ని పంపలేదు. ఎలక్షన్‌లో నేను ఓడిపోయినా, పందెంలో గెలిచాను. హరీన్‌తో పందెం వేసి నేను ఎలక్షన్‌కు నిలబడ్డాను. హరీన్ నువు గెలుస్తావని అన్నాడు; నేను నేను ఓడిపోతానన్నాను. నీకు గుర్తుందో లేదో నాతరపున హరీనే క్యాన్వాసు చేశాడు. నేనేమీ చేయలేదు. అసలు, పోలింగు జరిగేటప్పుడు నేను ఊరచెరువులో గాలం వేసి కూచున్నాను. ఆ పందెండబ్బులు పెట్టే నీ భార్యకు నేనిప్పుడు లోలక్కులు చేయించుకువచ్చాను. దీనికి నీవు డబ్బు ఇవ్వనక్కరలేదు. ముందు లోపలికిపోయి కనుక్కో నీ భార్యకివి నచ్చినవోలేదో!"

పెట్టె తెరిచి చూశాను చాలా అందంగ ఉన్నాయి! డబ్బుకూడా ఇవ్వనక్కరలేదు మళ్ళీ ఆకాశంలోకి ఎగిరిపోయాను.

# మార్చినెల భావపరిచయ పోటీ




## బహుమతి పొందిన వ్యాఖ్య

ఎంతదయో భామినిపై
పంతంబున పడతిగాయ ప్రాణవిభుండౌ
కాంతుడు ఛత్రంబడ్డెను,
భ్రాంతిని మదిచెదరునేమొ, భామకటంచున్.

కె. శేషాద్రిరావు,
1-8-9*7, నల్లకుంట,
హైదరాబాదు—0




చలపతిరావు మామూలుగా ప్లేన్లో ప్రయాణంచేసే స్తోమతు వున్నవాడు కాదు. పదిమందిపిల్లలు ఉన్న కుటుంబానికి చెందినవాడు. పైగా కొద్దో గొప్పో సంపాదిస్తున్న అతని తండ్రి ఇటీవలే మరణించాడు. పిల్లల్లోకి పెద్దవాడు అతనే అవటంవల్ల కుటుంబాన్ని ఈదవలసిన భారం అతనిమీదే పడింది.

అతను బి.ఏ. ప్యాసయి ఉద్యోగం చెయ్యకుండా వూరికే ఉంటున్నాడు. ఈనాటి యువకుడు అవటంవల్ల ఉదర పోషణకంటే సంఘసేవ చెయ్యాలనే తాపత్రయం కలిగినవాడు. అతనితండ్రి బ్రతికి ఉన్నంతకాలం అతను ఏం చేసినా చెయ్యకపోయినా జరిగిపోయింది ఇప్పుడు కడుపుకోసం దేవులాట తప్పనిసరి అయింది దానికి తగినట్లు ఢిల్లీలోని పబ్లిక్ సర్వీస్ కమీషన్, ఆ మధ్య పబ్లిసిటీ ఆఫీసర్ల పోస్టులకోసం ఎడ్వర్టయిజు చేసింది ఆతను అప్లయి చేశాడు.

ఆ పోస్టులు రెండు. ఒకటి ఉత్తరాదివాళ్ళ కిచ్చినా ఒకపోస్టు దక్షిణాది వాళ్ళకి యివ్వగలరనే ధైర్యంతో అప్లికేషన్ పెట్టుకున్నాడు అతడు అనుకున్నట్లే ఇన్టర్వ్యూ వచ్చింది కాని ఢిల్లీ వెళ్ళి రావటానికి డబ్బేది?

డబ్బుకోసం చాలా ప్రయత్నించాడు గాని పుట్టలేదు ఇక ఎల్లుండి ఇన్టర్వ్యూ అనగా ఒక స్నేహితుడు అతని దురవస్థ చూసి జాలిపడి డబ్బిచ్చాడు. అతనిది విజయవాడ దగ్గర ఒక గ్రామం. అప్పుడు రైల్లో ఢిల్లీకి బయలుదేరితే ఇన్టర్వ్యూ సమయానికి అందుకోలేడు. అందుకని ప్లేన్లో వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. హైదరాబాద్ వరకూ రైల్లోవెళ్ళి అక్కడ దిగి ఏరోడ్రోముకి వెళ్ళాడు. ఇంకా ప్లేన్ రావటానికి ఒకగంట టైమ్ ఉంది

జనం హడావుడిగా తిరుగుతున్నారు. కొంతమంది ప్రయాణీకులు సామాన్లు తూకం వేయించుకుంటున్నారు. కొంత మంది ఒకహాల్లో కాఫీలు, డ్రింకులూ త్రాగుతున్నారు. ఎదురుగావున్న హాలువిరామసమయంలో ప్రయాణీకులు విశ్రాంతి తీసుకునేది అక్కడకు వెళ్ళి కూర్చున్నాడు చలపతిరావు.

అక్కడ స్త్రీలూ, పురుషులూ చాల మంది ఉన్నారు. ప్రజల్లో ఎవ్వరికీ వారికి ప్లేన్లో ప్రయాణం చెయ్యాలనే కుతూహలం ఉంటుంది కాని తీరా ప్రయాణం దగ్గర పడేటప్పటికి ఏమవుతుందో అనే భీతి ఒకటి పట్టుకుంటుంది అందుకని అక్కడ కూర్చున్న ఎవ్వరిముఖం మామూలు ముఖంగా లేదు. ఏ ముఖంలోనూ నెత్తురుచుక్క లేకపోగా విపరీతమైన టెన్షన్ కొట్టవచ్చినట్లు కనిపిస్తూ ఉంది.

వారిని చూస్తుంటే నవ్వు వచ్చింది చలపతిరావుకి.

వారిలో ప్రభుత్వంలో పెద్ద ఉద్యోగం చేసే ఆఫీసరు ఒక రున్నారు వారు చండశాసనులని ప్రతీతి. వారి పేరు చెబితే చాలు మిగిలిన ఆఫీసర్లంతా హడలిపోతుంటారు. ఆటువంటి వారు కూడా చేతిలో ముంతపట్టుకొని తన సమాధికి నడిచిపోతున్నట్లు ముఖం పెట్టుకొని కూర్చోవటం చలపతిరావుకి చోద్యంగా కనుపించింది. వట్టప్పుడు ఎంత అహంకారం ఉన్నా ఆపద ఎదుర్కొన్నప్పుడు అందరి భయమూ ఒకటే అవటం చిత్రంగా తోచింది చలపతిరావుకి. తనచుట్టూ ఉన్న ముఖాలను పరికిస్తూ కూర్చున్నాడు

అంతలో ఒక యువతి ప్రవేశించింది హాల్లోకి. చేతులో బ్యాగు పట్టుకొని, ఎత్తయిన మడమలు కలిగిన బూట్లు తొడుక్కొని బాబ్డ్ హెయిర్‌తో ఆమె చాలా ఫ్యాషన్‌బుల్‌గా వుంది. ఒక పాతికేళ్ళ వయస్సు వుండవచ్చు. ముఖం మంచి వర్చస్సు కలిగిన ముఖం ఆ ముఖం కూడా కొద్దిసేపట్లో కళావిహీనమైపోతుంది కాబోలు—అని విచారపడ్డాడు చలపతిరావు

ఆమె అటూ ఇటూ చూచింది. నిజంగా అవి లేడి చూపులే అందరూ ఆమెవంకే చూస్తున్నారు. ఆమెచూపు చలపతిరావు మీద పడింది చలపతిరావు కూర్చున్న కుషన్‌లోనే స్థలంవుంది. ఆమె నిస్సంకోచంగావచ్చి ఆ స్థలంలో కూర్చుంది అంటే చలపతిరావు సరసనే కూర్చున్నదన్నమాట.

ఇంకేముంది? అంతకుముందు తన చుట్టూ కూర్చున్న వారి ముఖాలు చూచి తనలో తాను నవ్వుకుంటున్న చలపతిరావు అస్థిమితస్థితిలో పడిపోయాడు. ఆమె దగ్గరకు రాగానే సువాసనలు గుప్పున ఎగబడినై. అతని తల తిరిగింది.

ప్రక్కన కూర్చున్న ఆమెను చూడాలనివుంది చలపతిరావుకి. కాని చూడలేక




పోయాడు. నరాలు బిగువెక్కినై. అప్పుడు తన ముఖం కూడా తనచుట్టూవున్న అందరి ముఖాలు మాదిరిగానే వుండి ఉంటుంది కాబోలు—అనుకున్నాడు చలపతిరావు. నవ్వుకోలేక పోయాడు. కాని ఆమెను పలకరించాలనివుంది. ఎక్కడకు వెళుతుందో కనుక్కోవాలని ఉంది

బట్లరువచ్చి "డ్రింకులు కావాలా?" అని అడిగాడు.

ఆమె ఒక డ్రింకుకి ఆర్డరు ఇచ్చింది. వెళ్ళిపోతున్న బట్లరును పిలిచి "నాకు కూడా ఒకటి పట్టుకురా" అన్నాడు చలపతిరావు. ఆ విధంగా మాటకలిపి "తమరు ఎక్కడికి వెళ్తున్నారు?" అని అడిగాడు.

ఆమె మాట్లాడలేదు. పైగా ముఖం అటుత్రిప్పుకు కూచుంది. ఏం చేసేటట్టు? మళ్ళీ అడిగితే ఏమంటుందో! చీదరించుకున్నా చీదరించుకోవచ్చు.

బట్లరు డ్రింకులు తెచ్చాడు. ఆమెతో పాటు అతనూ త్రాగాడు. డ్రింకులకు ఏరోడ్రోంలో మిగిలిన చోట్లకంటే ఎక్కువ తీసుకుంటారని విన్నాడు. ఎంత ఇవ్వాలి? "ఎంత?" అని బట్లరుని అడిగితే, అసలే తనమీద సద్భావంలేని, ఆమె దృష్టిలో మరీ హీనపడిపోతానేమో అని భయపడ్డాడు. "ఎవ్వరీ పల్లెటూరి గమార్? అనుకుంటుందేమో! ఆమె డబ్బు ఇచ్చేవరకూ వూరుకొని ఆమె ఇచ్చినంతా ఇచ్చి ఒక్క నిట్టూర్పు విడిచాడు. ప్లేన్

వచ్చింది. లౌడ్‌స్పీకర్లు ఢిల్లీ వెళ్ళే ప్రయాణీకులు వెళ్ళికూర్చోవచ్చని ఎనౌన్సుచేసినవి. అంతా బయలుదేరారు. ఆమె చకచకా నడిచి వెడుతోన్న తీరులో ఇతరులలో కనిపిస్తున్న సంకోచంగానీ, భయంగానీ ఏ కోశానాలేదు. ఆ ప్రమిత్రుని సందర్శనానికి వెళ్తున్నంత సంతోషంగా వెళ్ళింది.

చలపతిరావు నెమ్మదిగా వెళ్ళాడు. ప్లేను ఎక్కాడు. ఎయిర్ హోస్టెస్ అతని చేతిలోవున్న కాగితంముక్క పరిశీలించి, సీటుచూపింది. ఆసీటు ఆమె ప్రక్కసీటే. ఆ సీటు దాటివెళ్ళి తనకు నిర్దేశించిన సీట్లో కూర్చున్నాడు చలపతిరావు. ఆమె అతనిని చాలా నిరసనగా చూసింది "ఈ పల్లెటూరి గమార్ ఇక్కడికికూడా వచ్చాడే!" అని అనుకుంటూ ఉన్నదనుకున్నాడు. కోపంవచ్చి రాచుకుంటూ వెళ్ళి తన సీటులో కూర్చున్నాడు.

ప్లేను కదిలింది. అతను ప్రక్క కిటికీలోనుంచి బయటకు చూస్తూ కూర్చుంటే ఆమె తన లోకితాను చూచుకుంటూ కూర్చుంది. ఆమె సీటుకువున్న బెల్టు నడుముకు చుట్టుకుంది. అతనూ చుట్టుకున్నాడు. బయటకు చూస్తుంటే కండ్లు తిరుగుతున్నట్లనిపించింది.

చూపులు త్రిప్పుకొని కూర్చున్నాడు.

ఎయిర్ హోస్టెస్ వొక పళ్లెంలో పిప్పరమెంట్లూ, చాకులెట్లూ పోసుకొని వచ్చి అందించింది. అతను చూశాడు ఆమెవంకే. ఒక చాకొలెట్ తీసుకుంది. అదికూడా పళ్లెంలోవున్న రకాలన్నిటిలోకీ చిన్నది. అతనికి చాలా తీసుకోవాలనిపించింది. కాని వొక్కటే తీసుకున్నాడు. అదీ చాకొలెట్టే. అదీ అన్నిటిలోకీ చిన్నదే. అక్కడ ఆమె చేస్తున్నట్లు చేస్తున్నందుకు తనమీద తనకు చీదర కలిగింది.

విమానం చాలా ఎత్తున ఎగురుతూంది. ఎంతో క్రింద మేఘాలు దూదిపింజలవలె కదులుతున్నయ్. చలపతిరావుకి చిత్రమనిపించింది. భూమిమీద నుంచి చూస్తే మేఘాలు ఆకాశాన్ని అంటుకొని ప్రయాణం చేస్తున్నట్లు వుంటై. అందుకనే రచయితలు "ఆకాశాన్ని మేఘాలు అలుముకుంటూన్నయి" అని వ్రాస్తారు. ఇప్పుడు తను ఆకాశానికీ, మేఘాలకు మధ్యవున్నాడు. అసలు ఆకాశమనేదే లేదు. ఆకాశం గగనం శూన్యం ఇటువంటి తప్పులు మానవులు ఎన్ని చేస్తున్నారో! రచయితలు ఎన్ని వ్రాస్తున్నారో! అయినా ఈ తప్పుల వల్ల ప్రపంచం బాధపడుతున్నట్లు లేదు. దాని ధోరణిలో అది నడిచి పోతూవుంది. "ఈ ప్రపంచానికి తప్పులను ఇముడ్చుకొని, జీర్ణించుకొని బ్రతికేశక్తి వుంటుంది" అనుకున్నాడు చలపతిరావు.

"అది కొంచెం ఇటు త్రిప్పండి" అన్నదామె.




"ఏదీ?" అన్నాడు చలపతిరావు. ఆమె కంఠధ్వనికి ఉలికిపడి. ఆమె తనను పలకరిస్తుందని అతను అనుకోలేదు.

"అదే" అని గాలివచ్చే బుగ్గను చూపింది ప్రతిసీటుకి ప్రక్కన గోడకు గాలివచ్చే రెండు బుగ్గలు వుండటం అతను అంతకుముందే చూశాడు ప్రయాణీకులు వాటిని తమవైపుకు త్రిప్పుకోవటం కూడా చూశాడు. కాని అతను వాటిజోలికి వెళ్ళదలచలేదు. ఏం చెయ్యబోయి ఏంచేస్తానో అనే భయంతో; ఏం చేస్తే ఏమవుతుందో అనే భయంతో. ఇప్పుడా బుగ్గలను తనవైపుకు త్రిప్పమంటూ ఉందే. అసలే ఆమెమీద కోపంగా ఉందేమో. "మీరే త్రిప్పుకోండి" అన్నాడు చలపతిరావు.

ఆమె త్రిప్పుకు కూచుంది. అతను మళ్ళీ కిటికీలోనుంచి బయటకు చూచాడు. ఈసారి కాస్త ధైర్యం తెచ్చుకుని క్రిందకు చూచాడు భూమ్మీదవున్న పెద్ద పెద్దవూళ్ళు బొమ్మరిళ్ళులాగ అగుపించినై భూమిమీద ఉంటే ఆవూళ్ళే గొప్పవిగా కన్పిస్తయి. పెద్దపెద్ద సౌధరాజాలుగా కనుపిస్తయి. ఆకాశం మీదనుండి చూస్తే అనంతంగా కనిపిస్తున్న భూమిమీద. ఈ వూళ్ళు సముద్రంలోని కాకిరెట్టలుగా, సున్నపు పిడచలుగా కనుపించి, హాస్యాస్పదంగా ఉన్నయ్ ఇక ఆ వూళ్ళల్లో నివసించే మనుష్యుల సంగతి వేరె చెప్పాలా?

మానవుడు ఎంత అల్పజీవో అప్పుడు తట్టింది చలపతిరావుకి. భూమిమీద నిలబడి తనకు కనపడే అంతవరకే నిజమనుకొని, అంతా తనమీదుగనే నడుస్తూ ఉందనుకొని, భ్రమపడి, దురహంకారము పెంచు

కుంటాడు. గాని నిజంగా అతను ఒక్క నలుసు. ఆ సంగతి ఆకాశాన్నుంచి చూస్తే ఇట్టే బోధపడుతుంది. మానవుడు వట్టి నలుసు. నలుసుల్లో నలుసు.

ఎయిర్ హోస్టెస్ ముఖంలో ముఖం పెట్టి "టీ యా? కాఫీయా?" అని అడిగింది ఆమెను.

ఆమె "కాఫీ" అన్నది.

అదేవిధంగా చలపతిరావుని అడిగింది. చలపతిరావుకి అంతఎత్తున టీ కాఫీలు ఇస్తారని తెలియదు. అప్రయత్నంగా 'టీ' అన్నాడు.

మరుక్షణం తనప్రక్క కూర్చున్న ఆమె అడిగింది తను అడగనందుకు సంతోషించాడు.

ఎయిర్‌హోస్టెస్ ఆమెకు కాఫీ, అతనికి టీ తెచ్చి యిచ్చింది. ఆ క్షణం ఆమె అమృతం పంచిపెడుతున్న దేవతలాగా కనుపించిందతనికి. సన్నగా, చక్కగా ఉన్నది. ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ ఉంది. తొణుకు బెణుకులేకుండా పలకరిస్తుంది. ముచ్చటగా మాట్లాడుతుంది. ఇంకేం కావాలి?

"థ్యాంక్సు", అన్నాడు ఆమె అందించిన టీకప్పు తీసుకొంటూ. టీతోపాటు ఆమె కొన్ని బిస్కట్లు కూడా ఇచ్చింది. ముందుసీటు వెనుక భాగానవున్న బల్ల పరిచింది. అది టేబుల్‌లాగు ఉపకరిస్తుందని గ్రహించాడు చలపతిరావు.

బిస్కట్లప్లేట్లూ, టీ కప్పూ దానిమీద పెట్టుకున్నాడు. చల్లగా వుండటంవల్లో, భయం కలిగిన టెన్షన్ వల్లోగాని ఆ అమృతప్రాయంగా ఉంది చలపతిరావుకి.

అంతఎత్తున టీ త్రాగే అదృష్టం తనకు దొరికినందుకు విధిని మెచ్చుకున్నాడు.

ఆమె కాఫీ ముగించింది. ఎంత నెమ్మదిగా త్రాగినా తానే ముందు ముగించాడు. ఎయిర్‌హోస్టెస్ కప్పులూ, ప్లేట్లూ పట్టుకుపోయింది. ముందుసీటు వెనుకభాగంలో ఉన్న బల్లలను మూసివేసింది.

ప్లేన్ క్రిందకు దిగుతూ ఉంది. ఆమె ఏదో ఆలోచిస్తూ ఉంది. కాస్త కలవరపడుతూ ఉందనిపించింది చలపతిరావుకి. ఎందుకు కలవరం?

ప్లేన్ నాగపూర్ ఏరోడ్రోమ్‌లోకి దిగింది. ప్రయాణీకులందరూ దిగారు. అకస్మాత్తుగా ఆమె పలకరించింది.

"మీరు ఇక్కడ దిగుతున్నారా?"

"లేదు."

"ఢిల్లీ వస్తున్నారా?"

"అవును."

ఇంకేదో అడుగుదామని కాసేపు తచ్చాడి ఆమెకూడా ప్లేన్‌దిగి బయటకు వెళ్ళింది. ప్లేన్ మళ్ళీ బయలుదేరేవరకూ విశ్రాంతి తీసుకోటానికిగాను ప్రయాణీకులు దిగారని తెలుసుకొని తానూ దిగాడు చలపతిరావు. ఉన్నట్టుండి ఆమెలో ఇంత మార్పు ఎందుకు వచ్చిందో అతనికి అర్థం కాలేదు.

ఏమీతోచక పుస్తకాల షాపుముందు చూస్తూ నిలబడ్డాడు. కాసేపటికి ఆమె కూడా వచ్చింది. డ్రింకు తాగివచ్చిందని గ్రహించాడు చలపతిరావు. ''నేనూ ఢిల్లీ వస్తున్నాను'' అన్నది.

అతనికి ఏమి సమాధానం చెప్పాలో తోచక మెదలకుండా వూరుకున్నాడు.

''నాగపూర్ దాటిం తర్వాత ఇటీవలే ప్లేన్‌కి రెండుసార్లు యాక్సిడెంట్ అయింది'' అన్నది.

"నేను పత్రికలో చదివాను."

''ఈసారి ఇటువంటి ప్రమాదం ఏమీ జరుగదు కదా!''

ఆమెలో వచ్చిన మార్పుకి కారణం అతనికి లీలగా అర్థమయింది "ఎలా చెప్పగలం?'' అన్నాడు.

''ఏదన్నా జరిగితే?"

"పూర్వులు పోయినదారినే పోవలసి వస్తుంది."

ఆమె ముఖం వివర్ణమయింది కండ్లు చెమ్మగిలినై అతనికి జాలివేసింది. నేను నవ్వుతూ అన్నాను. "ఏ ప్రమాదమూ జరుగదులెండి" అన్నాడు తనకు ఆ విషయం బాగా తెలిసినట్లు.

"జరగదా"? అని ఆతురతగా అడిగింది. ప్రమాదాలు జరగటం, జరక్కపోవటం అతని చేతుల్లోనే వున్నట్టు.

''జరుగదు."

''థ్యాంక్సు"అన్నది. ఆమె ఒక నవల కొనుక్కున్నది.

లౌడ్‌స్పీకరు ప్రయాణీకుల్ని ప్లేన్‌లోకి వెళ్ళి కూర్చోమని చెప్పింది. అంతా వెళ్ళారు. ఎవరిసీట్లలో వారు యథా ప్రకారం కూర్చున్నారు. ప్లేన్ ఢిల్లీ పయనమైంది రొప్పుకుంటూ, రొదచేసుకుంటూ.

ఆమె ప్రాణాలు బిగపట్టుకు కూర్చుంది.

ఆమె మనస్సులో చెలరేగుతున్న ఆలోచనలను మరచిపోవటానికిగాను. ''మీరు ఏ పనిమీద వెళ్తున్నారు?'' అని అడిగింది.

''ఉద్యోగంకోసం.''

"ఏ ఉద్యోగం?"

అతను చెప్పాడు. ఆమె కొంచెంసేపు ఆలోచించి "నేను సహాయం చెయ్యగలను'' అన్నది. ఢిల్లీలో ఒక ప్రభుత్వోద్యోగిని తాను ఎరుగుదుననీ, ఆయనతో రికమెండ్ చేయించగలననీ చెప్పింది.

''థ్యాంక్సు" అన్నాడు చలపతిరావు. అనుకోకుండా వచ్చిన ఈ సహాయానికి మనస్సులో చాలా సంతోషించాడు.

''ఢిల్లీలో మీరు ఎక్కడ దిగుతారు?" అని అడిగింది.

"ఇంకా ఏమీ అనుకోలేదు."

"మీకు అభ్యంతరం లేకపోతే నాతో రండి. నేను ఒక మిత్రుని యింట్లో బస చేస్తున్నాను. ఆయన సంతోషిస్తాడు."

"ఎందుకు మీకు శ్రమ? ఎడ్రస్ ఇస్తే మిమ్మల్ని వచ్చి కలుస్తాను."

''శ్రమ ఏమీ లేదు. అక్కడ హోట

ళ్ళలో గదులు దొరకడం కష్టం పైగా ఆ తిండి మనకు పడదు. నా మిత్రుని తరపున మిమ్మల్ని నేను ఆహ్వానిస్తు న్నాను.''

''థ్యాంక్స్వండీ. అలాగే వస్తాను' అన్నాడు చలపతిరావు

ప్లేన్ ఆకాశం ఎత్తునలేచి వెళ్తూఉంది

ఆమె కాసేపు మాట్లాడకుండా కూర్చుంది. ఇటీవల జరిగిన ప్లేన్ యాక్సి డెంట్లను గురించి ఆమె ఆలోచిస్తూ ఉందని గ్రహించాడు చలపతిరావు. ఆ యాక్సిడెంట్లు ఈ ప్రాంతాల్లో జరిగినవని పత్రికల్లో చదివినట్లు గుర్తు. నవలతీసింది. చదువ బుద్ధి అయినట్లులేదు కిటికీలో నుంచి బయటికి చూస్తూ—

''వాన కురుస్తున్నది" అన్నది బాధ కరంగా

''ఏదీ'' అన్నాడు చలపతిరావు తానూ కిటికీలోంచి చూస్తూ.

''అటు క్రిందకి చూడండి—'' వేలు పెట్టి చూపించింది.

''నిజమే, ముసురు కప్పుకొని భూమి కనిపించటంలేదు. అప్పుడు చలపతిరావుకి జ్ఞాపకం వచ్చింది. మేఘాలు వర్షిస్తాయనీ, మేఘాలకుపైగా తాము ప్రయాణం చేస్తు న్నామనీ. మేఘాలకుపైగా ప్రయాణం చేస్తున్న తమకు దగ్గరగా వర్షంకురిసే అవకాశంలేదు. విమానానికీ భూమికీ మధ్యస్థంలో ఎక్కడనుంచో వర్షం ప్రారంభ మవుతుంది. ఈ దృశ్యం చిత్రంగా ఉంది చలపతిరావు మనస్సుకి తాను వర్షానికి పైన వున్నాడు. వర్షంకురి సేది తన క్రింద.

''వర్షం కురిసేది క్రిందగదా! మన కేమి?" అన్నాడు.

"ప్లేన్ దిగటం కష్టం అవుతుంది. వర్షం ఎక్కువగా కురుస్తుంటే దిగవలసిన స్థలం పైలెట్ కి కనబడదు" అన్నది విచారంగా.

''అప్పుడు ఏం చేస్తాడో?''

''ఇంకొక చోటుకి వెళ్తాడు.''

''అక్కడా వర్షం కురుస్తుంటే?''

''మరింకొక చోటుకి.''

''ఈ లోగా పెట్రోలు అయిపోవ టమో, ఇంకేదన్నా నో జరిగితే?''

'రిస్క్ తీసుకుని ప్లేన్ దింపుతాడు."

ఈ మాటకు చలపతిరావుకి కూడా కొంచెం భయం వేసింది. ఇంటి దగ్గర తనకు ఉద్యోగం వస్తుందనీ, తమ కష్టాలు గడుస్తవని పిల్లలను చుట్టూ కూర్చోపెట్టుకొని ఎదురుచూస్తున్న తల్లి జ్ఞాపకం వచ్చింది

అతను చలించాడని గ్రహించిం దామె. మానసిక సాన్నిహిత్యం ఎక్కు వైంది. అతని వైపుకు తనకు తెలియ కుండానే జరిగింది. ఒక్క నిట్టూర్పు విడిచింది. ఆ నిట్టూర్పు అతని కంఠానికి వేడిగా తగిలింది.

"ఏమి కానున్నదో!'' అన్నది.

''మనకేం తెలుస్తుంది?" అన్నాడు

చలపతిరావు. ఒక్కసారి ప్లేన్లో ఉన్న ప్రయాణీకుల నందరినీ కలయజూశాడు. అందరూ భయంతో బిర్రబిగుసుకొని కూర్చున్నట్లే కనుపించారు. ఎవరికివారు ప్రక్కవారితో మాట్లాడటానికే భీతావహంతో ఉన్నారు. అందరూ శ్మశానానికి పయనిస్తున్న ముఖాలతో కూర్చుని వున్నారు. భయంతో బిత్తర చూపులను ప్రసరిస్తూ, బిగదసుకొనిపోయి వున్న యిన్ని ముఖాలను అతను ఇంతకుముందు ఎన్నడూ చూచియుండలేదు. ఎవరి మరణ గీతం, వారే ఆలపిస్తున్నట్లున్నారు.

"మీకు ఎవరున్నారు యింటిదగ్గర?" అని అడిగిందామె.

"అమ్మ" అన్నాడు చలపతిరావు. అతనికి తెలియకుండానే అతని కంఠం గాద్గదికమయింది. ఆ ధ్వనికి అతని నరాలు సడలినై.

"మీకో?" అని అడిగాడు, అదే కంఠ స్వరంతో.

"మా ఆయన..." అన్నది ఇంక మాట్లాడలేక పోయింది. కండ్లవెంట నీరు జలజల ప్రవహించింది.

"ఊరుకోండి" అన్నాడు. అప్రయత్నంగా ఆమె చెయ్యిమీద చెయ్యివేశాడు ఓదార్పుగా. అతని శరీరం జలదరించింది. నెమ్మదిగా నిమిరాడు.

ఆమెకు అదేమీ విపరీతంగా కనుపించలేదు. నెమ్మదిగా పమిటచెంగుతో కన్నీరు




అద్దుకుంది.

"ఏమవుతుందో?" అన్నది.

"ఏమీకాదు" అన్నాడు చలపతిరావు ఆమె వేళ్ళు సవరిస్తూ.

అంతలో ప్రయాణంచేస్తున్న ప్లేన్ నుంచి వింతధ్వని ఒకటి బయలుదేరింది. సన్నగా బయలుదేరి, క్రమ క్రమేణా

పెద్దదయింది. అంతా విలువుగుడ్లువేసి చూస్తూ కూర్చున్నారు. సూట్‌లోవున్న పెద్ద ఉద్యోగి కంగారుగా లేవబోయి ప్లేన్ వూపుకి మళ్ళీ చతికిలబడ్డాడు. ఎయిర్ హోస్టెస్ చిరునవ్వు నవ్వుకుంటూ అతని దగ్గరకు వెళ్ళింది.

"ఏమిటది?" అని అడిగాడు. ఎయిర్ హోస్టెస్‌ను.

"మరేంలేదు. భయపడకండి" అన్నదామె

చలపతిరావు విన్నాడు. ప్రక్కనున్న ఆమె విన్నది.

"ఎక్కడ బెంబేలు పడిపోతామో నని వాళ్లు అలాగే అంటారు" అన్నది చలపతిరావుతో.

"అయితే మనం ప్రమాదానికి లోనైనట్లేనా?"

"ఇంకా అడుగుతున్నారా?" అని వెక్కి వెక్కి ఏడువ నారంభించింది.

"ఊరుకోరూ, నా మాట వినరూ!" అని సమాదాయించాడు చలపతిరావు. ఆమె చేతిని పూర్తిగా తన చేతిలోకి తీసుకుంటూ మరణించవలసివస్తే తమతో పాటు సూట్ వేసుకొని కంగారు పడుతున్న ఆ ప్రభుత్వోద్యోగికూడా వున్నాడనే సంతోషం అతని మనస్సులో తటుక్కున మెరిసింది సైగా అతను వొంటరివాడు చస్తాడు, తన చేతిలోవున్న ఆమె చెయ్యి కదిలింది.

"మా ఆయనసంగతి మీకు చెప్పలేదు" అన్నదామె.

"అవును" అన్నాడతను విచారంగా.

"నన్ను చాలా హింసించాడు. నా మనస్సును ముక్కలు క్రింద తరిగాడు. ఆయన నల్లగా వుంటాడు. అందుకని ఆయనంటే నాకు ఇష్టంలేదని ఆయన అనుమానం ...చివరికి విసిగి ఆత్మహత్య చేసుకుందా మనుకున్నాను ...ఆ సమయంలో తటస్థపడ్డాడు ...దేవుడు ప్రత్యక్షం అయినట్లు అయినాడు ..."

"ఎవ్వరు?" అని అడిగాడు చలపతిరావు విచారంగానే.

"కృష్ణానందం ......ఇప్పుడు నేను వెళ్ళేది ఆయన దగ్గరకే" అని ఏడవ సాగింది.

ఆమె అంత భయపడి పోవటానికి కారణం చలపతిరావుకి అప్పుడు పూర్తిగా అర్థం అయింది చెయ్యి నిమురుతూ, వేళ్ళు సవరిస్తూ ఎంతో ఇదిగా సముదాయించాడు. ఆపత్కాలంలో అందరి నోటినుంచి వెలువడే మాటలే అతని నోటినుంచి వచ్చినై.

"భగవంతుడున్నాడు. మనం సురక్షితంగా జేరుతాం."

ఆ మాట అన్నాడో లేదో విమానం ఒక్కకుదుపు కుదిపింది. ఏ క్షణం పల్టీ కొడుతుందో అన్నంత ఒడుదుడుకులుగా ప్రయాణం మొదలు పెట్టింది. విమానం అంతా గంద్రగోళం అయింది సూటులో




వున్న పెద్ద ప్రభుత్వోద్యోగి. "అమ్మో!" అని బిగ్గరగా ఆక్రోశించి లేచి నిలబడ్డాడు.

ఆయన కేకతో విమానం దద్దరిల్లి పోయింది ఆమె చలపతిరావు కంఠం కావిలించుకొని పెద్దపెట్టున ఏడవ నారంభించింది "నా జీవితం ఇట్లా అంతం కావలసిందేనా?........ కృష్ణానందంగారిని చూచే ప్రాప్తంకూడా లేదా... ....ఈ జన్మకి" అని అడుగుతూనే వుంది. చలపతిరావుకి ఏమి చెప్పాలో తెలియక తల నిమురుతూ కూర్చున్నాడు. చెక్కిళ్లు కూడా నిమిరాడు. "నామాటనమ్మండి. మనకు ఏ యిబ్బందీరాదు" అంటూనే వున్నాడు.

అంతలో విమానం తేరుకుంది. ఎయిర్ హోస్టెస్ ఎక్కడివారిని అక్కడ కూర్చోబెట్టే ప్రయత్నంలో వుంది. "ప్రమాదం ఏమీలేదు. ఎవ్వరూ కించిత్తు కూడా భయపడవలసిన అవసరంలేదు" అని లౌడుస్పీకరు చెప్పింది.

"ప్రమాదం లేదా?" అని, వాడికి పోతూ బిగ్గరగా కేకవేసి అడిగాడు సూటులోవున్న ఆ పెద్ద ప్రభుత్వోద్యోగి

"లేదు" అని నమ్మకంగా చెప్పింది ఎయిర్‌హోస్టెస్.

అంతా ఒక్క నిట్టూర్పు విడిచారు. ప్రభుత్వోద్యోగి సీట్లోకి నెమ్మదిగా జారుకున్నాడు. తోప అయ్యాడు.

కాని ఆమె మాత్రం చలపతిరావు భుజంమీదనుంచి తల తియ్యలేదు. కన్నీటితో అతని భుజం తడుపుతూనేవుంది. "చూడండి. ప్రమాదంలేదుట. ప్లేన్ మామూలుగనే ప్రయాణం చేస్తూఉంది" అని అతను అంటూనే వున్నాడు. ఆమె మాత్రం కన్ను విప్పలేదు. దూరాన్నించి ఈ పరిస్థితిచూచి వేడి కాఫీపట్టుకొని వచ్చింది ఎయిర్‌హోస్టెస్. చలపతిరావు భుజంమీద తల ఆన్చి కంఠాన్ని కావిలించుకొనివున్న ఆమెనులేపి, బలవంతంగా కాఫీ తాగించింది. తల పైకెత్తి కాస్త కాస్త చొప్పున నోట్లో పోసింది.




ఆమె తెప్పరిల్లి. "నేను ఎక్కడున్నాను?" అని అడిగింది.

"ఢిల్లీకి దగ్గర్లో వున్నాం" అని చెప్పింది ఎయిర్ హోస్టెస్.

"ఏక్సిడెంటు కాలేదా?"

"ఏక్సిడెంటు అవటం ఎందుకు?"

"నిజమేనా?"

"నిజమే!"

ఆమె ఒక్కసారి ప్రయాణీకులనందరినీ తేరిపార చూసింది ప్రభుత్వోద్యోగి తన ప్రక్కనవున్న అతనితోనూ, వెనుకన వున్న అతనితోనూ, చిరునవ్వునవ్వుతూ ఏదో గంభీరంగా మట్లాడుతున్నాడు. ఏ పరిస్థితుల్లోనైనా మనిషి నిబ్బరం కోల్పోకూడదని ఆ మాటల సారాంశం.

"మరి వర్షమో?" అన్నదామె.

"తగ్గిపోయింది" అని చెప్పింది ఎయిర్ హోస్టెస్.

"ఇందాక ఎందుకంత గందరగోళం జరిగింది?"

"ప్లేన్ కాస్త ట్రబుల్ ఇచ్చినమాట యథార్థమే."

"మళ్ళీ ఇవ్వదని నమ్మకం ఏమిటి?"

"ఇక ఇవ్వదు ఆదీకాకుండా ఢిల్లీకి దగ్గరకు వచ్చాం. అదిగో ప్లేన్ దిగుతోంది. కాస్త బెల్టుకట్టుకుంటారా" అని చిరునవ్వు నవ్వుతూనే బెల్టుకట్టింది. చలపతిరావు తనంతటానే బెల్టు కట్టుకున్నాడు. ఎయిర్ హోస్టెస్ చిరునవ్వు నవ్వుకుంటూ మరొకసీటు దగ్గరకు వెళ్ళింది.

ప్రమాదం తప్పిందని తెలియగానే ఆమె క్షణంలో మారిపోయింది ముఖంలోకి రక్తం ప్రవహించి మళ్ళీ కలకలలాడుతూవుంది చెక్కిళ్ళమీద ఇంకా కన్నీటి ధారలఛాయలు కనుపిస్తున్నా నునుపుకు తిరిగినై. కళ్లు తేజస్సుతో తళతళలాడుతున్నాయి. పెదిమలు ఎరుపెక్కి పగడాలవలె మెరుస్తున్నాయి. చిరునవ్వు చిందిస్తూవుంది.



ఆమెను పలకరించడానికి చలపతిరావుకి సంకోచం ఉదయించింది. క్షణంలో తనకామె దూరం అయినట్లనిపించింది.

"భయం తీరిందా?" అని అడిగాడు.

ఆమె అతనిని క్రీగంటచూచి, సిగ్గుపడింది. అంతలో చిరాకుపడి పమిటె సర్దుకొని కూర్చుంది.

కాస్త దూరంగా చిత్రం షూటింగుకి తయారు చేసుకున్న మోడల్ సెట్ వలె కనుపిస్తూవుంది ఢిల్లీ ప్లేన్....దిగుతూ వుంది. పొలంనుంచి ఇంటికి తిరిగివచ్చే ఎడ్లజంటవలె అవురుమంటూ దిగుతూ వుంది ఆహారాన్ని తన్నుకు పోవడానికి దిగే గ్రద్దకువలె దిగుతూ వుందనికూడా చెప్పుకోవచ్చు.

చల్లనిగాలి వీస్తూవుంది. త్వరలోనే ఢిల్లీలో ఆగబోతున్నాం గదా అని. ఆమెను పలకరించడానికి ప్రయత్నించాడు చలపతిరావు. ఇంతకీ ఆమె పేరే తనకు తెలియదు. పేరు అయినా తెలుసుకుందాం అనుకోవటమే కాదు జరిగిందాన్నిబట్టి ఆ బాధ్యత తనమీద ఉందనుకున్నాడు

కాని అతనికి ఆ అవకాశం దొరకలేదు. ఆమె ఏదో ఆలోచించుకుంటూ తనలోతాను చిరునవ్వులను మలుపు మంటూవుంది. "చూడండీ" అన్నాడు. కాని చూచేది ఏమిలేదు. ఆమె పలుకలేదు పలకరించలేదు. నెమ్మదిగా నవల

తెరిచి చదువుకుంటూవుంది.

ప్లేన్ ఆగింది. ప్రయాణీకులు సుర క్షితంగా జేరాం అనే సంతోషంతో గబ గబా దిగారు. అందరికంటె ముందు ఆమె దిగింది. హడావుడిలో నవల మరచి పోయింది ఆ నవల తీసుకొంటూ, ఉన్నట్టుండి ఆమె ఎందుకంత ముడుచుకు పోయిందా అని ఆలోచించుకొంటూ, చల పతిరావు దిగాడు

ఆమెకు ఎదురుగా ఒక యువకుడు మందహాసం చేసుకొంటూ వచ్చాడు. ఆ యువకుణ్ణి చూసేటప్పటికి ఆమె ఉప్పొంగి పోయింది. పరిసర ప్రాంతాలను మరచి పోయి అతనికి తనచెయ్యి అందించింది. ఏదో మాట్లాడుతూ నుంచుంది. అతను ఇంతింతకళ్లు చేసుకొని వింటున్నాడు. ప్లేన్ ప్రమాదాన్ని గురించి చెపుతూ వుందని ఊహించాడు చలపతిరావు. గతించిన విషయంగనక నవ్వుతూ ఒక జానపద కథను అభివర్ణిస్తున్నట్లు చెపుతూవుంది.

ఇప్పుడు తనేం చెయ్యాలనేది పెద్ద సమస్య అయింది చలపతిరావుకి. ఆమె తనతోపాటు తన మిత్రునిఇంట్లో వచ్చి వుండమన్నది.

కనీసం చెప్పయినా వెళ్దామని వాళ్ళ దగ్గరకు నడిచి నిలబడ్డాడు. పుస్తకం ఇవ్వవలసిన బాధ్యత వొకటి వుండనే ఉన్నది గదా!

"నాతో ఏమన్నా పని వున్నదా?" అని అడిగాడు ఆ యువకుడు.

"లేదు" అని తలవూపి ఆమె వంకకు చూశాడు. ఆమె ఏదో ఒకటి తేల్చి చెపుతుందని ఆశపడ్డాడు. ఆమె వొక పర్యాయం అతనిని నఖశిఖ పర్యంతం చూసింది. అంతే, ఎరగనట్లు మొఖం త్రిప్పి వేసుకొంది. దగ్గరకువెళ్ళి, "పుస్తకము మరిచి పోయారు" అని అందించాడు.

"థ్యాంక్సు" అన్నది మరచిన సామాను తెచ్చిపెట్టిన ఏ పరాయి వాడితోనో అన్నట్లు.

"కారు బయటవుంది. ఇక వెళదామా" ఆమెను ఆ యువకుడు అడిగాడు.

"అలాగే" అన్నదామె. అంతే. చలపతిరావువంక తిరిగన్నా చూడలేదు. వాళ్ళు ఇద్దరూ చెట్టా పట్టాలు పట్టుకొని బయటకు నడిచి వెళ్ళారు. చలపతిరావు నిర్విణ్ణుడై చూస్తూ నిలబడ్డాడు. ఆమె చెప్పిన కృష్ణానందం అతనేనని గ్రహించ డానికి అతనికి ఎక్కువసేపు పట్టలేదు. అయితే మాత్రం? తననింత నిర్లక్ష్యం చేయవలసిన అవసరమేముంది? అంత గాఢమైన గతాన్ని అంత తేలికగా ఎట్లా తుడిచి వెయ్యగలిగింది? తన పరిచయాన్ని అంగీకరించడానికి ఆమె సిగ్గూ, బాధా పడుతున్నట్లు కనిపించింది.

ఎందుకు? తన తప్పేమివుంది,

కాళ్ళు ఈడ్చుకొంటూ బయటకు బయలుదేరాడు చలపతిరావు.



# తెల్ల నల్లి

శాంతమూర్తి

అవి నిజంగా రామనాథానికి దుర్దినాలు.

అప్పులు అందరూ చేస్తారుగాని, రామనాథం తాను తీసుకున్న అప్పులకి వడ్డీలు కట్టడానికి అప్పులు చేస్తున్నాడు. వచ్చే జీతానికీ, అవుతున్న ఖర్చులకీ సంబంధం లేకపోవడంతో భయం భయంగా రోజులు గడుపుతున్నాడు అతను.

అతనికి పరీక్ష పెట్టినట్లుగా ఆ నెల ఇరవై రెండవ తారీకున వచ్చిపడ్డారు బంధువులు. ఒకళ్ళు గాదు యిద్దరు గాదు. నలుగురు. అసలే యింట్లో సరకులు నిండుకున్నాయి. ఒకటో తారీకుకోసం ఎదురుచూస్తున్న సమయంలో వచ్చిన బంధువర్గాన్నిచూసి ఏంచెయ్యాలా అని రామనాథం, అతని భార్యా సతమతమయిపోయారు.

ఇంతలో రామనాథానికి ఒక చిన్న ఆలోచన వచ్చింది. "సుశీలా! నీ వాచీ బాగు చేయించాలన్నావుగా యిలా తే" అన్నాడు.

"ఇప్పుడెందుకండీ! నెలాఖరులో డబ్బులేకుండా వుంటే ఈ వాచి రిపేరు ఎందుకు? తర్వాత యివ్వవచ్చు" అంది సుశీల.

"అదికాదోయ్! ఇప్పుడిస్తే మళ్ళా ఒకటవ తారీకుకి తిరిగి వస్తాడు." అంటూ రామనాథం ఆ వాచీ తీసుకుని బయలుదేరాడు.

అతను వెళ్ళినది వాచీ రిపేరుషాపుకి కాదు. మార్వాడీ వీధికి. ఆ వీధిలో ఎక్కువమంది మార్వాడీలు వున్నారు. వస్తువులను తాకట్టుగా వుంచుకుని డబ్బు అప్పు యివ్వడం వాళ్ళ వృత్తి. కాదు వ్యాపారం.

ఇలాంటి పని అలవాటులేని రామ

నాధం భయంగానే ఒక మార్వాడీ కొట్టు ముందు నిలుచున్నాడు.

ఇతని వాలకం కనిపెట్టి "ఏమి సార్! డబ్బు కావాలా? రండి" అంటూ ఆహ్వానించాడు మార్వాడీ

'అవును' అంటూ అక్కడున్న కుర్చీలో కూలబడ్డాడు రామనాధం తెల్లటి దుప్పటి పరిచిన పరుపుమీద కూర్చున్నాడు మార్వాడీ మనిషి మహతెల్లగా వున్నాడు. అతని మెడలో బంగారుగొలుసు మెరుస్తోంది ఒక పక్కన పెద్ద యినప్పెట్టె. మరో ప్రక్కన త్రాసు వుంది.

"ఏం తెచ్చారు?" అన్నాడు.

జేబులోంచి వాచి తీసియిచ్చాడు రామనాధం.

"ఎంత కావాలి?" అన్నాడు మార్వాడీ మళ్ళా

"యాభై రూపాయలు కావాలి."

కాసేపు వాచీని పరీక్షగా చూపి పరుపు మీదకి అటువైపుకి వంగి బీరువాలోంచి డబ్బుతీసి 43-75 రామనాధం చేతిలో పెట్టాడు అతను.

ఆశ్చర్యపోతూ "యిదేమిటి?" అన్నాడు రామనాధం.

"అవునండీ! వందకి నెలకి పన్నెండున్నర వడ్డీ. అంచేత 50 కి 6-25 అది తగ్గించి మిగిలింది యిచ్చేను" అన్నాడు మార్వాడీ తెల్లగా నవ్వుతూ

ఓరి దుర్మార్గుడా అని మనసులో అనుకుని, అన్యాయం అని పైకి అనబోయి అవసరం తనది కాబట్టి ఆ డబ్బు, రసీదు తీసుకుని బయటపడ్డాడు రామనాధం

ఇంటికి వచ్చిన బంధువులు చిత్రమైన వాళ్ళు 'హైదరాబాదులో టాక్సీ ఎక్కి, చార్మినారు చూడడానికి వెళ్ళాం తెలుసా' అనీ, అక్కడ ఆటోరిక్షాలు తెగ తిరుగుతూవుంటాయి రెండు ఆటోరిక్షాల్లో వెళ్ళి గోల్కొండ చూశాం" అనీ వున్న దానికి రెండింతలు తమ ఊరివాళ్ళకి చెప్పడంకోసం ఎంతో హడావిడిగా తిరిగారు వాళ్ళు. వాళ్ళ గొప్పలు దేముదెరుగు కాని మధ్యలో రామనాధం పని కీచుమంది!

వాళ్ళ ధర్మమా అని వచ్చిన చుట్టాలు 28 తారీకు సాయంత్రం రైలెక్కారు. 7 వ తారీకునాడు సాయంత్రం

మామూలుగానే యింటికి వచ్చాడు రామనాధం. ఇంట్లో ఎలావున్నా ఒంట్లో ఎలావున్నాకూడా తను ఆఫీసునుంచి రాగానే చిరునవ్వుతో ఎదురువచ్చే శ్రీమతి కనిపించలేదు

కారణం ఏమిటా అనుకుంటూ లోపలికి వెడితే పాప పడుకున్న మంచం ప్రక్కన కూర్చొనివుంది సుశీల.

"ఏం సుశీలా ఏమయింది?" అంటూ దగ్గరకు వెళ్ళాడు రామనాధం.

"అమ్మా ఒళ్ళు వేడిగావుంది చూడవే అంటూ స్కూలునుంచి వచ్చింది పాప. చూద్దును గదా ఒళ్లు కాలిపోతోంది. వెంటనే డాక్టరుదగ్గరకు తీసుకెళ్ళాను. ఆయన మందులు రాసిచ్చారు" అంటూ చీటీ అందించింది సుశీల.

"అలాగా! కంగారుపడకు. ఇప్పుడే వెళ్ళి మందులు తీసుకువస్తాను" అంటూ



"నెలచివర్లో రెండువందలు పెట్టి చీరెలు కొంటావా? నలుగురు బిడ్డల తల్లి వయ్యావ్. కొంచెమైనా యింగితం వుండక్కర్లా" శేఖరం భార్య వైపు కోపంగా చూశాడు

"అందరూ కొంటూవుంటే...."

"అందరూ కొంటూవున్నారని కొనెయ్యడమే. మనమేమిటో మన స్థితిగతు లేమిటో ఆలోచించక్కర్లేదూ" శేఖరం భార్యవైపు చిరచిరలాడుతూ, చూశాడు.

ఉన్నవాళ్ళతో నేను పోటీపడలేనండీ. రోజంతా పనిచేసి, ఐదు రూపాయలకన్న అధికంగా గడించలేని మనిషి వందరూపాయలుపెట్టి రెండు వెంకటగిరి చీరెలు నా కళ్ళముందు కొంటూవుంటే, వెయ్యి రూపాయల ఉద్యోగస్థుడి భార్యను, ఆ మనిషిముందు తేలికపడమా, అని వెనకముందు ఆలోచించకుండా రెండు వందలు పెట్టి నేను రెండు పట్టుచీరెలు కొన్నాను. ఆ మనిషి చీరెలు కొన్నందుకు కాదు. వంద రూపాయలనోటు కట్టల మూట వాడివైపు విసిరిన, ఆ పొగరైన తీరుచూపి....

"ఆ మనిషెక్కడో చీకటిజీవికంతో సంపాదించివుంటుంది. ఆలాంటివాళ్ళకు డబ్బు విలువ ఎలా తెలుస్తుంది? శేఖరం చిరాగ్గా భార్యవైపు చూశాడు.

"మీరు అనుకోకుండా అప్పుడప్పుడు కొన్ని మాటలంటూవుంటారు. అవి అక్షరాలా నిజమౌతాయండి. యీ మధ్య అందరూ ఆ మనిషి గురించి, నానారకాలుగా అనుకుంటూవున్నా నేను నమ్మలేదు.

లోకులు కాకులు కదండీ. అందుకే నేను అంతగా వాళ్ళ మాటలను పట్టించుకో లేదు. యీరోజు నా కళ్ళతో చూశాను. ఆ మనిషి ఉనికిలోనే మార్పు వచ్చింది. ఎవ్వరో పెద్ద ఆఫీసరట రాత్రి తొమ్మిది దాటిన తర్వాత, ఆ మనిషి గదిలో దూరు తారట. మొన్నరాత్రి నేనూ చూశాను. ఒక వ్యక్తి కంగారు, కంగారుగా ఆ గది లోకి వెళ్ళడం, మీకు చూపిద్దామను కొన్నాను. యీమధ్య మీరు ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి పది దాటుతుంది. అందువల్ల వీలవడం లేదు.

"ఇంతకు ఎవ్వరా మనిషి" శేఖరం తడబడుతూ భార్యవైపు చూశాడు.

"మీకు తెలుసండీ" సుశీల మెత్తగా నవ్వింది.

"నాకు తెలుసా" శేఖరం సన్నగా కంపిస్తూ భార్యవైపు చూశాడు.

'మీకు తెలుసంటే, అలా తెల్లబోతా రేమిటండీ, తెలియడమంటే. ఆవిడతో మీకు పరిచయం వుందనీ, ఆవిడ చరిత్ర మీకు తెలుసనీ కాదు. మనయింటి ఎదు రుగా వున్న ఆ చిన్నగదిలోకి, ఐదారు నెలల క్రితం ఒక యిరవైఅయిదు సంవ త్సరాల విధవ వచ్చి చేరింది. ఆవిడకు యిద్దరు పిల్లలు, ఒక ముసలితల్లీ వున్నారు. బట్టలు కుట్టి జీవిస్తారు. జీవితం గడపడం చాలా కష్టంగా వుందని, ఆ ముసలావిడ నాతో చాలాసార్లు అంది ఆ విషయం నిజమే. ఆ గదిలోకి వచ్చిన క్రొత్తలో ఒకపూట తినీ, ఒకపూట తినకా కాలం గడిపారు, మూడు నెలలనుండి మను ష్యుల్లో చాలా మార్పువచ్చింది, నెలకు రెండు వెంకటగిరి చీరెలు కొనేస్థితికి వచ్చారు.... అదేమిటండీ మీరలా కొయ్య బారిపోయారు? ఆ బజారుమనిషితో పోటీ పడి నెలకు రెండు పట్టుచీరెలు నేనూ కొంటాననుకున్నారా? నేను నలుగురు బిడ్డలకు తల్లిని. పిచ్చి వ్యామోహాల్లో పడి సంసారాన్ని రచ్చకీడుస్తానా? యీ మధ్య మీ ఖర్చుకూడా మూడువందలు దాటిపోయిందండీ ఆఫీసరన్న తర్వాత, ఫ్రెండ్స్ అనీ, అవనీ యివనీ ఖర్చు లుంటాయనుకొండి. మనం నలుగురు పిల్లలకు తల్లిదండ్రులం. మీరుకూడా యిక నుండి కొంచెం ఖర్చు తగ్గించు కోవడానికి ప్రయత్నించండి' అతి వినయంగా భర్తతో చెప్పి తన పనిలో మునిగిపోయింది సుశీల.

ఆ తర్వాత శేఖరం నెల ఖర్చు పాతిక దాటలేదు.

ఎదురింటి విధవ ఎందువల్లనో వెంకటగిరి చీరెలు కొనడం మానివేసింది.





# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

సారథి వెళ్ళిపోబోయేముందు నా గది లోకి వచ్చాడు. ఎంతో ముఖ్యమైన పని వుంటే తప్ప అతనలా చెప్పకుండా సరాసరి నా గదిలోకి వచ్చేయడు. బట్టలు మార్చుకుందామని ఆల్మైరాలోనుంచి చీర తీసుకోబోతున్న నేను ఆగిపోయాను.

గంటు పెట్టుకున్నట్టు,దురుసుగా,అసంతృప్తిగా నున్న అతని ముఖం చూడగానే నాకు అతను అడగబోయేదేమిటో తెలిసిపోయింది. అయినా తెలియనట్టే అతను ఎందుకు వచ్చాడా అన్నట్టు చూడసాగాను.

"మీనా! నిజం చెప్పు! నువ్వు దారి మధ్యలో దిగిపోయి వెళ్ళింది ఎవరిని కలవటానికి?"

"నేను సమాధానం చెప్పలేని దానిలా చూడసాగాను.

"మనం వెళ్ళేముందు నీకు ఫోన్ వచ్చింది ఫాదర్ దగ్గరనుంచి కాదు. అవునా?"

నేను చూపులు నేలమీదకి మరల్చుకున్నాను.

ఆ క్షణంలో వెయ్యిమంది సారధులయినా నా నోటినుంచి నిజం చెప్పించలేరు!

సారధి క్షణంసేపు నేను జవాబు చెబుతానన్నట్టు ఎదురుచూసాడు

"సమాధానం చెప్పవా" నిష్ఠూరంగా అడిగాడు.

నేను తల ఎత్తలేదు. నేలకి చూపులు అంటుకుపోయినదానిలా అలాగే క్రిందకి చూస్తూ నిలబడ్డాను

సారధి బుసలు కొడుతున్నట్టుగా పెద్దగా వూపిరిపీల్చి వదిలాడు.

"మీనా! యిదివరకు ఎప్పుడైనా నీకు

చెప్పానో లేదో! ఇప్పుడు చెబుతున్నాను. బాగా గుర్తుంచుకో! నేను నిజాన్ని సహించగలను! నే నీ మోసాన్ని కించిత్తు కూడా భరించలేను ఒకసారి నా మనసు విరిగిందంటే ఆ మనుష్యులకి చాలా దూరంగా వుంటాను నువ్వేం చెప్లాడక పోతేనూ ఆంటీ అశోక్‌నగర్‌లో నీతో చూసిన వ్యక్తి నిజమేనని నమ్మాల్సి వస్తుంది.''

దానికి కూడా నేను జవాబు చెప్పలేదు నన్ను కాదన్నట్టు వూరుకుండిపోయాను.

''సరే. మధ్యలో అనవసరంగా మా ఆంటీని ఎందుకు ఫూల్ చేస్తావు! ఆ పెద్ద మనిషి ఎవరో నువ్వు ఆట్టేకాలం దాచ లేవు. నువ్వు చెప్పనంత మాత్రాన తెలుసుకోలేని వాజమ్మని కాదు నేను ''

గబగబా కోపంగా అనేసిన సారథి గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

నేను కొద్దిసేపు అక్కడే అచేతనంగా నిలబడిపోయాను

నా కప్పుడప్పుడే బట్టలు మార్చుకోవాలని అనిపించలేదు. చేతిలో చీర మంచం మీద గిరాటువేసి వచ్చి కిటికీదగ్గర నిల బడ్డాను.

''నేను నిజాన్ని సహించగలను! కానీ మోసాన్ని భరించలేను '' సారథి అన్నమాటలు చెవుల్లో గింగురుమన్నాయి సారథికి యిదంతా చెప్పేస్తే! అతను నాకు యిందులో సాయం చెస్తాడా! అతని అండ నాకు లభిస్తుందా!

ఆ రాత్రంతా బాగా ఆలోచించిన నేను మర్నాడు మామ యింటికి నాతోపాటు రాజుని తీసుకెళ్ళకుండా నేను ఒక్క దాన్నే వెళ్ళటానికి నిశ్చయించుకున్నాను. అది అన్యాయానికి ఎదురు చెప్పలేదు. దాని మొహమాటం నాకు తెలుసు రాజుని తీసుకువెళ్ళకపోతే కృష్ణకి ఆగ్రహం వచ్చే మాట నిజమే! కాని అది భరించడానికి నేను సిద్ధం అయాను. నా ప్రాణమిత్రురాలిలా అయిన రాజుకోసం ఎంత కష్టమైనా నేను కిమ్మనకుండా వూరుకోటానికి నిశ్చయించుకున్నాను. రాజుని చూసిన క్షణం ఎంత మహాత్తరమైనదో కానీ మా మధ్య స్నేహబంధం నానాటికీ బలపడుతోంది. అదికూడా నాతో సమంగా, సుఖంగా, ఆనందంగా వుండాలనే కాంక్షకి నేను లొంగిపోసాగాను.

"సృష్టిలో తీయని స్నేహమేనోయ్!" అని చెప్పిన వాళ్ళకి మనసారా అంజలి ఘటించి నిజం సుమా అని ఒప్పుకోవాలని పిస్తోంది.

మర్నాడు—మధ్యాహ్నం అయింది. అమ్మకి జ్వరం, జలుబు నాస్త తగినాయి. డాక్టరువచ్చి యింజక్షన్ యిచ్చి వెళ్ళాడు.

ఈ రోజు—రేపు కూడా బాగా రెస్ట్ తీసుకోవాలని చెప్పాడు.

అక్షరాలా ఆయన సలహాని అమలు పరచే అమ్మ నిద్రపోతోంది.

ఆవిడ గది తలుపులు చేరవేసి వున్నాయి. రాజు భోజనాల గదిలో



యువ






తలనొప్పి బిళ్లను వేసుకొనుటకు భయపడి మీరు ఎన్ని సార్లు తలనొప్పిని ఎక్కువ సేపు అనుభవించేరు?

అవేదన్ మీ తలనొప్పికి నిరపాయమైనది. ఎందుకంటె, దానిలో ఆశ్చర్యకరమైన ఎపెప్ ఉంది. అవేదన్‌తో చికాకైన చెడు ఫలితములు కలుగవు. దానితో ఉపశమనము కలుగుతుంది—త్వరగా మరియు నిశ్చయముగా.

కనుక తలనొప్పిని పోగొట్టుకోండి—నిరపాయముగా.

జలుబు, ఫ్లూ, ఇతర నొప్పులు కూడ దీనితో పోతాయి.

ఎపెప్‌గల అవేదన్‌ను వాడండి.




ఆశ్చర్యకరమైన ఎపెప్‌గల అవేదన్ తలనొప్పి, జలుబు ఫ్లూలకు నిరపాయమైన, నిశ్చయమైన ఉపశమనమును కలిగిస్తుంది.

SQUIBB SARABHAI CHEMICALS

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు చిహ్నము. దీని లైసెన్సుదారు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi HPMA 37A/70 TEL




కూర్చుని తను యీ మధ్య కొత్తగా నేర్చుకుంటున్న స్వెట్టర్ అల్లుతోంది.

పని అంతా అయిపోవటంవల్ల తాయారమ్మ వంటయింటి గుమ్మం మీద తల ఆన్చి పడుకొని కునుకుతీస్తోంది. నాన్నగారెలాగూ ఇంట్లో లేరు.

అందువల్ల నేను మెల్లగా ఇంట్లోంచి జారుకోవటం ఎవరూ గమనించలేదు.

నేను మామి ఇంటికి వచ్చేసరికి అప్పటికే కృష్ణ వచ్చేశాడు. వరండాలో కుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నాడు.

గేటు తెరవగానే అతన్ని అలా చూసిన నేను, గబగబా పరుగెత్తినట్టుగా వెళ్ళి వరండా మెట్లెక్కుతూ, "ఆలస్యం చేసానా! ఎంతసేపయింది నువ్వు వచ్చి!" అన్నాను.

"ఇప్పుడే. రాజు ఏది?" అన్నాడు.

"రాలేదు!"

"రాలేదూ! ఎందుకని?" అతని ముఖంలోకి ఆగ్రహంపైకి రావటం నేను గమనిస్తూనే వున్నాను.

"దానికి రేడియోస్టేషన్‌లో రికార్డింగ్ వుంది. అక్కడకి వెళ్తోంది." అన్నాను

కృష్ణ కొత్త విషయం వింటున్నట్టుగా చూసాడు.

ఇంతలో లోపలకి నామాట వినిపించింది కాబోలు. మామి గబగబా బైటకి వచ్చింది. చాలా రోజులకి వచ్చినందుకు ఆవిడని మర్చిపోయానని నిష్ఠూరం వేసింది. కుశలప్రశ్నలు వేసింది. కృష్ణ యింతక్రితమే వచ్చాడని, మీనా లేదా అని అడిగితే అసలు వస్తుందనే నాకు తెలియదన్నానని. "వస్తుంది ఇహంకా" అని అతను ఎదురుచూస్తుంటే లోపలకి

# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకుంటే, ఇగుళ్ల బాధలను దంతక్షయాన్నీ అరికట్టుతుంది.

ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్నీ అరికట్టటంలో, ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు వల్ల కలిగిన ఆశ్చర్యకరమైన ఫలితాలను పిన్నలు, పెద్దలు, ఒకే రీతిగా ప్రశంసిస్తూ, అయాచితంగా ప్రశంసా పత్రాలను పంపారు. జెఫ్రీ మానర్స్ అండ్ కో. లి. వారి ఏ కార్యాలయంలోనైనా ఈ ప్రశంసా పత్రాలను చూడవచ్చును.

"ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుకు, ప్రతి రోజూ దానిని వాడమని నిర్దేశించిన వైద్యునికి, నా మనఃపూర్వక కృతజ్ఞతలు....దానిని వాడిన ఫలితంగా, నా 76వ యేట కూడా, నా పళ్లు తీర్చి దిద్దిన వట్టుగా, తళతళలాడుతూ, ఆరోగ్యవంతమైన ఇగుళ్లలో గట్టిగా నిలబడి ఉన్నాయి...."

—విభూతి భూషణ్ ఘోష్, కలకత్తా

"మీ ప్రపంచ ప్రఖ్యాతమైన టూత్‌పేస్టును, చాలా చిన్నతనం నుండి, నియమానుసారంగా వాడుతున్నాను. ఈ నాటికి నా పళ్లనీ చెక్కు చెదరకుండా ఉన్నాయి....అన్నిటి కంటె ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు ఉత్తమమైనదిగా నేను నమ్ముతున్నాను. అది దంత వైద్యునిచే సృష్టింపబడిన టూత్‌పేస్టు కావటమే అందుకు ముఖ్య కారణం...."

—ఎస్. ఎన్. ఛటర్జీ, కోయంబత్తూరు

"Y—11"

సక్రమ దంత సంరక్షణ కోసం, ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టును, ఫోర్‌హాన్స్ డబుల్-ఏక్షన్ టూత్‌బ్రష్‌ను రాత్రి, ప్రొద్దుట ఉపయోగించండి....నియమానుసారంగా మీ దంత వైద్యుని వద్దకు వెళ్లండి!




ఉచితం! "దంతములు ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము ఈ పుస్తకము 10 భాషలలో* లభిస్తుంది. దాని కొరకు, పోస్టు ఖర్చులకై 20 పైసల తపాలా బిళ్లలను, మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ నం. 10031, బొంబాయి-18 పంపండి.

పేరు ______________________ వయస్సు ______

చిరునామా ______________________

* ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతి, ఉరుదు, బెంగాలీ, తమిళం, తెలుగు, మళయాళం, కన్నడ భాషలలో ఏది కావాలో సూచిస్తూ, దాని క్రింద గీత గీయండి.

**ఫోర్‌హాన్స్** దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్‌పేస్టు

90F-182 TEL

వచ్చి కూర్చోమని అహ్వానించానని చెప్పింది. ఆవిడ మాట్లాడుతూనే మధ్య మధ్య కుతూహలంగా కృష్ణవైపు చూడ సాగింది.

మామి నన్ను చెయ్యి పట్టుకుని లోపలకు లాక్కెళ్ళింది. అప్పటికే అక్కడ స్టౌమీద కాఫీ నీళ్ళు మరుగుతున్నాయి. పక్కన స్టీలు గిన్నెలో దోశలపిండి తడిపి వుంది.

మామి నా చెయ్యి పట్టుకుంటూ రహస్యంగా అడిగింది "ఎవరు మీరు? మీనాకి మీరేమవుతారు అని అతన్ని అడిగితే ఫ్రెండ్ అని జవాబు యిచ్చాడు. ఎలాంటి ఫ్రెండ్ అతను?"

ఆవిడ కుతూహలానికి నాకు నవ్వు వచ్చింది.

"అప్పుడు మీయింటి అడ్రస్ యిచ్చి వుత్తరాలు వ్రాసానే, అతను" అన్నాను.

మామి అర్థమైందన్నట్టు తల పంకించింది.

నేను బైటకి వచ్చాను. ఆలోచనగా బైటకి చూస్తున్న కృష్ణ నావైపు తిరిగాడు.

"అన్నయ్య వూరినుంచి వస్తే ఒక్క నిముషం మాట్లాడే తీరుబడి కూడా లేకుండా అయిపోయిందన్నమాట రాజు!" అన్నాడు

అతని కంఠంలో ఉరుకోపం, విస్ఫారంగా ప్రతిధ్వనించాయి.

"ప్లీజ్! దాన్ని ఏమీ అనకు! దానికసలు నువ్వు వచ్చినట్టే తెలియదు. నేను చెప్పలేదు." అన్నాను.

కృష్ణ ఆదాసంగతి అన్నట్టు చూసాడు.

"ఈ రాత్రికి వెళ్ళిపోతున్నావా?" అని అడిగాను. మళ్ళీ రేపు రాజుని యిక్కడ తీసుకు రమ్మంటాడో అనే భయంతో.

"వెళ్ళిపోవాలి! ఈపూట నా ప్రయాణం ఆపుకునేందుకు సాధ్యంకాదు. నువ్వు రాజుని రేపుగాని, ఎల్లుండికాని ట్రెయిన్ ఎక్కించి నాకు టెలిగ్రాం యివ్వు. బెజవాడవచ్చి నేను తీసుకు వెళ్తాను"

"నేను పంపను. పంపనని నిన్ననే చెప్పాను. ఆ మాటమీద యిక తర్కం వద్దు" అన్నాను నా మొండితనం అంతా కంఠంలో కనిపింప చేస్తూ.

కృష్ణ విసురుగా చూసాడు. అతనిలో వువ్వెత్తుగా లేచిన కోపం బలవంతంగా దిగమింగినట్టు ముఖమే చెబుతోంది

"నేను మీ యింటికి రాననేగదూ నీ యీ ధైర్యం?" అన్నాడు.

"యిదే నేను ఎన్నిసార్లో అడగాలనుకున్నాను. అవును నిజమే! అదే నా ధైర్యం! నువ్వు మా యింటికి ఎందుకు రావు?"

"నేనిప్పుడు యిక్కడికి గతాన్ని తవ్వుకోటానికి రాలేదు."

"ఎప్పటికైనా తెలుసుకో, రావాల్సిన అవసరం నాకుందిగా! అసలువిషయం




ఏమిటో తెలిసే నేను పెట్టుకున్న కొన్ని కొన్ని ఆలోచన్లు విరమించుకుంటా నేమో!"

"మీ అమ్మకి—నాకు యీ వైరం ఎందుకు ఏర్పడిందో మామయ్య నాకు ఎప్పుడూ చెప్పలేదు!"

"చెప్పలేదు. మా అమ్మతోనే నీకు వైరం!" విచిత్రంగా చూసాను.

"అవును! కొంత కొంత మందికి ప్రాణస్నేహం కలిపిస్తే కొంతమందికి బద్ధవైరం ఏర్పడతుంది. నిజ చెప్పాలంటే మీ అమ్మకి—నాకూ మధ్య పచ్చ గడ్డి వేస్తే భగ్గుమంటుంది. ఈ విషయం నువ్వు ఎప్పుడూ జ్ఞాపకం పెట్టకోవటం మంచిది."

నా మనసు చేదుపదార్థం తిన్నట్టుగా వెగటుగా అయింది. కృష్ణ ధోరణి చూసే నాలోవున్న భ్రమలేవో ఛేదించాలన్నట్టుగా వుంది. కృష్ణ యింత నిర్మోహమాటంగా మీ అమ్మా—నేను ప్రత్యర్థులం అన్నట్టు మాట్లాడటం నాకెలాగో అనిపించసాగింది.

కృష్ణ సీరియస్‌గా అన్నాడు.

"మీనా! నువ్వు నిమ్మలూరు రావటంతో మన కుటుంబాలమధ్య పూర్తిగా తెగిపోయిందనుకున్న బాంధవ్యం మళ్ళీ ముడిపెట్టినట్టు అయింది. నీ రాకవల్ల ముఖ్యంగా అమ్మకి ఎంత సంతృప్తి ఆనందం కలిగాయో చెప్పలేను. ఆ కృతజ్ఞతతోనే నువ్వు చేస్తున్న యీ హితం అంతా భరిస్తున్నానన్న సంగతి మర్చిపోవద్దు. నువ్వు మా యింటికి వచ్చావు కాబట్టి రాజుని మీ యింటికి తీసుకెళ్ళి నాలుగు రోజులు వుంచుకోవాలన్న నీ తహ తహ నాకర్థమైంది సరే! తీసుకెళ్ళావుగా!



## ఇన్నాళ్ళ డబ్బు తలనొప్పి ఇక చాలు!

మాయలూ మంత్రాల భ్రమలు మనకొద్దు. డబ్బు తలనొప్పిని మంత్రదండం త్రిప్పి చిటికలో మటుమాయం చేయడం ఎవరివల్లా కాదు. కాని తలనొప్పి తగ్గించడానికి మాత్రం మార్గదర్శి చిట్‌ఫండ్ మీ కెంతో తోడ్పడుతుంది.

మేం మీతో కూర్చుంటాం. మీ సమస్యలను గురించి చర్చిస్తాం. వాటిని పరిష్కరించడానికి మా శాయశక్తులా కృషిచేస్తాం. మీరు....అడపాదడపా పెద్ద మొత్తాలను జరూరుగా సమకూర్చుకోవలసి వచ్చే పెద్ద వ్యాపారస్తులు కావచ్చును .... పిల్లల చదువు సమస్యతో సతమతమయ్యే ఉద్యోగస్తులు కావచ్చును .... లేదా ఉద్యోగంచేసే యువతులు కావచ్చును. మీ రెవరైనప్పటికీ మీకు మేము వేర్వేరు మార్గాలు చూపగలం. మీ పరిస్థితులకు చక్కగా అనువయే మార్గాన్ని ఎన్నుకొనడంలో తోడ్పడగలం.

డబ్బు ఇన్నాళ్ళుగా తలనొప్పిగా వుంటున్నదని మీరనుకుంటూ వుంటే మార్గదర్శి మనిషితో మాట్లాడండి.

**డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత!**

# మార్గదర్శి

**చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

హైదరాబాదు-1 * విజయవాడ-2 * విశాఖపట్నం-1

kiron

సరికి సరి తీరిపోయింది. రాజు విష యంలో నీతో తర్కం పెట్టుకోవాల్సిన అవసరం నాకేం లేదు. నువ్వు క్షేమంగా పంపనంటే నేను సరాసరి మా యింటికి వచ్చి దాన్ని తీసుకువెళ్ళగలను. నిన్ను కాని—మామయ్యను కాని బాధ పెట్టటం నా అభిమతం కాదు. యిది నువ్వు నా బలహీనతగా మాత్రం తీసుకో వద్దని నా మనవి!''

ఆ ముఖంలో కన్పిస్తున్న తీవ్రతకి అతని మాటల వెనక ప్రతిధ్వనిస్తున్న నిర్మోహ మాటమైన హెచ్చరికకి నేను క్షణంసేపు నిజంగానే తికమక పడ్డాను.

కృష్ణ నవ్వు తెచ్చి పెట్టుకుంటూ అన్నాడు.

''నువ్వు దయయుంచి సాధ్యమై నంత త్వరలో రాజుని పంపివేస్తే నేను కృతజ్ఞుడివి! నీమేలు ఎప్పుడూ మర్చి పోను.''

ఆ తర్వాత మేం ఎక్కువసేపు కూర్చోలేదు. కృష్ణ వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు రాజుని వెంటనే పంపేయ మని ఇంకొకసారి గట్టిగా హెచ్చరించాడు.

మామి టిఫిన్ చేసి నను లోపలకి పిల్చింది. కృష్ణ అప్పటికే వెళ్ళి పోయా డని నేను చెప్పగా తెల్లబోయింది. టిఫిన్ తినకుండా అతన్ని మందలించనందుకు నన్ను మందలించింది తను అవి తయారుచేయటం ఆలస్యం అయిపోయిం దేమోనని నొచ్చుకుంది.

మామి బలవంతంమీద నేను తప్పని సరిగా టిఫిన్ తిని కాఫీ తాగి బైలు దేరాను

మామి యింటినుంచి వస్తుంటే నా కెలాగో అనిపించసాగింది.

నేను చేస్తున్న యీ పని యిటు నాన్నగారికి అటు కృష్ణకి యిద్దరికీ ఏ మాత్రం యిష్టంగా లేదని స్పష్టంగా తెలిసిపోతోంది. ఎన్నడూ లేంది ఈ రోజు కృష్ణ మాటల్లో ని దిన ఒక రక మైన తిరస్కారం నా గుండెలు పిండు తున్నట్టు అనిపించసాగింది.

రాజు శ్రేయస్సుని మనస్ఫూర్తిగా కోరుతున్న నాకు వీళ్ళ అభిప్రాయభేదా లని లక్ష్య పెట్టాల్సిన అవసరం లేదని నిర్లక్ష్యంగా వూరుకోమని నా మనసు పదే పదే సలహాయిస్తోంది ఆ సలహా పాటించటం మినహా వేరే గత్యంతరం తోచలేదు నాకు. నీళ్ళలో దిగేము దు లోతు గురించిన ఆలోచన వుండాలి తీరా దిగిం తర్వాత యింక భయందేని?!

నేను యింట్లో అడుగు పెట్టేసరికి సారధి ముందు హాల్లో కూర్చుని కనిపిం చాడు. యిదివరకు అతను మా యింటికి రావటానికి ఒకవేళ అంటూ వుండేది. అతనికి ఎంత స్వతంత్రంవున్నా, ముందు ఫోన్ చేసి తను వస్తున్నానని తెలియ చేస్తే కాని వచ్చేవాడుకాదు. ఈ మధ్య ఆ సభ్యతకి తిలాంజలి వదిలినట్టున్నాడు. ఎప్పుడంటే అప్పుడు, అతనికి రావాలని

అనిపించిన క్షణంలో మా యింటికి వచ్చే స్తున్నట్టుగా వస్తున్నాడు

అమ్మకి నాన్నగారికి యిది సహజం గానే కనిపించి వుండవచ్చు. కాని నాకు మాత్రం సారధి రాకకి వేరే కారణం కన్పించ సాగింది.

అతను మా యింటికివచ్చి చాలా సేపు అయినట్టుగా అతని కెదురుగా వున్న టీపాయ్ మీద యాష్ ట్రేలో పడివున్న సిగరెట్ పీకలే సాక్ష్యం చెబుతున్నాయి బైటనుంచి లోపలకి అడుగుపెట్టి. అక్కడ అతన్ని చూడగానే ఒక్క క్షణం ఆగిపోయిన నన్ను నఖశిఖ పర్యంతం ఎగా దిగా చూసాడు. ఆ చూపులకి నాకు కంపరం పుట్టింది. ఒళ్ళంతా ముళ్ళు గుచ్చుకున్నట్టుగా అయింది. నేను అతన్ని పలకరించలేదు. అసలు అతన్ని చూడనట్టే ముఖం తిప్పుకుని లోపలకు వెళ్ళిపోయాను

లోపల గదిలోకి అడుగుపెట్టిన నా దగ్గరికి రాజు ఆదుర్దగా వచ్చింది. "వదినా! ఎక్కడికి వెళ్ళావు! ఆయన వచ్చి చాలా సేపయింది "

నేను గయ్ మన్నట్టు లేచాను

"ఎక్కడికి వెళితే నీ కెందుకు! అన్నీ నీకు విన్నవించుకోవాలా! రాజూ! హద్దు మీరి ప్రవర్తించావంటే బాగుండదు వెళ్ళవతలకి." అన్నాను.

'ఛీ-ఛీ! అడగవలసిన అమ్మా నాన్నా ఏమీ అనకపోయినా, మధ్యలో మీ అందరికీ సంజాయిషీ చెప్పలేక చచ్చిపోతున్నాను!" అంటూ విసుక్కున్నాను.

నేను ఎవరిని వుద్దేశించి కావాలని బిగ్గరగా యీ మాటలు అన్నానో ఆవ్యక్తి వినే వుండాలి.

బిత్తరపోయిన రాజు నోటమాట రానిదానిలా, నిశ్చేష్టు రాలయినట్టు చూడ సాగింది చూస్తూండగానే దాని కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. చిన్నబోయిన దాని ముఖం చూడగానే నా మనసు రెప రెప లాడింది. వెంటనే సైగచేసి రహస్యంగా ఏదయినా చెప్పాలనుకున్నాను.

కానీ యింతలో సారధి దూసుకు వచ్చినట్టుగా గదిలోకి రావటంతో ఆగిపోయాను.

అనవసరంగా ఆ అమ్మాయిమీద విరుచుకు పడ్డావెందుకు? ఏం? ఎక్కడకి వెళ్ళావని అడిగితే తప్పేమిటి!

నేను అడుగుతున్నానిప్పుడు. వేళకాని యీ వేళప్పుడు నువ్వెక్కడికి వెళ్ళావు? ఇది అడిగే హక్కు—అధికారం ఆ అమ్మాయికి లేకపోతే నాకున్నాయిగా!"

నాకు వెంటనే నోట్లోంచి ఎలాటి మాటా రాలేదు. సారధి యిలా రంగంలోకి దిగి నన్ను నిలదీస్తాడని అనుకోలేదు.

మా మాటలకి దూరంగావున్న గదిలో పడుకున్న అమ్మకి మెలకువ వచ్చినట్టుంది.

"ఏమిటే మీనా! ఎవరామాట్లాడేది?" అంటూ నీరసంగా పిల్చింది



చూడండి, మీకే తెలుస్తుంది...
సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

నేను సారధివంక ఎర్రగా చూపి, అతని మాటలకి జవాబు చెప్పాల్సిన అవసరంలేనిదానిలా అక్కడ నుంచి వచ్చేశాను. అమ్మ గదిలోకి వస్తూనే, ఫిర్యాదుగా అన్నాను.

"చూడు మమ్మీ! రాజు అల్లుతున్న స్వెట్టర్‌కి పింక్ కలర్ వూలు అయిపోవచ్చింది. అంటే.వూరికే కూర్చున్న నేను అది దొరుకుతుందేమో తెద్దామని అలా బజారుకి వెళ్ళాను. ఇంతలో సారధి వచ్చాట్ట!

నేను రాగానే వీధి వాకిట్లో నిలబెట్టి 'ఎక్కడికి వెళ్ళావు నువ్వు' అంటూ నిలదీస్తున్నాడు. అడిగినందుకు కాదు మమ్మీ! ఆ అడగటంలో ఏమిటో ద్వంద్వార్థం! నేనేదో తప్పుపని చేస్తుంటే పట్టుకున్న పెదమనిషిలా మాట్లాడుతుంటే నాకు ఒళ్ళు మండింది. అందుకని—నేనెక్కడికి వెళ్ళిందీ నీ కనవసరం అని చెప్పాను."

అమ్మ నా వంక కోపంగా చూపింది, మందలింపుగా అంది.

"నీకు బొత్తిగా బుద్ధి అనేదే లేదే మీనా! అతనితో మాట్లాడే తీరేనా అది? ఒకవేళ—ఎప్పుడూ ఎక్కడికీ ఒంటరిగా వెళ్ళవుకాబట్టి అలా అడిగాడేమో! అందులో తప్పేముంది! కాస్త మెల్లగా సమాధానం చెప్పుకోవద్దూ! నీ కెప్పటికి జ్ఞానం వస్తుందో నా కర్థం గాకుండా ఉంది. కంచంలో అన్నీ అమర్చిపెట్టటం కష్టం కానీ—తన్నుకోవటం ఎంతసేపే! ఏడి అతను! ఇలా పిలు" అంది.

నేను ముఖం తిప్పుకొని నిలబడ్డాను.

"పిలవ్వూ! నీ యీ మొండితనంతోనే ఎప్పుడో నా పీకలమీదికి తెస్తావు. రాజూ! రాజూ!" అంటూ కేకలు పెట్టింది.

రాజు నిశ్శబ్దంగా గదిలోకి వచ్చింది.

"సారధిని ఇలా రమ్మనమను. నేను పిలుస్తున్నానని చెప్పు."

"ఆయన లేరు వెళ్ళిపోయారు." చిన్న గొంతుతో అంది రాజు.

"వెళ్ళిపోయాడా!" అమ్మ ముఖంలో చెప్పలేనంత ఆవేదన కనిపించింది. ఒక్కసారి నీరసంగా వెనక్కి దిళ్ళకి జారగిలబడింది.

"ఖర్మ! రామ! రామ! ఒక్కరోజు ఒంట్లో బాగాలేకపోతే ఏదో ఒకటి జరగక మానదు కదా! సాధ్యమయినంత త్వరలో ఆ మూడుముళ్లూ వేయిస్తేనేకానీ నావేదన తగ్గదు. అప్పుడుకానీ కంటినిండా నాకు నిద్రరాదు" అంటూ నిట్టూర్పు విడిచింది.

ఇంకా అక్కడే నిలబడి వున్న నన్ను చూసి శివం ఎత్తినదానిలా అరిచింది. "సిగ్గులేకుండా దిష్టిబొమ్మలా నా ఎదుట నిలబడ్డావే? ఫో! అవతలకి! చేసావుగా ఘనకార్యం! నేను వచ్చిన తర్వాతకాని నా యీ తాపత్రయం ఏమిటో, ఎవతి కోసమో నీకు తెలిసిరాదు. నీకు జ్ఞానం రావటం యీ జన్మకి నేను చూడను."

నేను మెల్లగా ఇవతలకి వచ్చేశాను.

కొద్దిసేపయిం తర్వాత నా గదిలోకి

# భారతదేశంలో ప్రథమ పర్యాయం!

# క్రొత్త గోడల కొరకు క్రొంగ్రొత్త రంగు -

# డెకోప్లాస్ట్

ప్రైమరుతో పని లేకుండానే, క్రొత్త ప్లాస్టరు మీద కూడా వెయ్య వచ్చును.
ఎండలలో, వానలలో ఏళ్ల తరబడి నిలిచి ఉంటుంది.




సిమెంటు రంగులతో
పోల్చి చూస్తే:

- □ కూలి ఖర్చు 40% తక్కువ!
- □ రంగు వేయుటకు, 7 పనులకు బదులు 2 పనులే చాలు!
- □ 6 రెట్ల ఎక్కువ త్వరగా రంగు వేయవచ్చును!

డెకోప్లాస్ట్ వేసే పైతలో,
మెటికేట్ కలిపి వసంతకాల
40 రోజులు వెంటనే తయారు
చేయవచ్చును. దీనికి తోడు,
6 ముదురు పక్కా రంగులు
వాడకానికి తయారుగా లభిస్తాయి.

రంగులు మిళిత రంగాల లోకానికి: **ఏషియన్ పెయింట్స్**

వచ్చాను. అక్కడ రాజు నా టేబిల్ మీద అవీ ఇవీ సర్దుతోంది. ఆ సర్దటం అనేది కేవలం నెపం అని, చీరకొంగుతో అది కళ్ళు తుడుచుకోవటంతోనే నాకు అర్థమైంది

రాజు దగ్గరగా వచ్చి భుజాలచుట్టూ చేయి వేశాను. అది నా చేయి వదిలించుకుని దూరంగా వెళ్ళింది. అక్కడ అంత క్రితం నేను విడిచి పడేసిన చీర మడత పెట్ట సాగింది. నేను దగ్గరకివెళ్ళి ఆ చీర లాక్కున్నాను.

''కోపం వచ్చిందా నామీద'' అన్నాను.

రాజు నావైపు సొంతం తిరగకుండానే హఠాత్తుగా అనేసింది.

''వదినా! నేను వెళ్ళిపోతాను! వచ్చి చాలా రోజులైంది.''

నేను రాజుని బలవంతంగా చేయిపట్టి మంచంమీద కూర్చోపెట్టాను. జరిగిందంతా క్లుప్తంగా చెప్పాను. రాజు సంభ్రమంగా చూపింది.

''అన్నయ్య వచ్చాడా! అదేమిటి! నాకు చెప్పనేలేదే?''

''చెబితే జరిగేదేమిటో నాకు తెలుసుగా!''

''అయితే— ఈరోజు — విన్న నువ్వు రహస్యంగా ఇలా పారిపోయింది అన్నయ్యని కలుసుకోటానికా?''

అవునన్నట్టు తల వూపాను.

రాజేశ్వరి నా వైపు చూస్తూ కుతూహలంగా నవ్వింది.

''బాగుంది! నువ్వు ఇంకెవరినో కలుసుకోటానికి వెళ్తున్నావని సారధి అగ్గిమీద గుగ్గిలం అవుతున్నాడు ''

రాజు హఠాత్తుగా నా రెండు చేతులూ పట్టుకుంది

వదినా! ఇంతక్రితం నువ్వు లేనప్పుడు ఏం జరిగిందో తెలుసా! అత్తయ్య నిద్రపోతుందా! సారధి వచ్చాడు. నీ కోసం ఇల్లంతా గాలించాను. నువ్వు కనిపించలేదు. నువ్వు లేవని చెప్పినా అతను వెళ్ళిపోలేదు, కూర్చున్నాడు. నన్ను పిలిచి మంచినీళ్ల కావాలని అడిగాడు. తీసుకెళ్ళి ఇచ్చాను. మీనా ఎక్కడికి వెళ్ళిందో నిజంగా తెలియదా అని మరీమరీ అడిగాడు. నిజంగా తెలియదని చెప్పాను. నన్ను కూర్చోమని నాతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని అన్నాడు. నేను కూర్చున్నాను

"మిమ్మల్ని ఒక సాయం కోరుతాను. చేసి పెడ్తారా?'' అన్నాడు. నావల్ల అయేదయితే చేస్తానన్నాను

"ఈ మధ్య మీనా ప్రవర్తన చాలా విచిత్రంగా ఉంది. ఆ అమ్మాయి మనసులో ఇంకెవరో ఉన్నారని నా అనుమానం. నా యీ అనుమానం నిజమో, అబద్ధమో దయయుంచి మీరు నిర్ధారణచేసి చెప్పాలి." అన్నాడు. నాకు గాభరా వేసింది. ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

"ఈ ఒక్కసాయం మీరు నాకు తప్పక చేయాలి. మీ మేలు ఆ జన్మాంతం

మర్చిపోను. నేనేం చెల్లని కానీని కాదు మీనాని బలవంతంగా అంటగట్టుకోటానికి అన్నాను'' నేను చూస్తానులెండి అనే వరకూ వదలలేదు. పైనుంచి, ''యీ సంగతి మీనాకికాని — కృష్ణవేణమ్మ గారికికాని, తెలియనివ్వద్దు ఈ రహస్యం మన ఇద్దరిది, మన మధ్యనే ఉంచ నివ్వండి. ఉంచుతానని ఒట్టు వెయ్యండి నాకు అంటూ చేయి జావాడు. నేను ఒట్టు వేయలేదు కాని తెలుసుకుంటానని మాట ఇచ్చాను.'' గబగబా వూపిరి పీలుకో కుండా ఒక్కగుక్కలో చెప్పినట్టు చెప్పే సింది.

నేను చాలా కొత్త విషయం వింటు న్నట్టు దిగ్భ్రమగా చూశాను. ఒకపక్క రాజు ఇలా నిష్కల్మషంగా చెప్పినందుకు సంతోషం కలిగింది ఇంకో పక్క సారధి అలా రాజుని అడిగినందుకు ఒళ్లు మండింది. యీ అతినాగరికతకి అలవాటు పడినవాళ్లు ఇంతే! సూటిగా ఏదీ అడగ లేరు అనిపించింది.

రాని నవ్వు తెచ్చి పెట్టుకుంటూ అన్నాను.

"యింకేం మరి! నా ఆ్రఫెండ్ మీ అన్నయ్య అని చెప్పేయి.'' అన్నాను.

''ఛ! అదేం మాటలు వదినా! మా అన్నయ్య నాకు పరాయివాడా! మీ యిద్దరి మధ్యా కూడనిది ఏముంది?'' రాజు ముఖం అంతలోకే చిన్నబోయింది.

''ఏమిటో! మన రెండు కుటుంబాలకి ఎందుకు పడదో తెలియదు గానీ. లేక పోతే నువ్వు, అన్నయ్య మేనత్త మేన మామ బిడ్డలు కాదా! మేనత్త మేనమామ బిడ్డలు సరదాగా, చనువుగా వుండటం లోకంలో జరిగే సంగతేనయ్యె, వదినా! అన్నయ్య యిక్కడికి వచ్చికూడా నన్ను చూడకుండా వెళ్ళి పోయాడేం? నామీద కోపం రాలేదు కదా!''

''అహహ, అదేంకాదు, నిన్ను వుత్తరం వ్రాయమన్నాడు మళ్లీ నెలా ఖరుకి వస్తాట్ట'' అన్నాను. రాజుకి నా మాటల్లో కృష్ణ దాన్ని పంపమని వత్తిడి చేసిన సంగతి చెప్పలేదు.

ఆరాత్రి — నేను పడుకున్నాను. రాజు యింకా పడుకోటానికి రాలేదు. అమ్మ గదిలో ఏదో పనిచేస్తోంది.

ఇంతలో తాయారమ్మ ''అమ్మాయి గారూ! వక్కపలుకులుంటే పెట్టండమ్మా!'' అంటూ నా గదిలోకి వచ్చింది.

నాకు ఆశ్చర్యం వేసింది నేనెప్పుడూ వక్క తినను! యిది ఆవిడకి తెలుసు. ఆవిడ వచ్చింది వక్కపలుకులకోసం కాదని నాకు తెలిసింది ఆవిడ నా మంచందగ్గరికి వచ్చేముందు మళ్ళీ గుమ్మం దగ్గరకి వెళ్ళి ఒకసారి అటు యిటు బైటకి తొంగి చూసి మరీ వచ్చింది.

ఆవిడ యీ ధోరణి నాకు తెలిసిందే! అతిముఖ్యమైన రహస్యం ఏదో చెప్ప టానికి వచ్చిందని గ్రహించాను.

ఏమిటి? అని అడిగాను.

కంఠం తగ్గించి నాకు ఒక్కదానికీ వినపడేంత మెల్లగా చెప్పింది

"అమ్మాయిగారూ! పెద్దదాన్ని చెబుతున్నాను! నాతుమాట ఎప్పుడూ అసత్యం కాదు మీరు పాముకి పాలు పోస్తున్నారు.' అంది కళ్ళు తిప్పుతూ,

"అంటే?" అన్నాను.

"మీరు నా మాట విని తక్షణం ఆ రాజేశ్వరిని యింట్లోంచి పంపేయండి. అంది,

"ఏం? ఏమైంది?"

"ఏమైందని ఇంకా మెల్లగా అడుగుతున్నారు? కొంపలంటుకు పోతుంటే!"

"అసలు విషయం ఏమిటో చెప్పండి"

"విసుక్కోకండి. మరి! పెద్ద ముండని! మీ నుప్పూ పలుసూ తిన్న విశ్వాసం వుంది కాబట్టి ఇలా చెబుతున్నా. మధ్యాహ్నం మీరలా బజారుకి వెళ్ళా రా? అల్లుడుగారు వచ్చారు. కునుకు తీద్దామని గడపమీద తలపెట్టుకుని పడుకున్నానే గానీ కంటికి నిద్ర పట్టలేదు అల్లుడుగారు మీరు లేరంటే వెళ్ళిపోవచ్చా? వెళ్ళలేదు. పోనీ మీ కోసం చూస్తున్నారేమో అనుకుంటే ఏ పుస్తకమో పుచ్చుకుని కూర్చోవచ్చా! అడలేదు, ఆవిడగారినుంచి నీళ్ళు కావాలని అడిగారు. మంచినీళ్ళు తీసుకెళ్ళిన మహాతల్లి ఎంతకీ రాదే! నేను నిద్రపోతున్నానని అనుకుంది కాబోలు. ఏం చేస్తోంది చెప్మా అని మెల్లగా లేచి వెళ్ళి చూశాను, యిద్దరూ ఏమిటో మాట్లాడుతున్నారు. అల్లుడుగారు ఏమిటోగాని చేయి చాచి ఒట్టు వేయమంటున్నారు ఈ కులుకులాడి వగలుపోతూ తల తిప్పుతోంది"

చేయి తిప్పుతూ, కంఠం తగ్గించి, అతిరహస్యంగా చెబుతున్న ఆవిడధోరణికి నాకు ఫక్కుమని నవ్వు వచ్చింది, కానీ ఎలాగో నిగ్రహించుకున్నాను. ఆవిడ ఏ ఉద్దేశ్యంతో యీ సమాచారం నాకు చేరవేసిందో ఆ అర్థం నా మనసు మెరపులా పసిగట్టేసింది. రాజేశ్వరి యీ మధ్య మరీ ఆవిడకి కంట్లో నలుసులా అయింది ఇన్నాళ్ళూ స్వామిభక్తి పరాయణతతో, అమ్మ మనసు గెల్చుకుని, ఆవిడ దగ్గర తను మినహా ఇంకెవరూ అలాటి స్థానం సంపాయించుకోలేరని అతిశయంగా వుంటూ వచ్చిన ఆవిడకి రాజేశ్వరి రాక గొడ్డలిపెట్టు అయింది. రాజేశ్వరి నిజంగా దిక్కూ, మొక్కూ లేని పిల్లని, ఈ ఇంట్లో శాశ్వతంగా వుండిపోతుందని ఆవిడ భయం వయసు ఉడిగిపోతున్న యీ దినాల్లో చాకిరీ అంతగా చేయలేని తనని రాజేశ్వరి ఆసరా చూసుకుని అమ్మ ఎక్కడ వెళ్ళగొడ్తుందోనని ఆవిడకి మనసులో శంక యేర్పడింది. దాంతో తన ప్రత్యర్థిగా భావిస్తున్న రాజు మీద ఆవిడ చిటపటలాడసాగింది.

పరధ్యానంగా అయిన నన్ను చేయిమీద తడుతూ, "అమ్మాయిగారూ మీరు అమాయకులు! మీ క్షేమంకోరి చెబుతున్నాను

అన్యధా భావించకండి సుమా!" అంది.

"అబ్బెబ్బె! అదేంకాదు! రాజేశ్వరి యింత నమ్మకద్రోహం తల పెట్టిందంటే నాకు మతిపోయినట్టుగా వుంది. అయినా నా కాబోయే భర్త కాదా; సారధికి కూడా యిదేం బుద్ధి చెప్పండి."

"అమ్మమ్మ! అంతమాట అనకండి! అల్లుడిగారినంటే నేను వూరుకోను. ఎంతయినా మగవాళ్లు వాళ్ళకి కాస్తో—కూస్తో—చపలత్వం వుంటుంది మరి! మన సొమ్మని జాగ్రత్త చేసుకునే నైపుణ్యం మనకి వుండాలి" సారధి తరఫున వకాల్తా పుచ్చుకున్నట్టు మాట్లాడింది.

నేను ఆమె చేతులు పట్టుకుని ప్రాధేయ పడుతున్నట్టుగా అన్నాను.

"తాయారమ్మగారూ! మీరంటే నాకెక్కడలేని గౌరవం వుంది. అమ్మ మాట మీదకూడా లేనంత గురి మీమాటమీద వుంది.

యికనుంచి మీదే భారం! సారధిని—రాజుని ఒకకంట కనిపెట్టి చూస్తూ వుండండి. అమ్మకి యిప్పుడప్పుడే చెప్పద్దు. మీకు తెలుసుగా! మరి మనం రాజుమీద ఏం చెప్పినా చెవి ఎక్కదు. సమయం చూసుకుని పట్టుపడేలా చేసి ఆ దుర్బుద్ధి కళ్ళతో చూడమని చూపిద్దాం. అప్పుడు అమ్మ రాజుని యింట్లోంచి బైటకి గెంటక తప్పదు." అన్నాను.

తాయారమ్మ ముఖం చింపిరి చాటలా అయింది.

"అలాగే! అలాగే! మీ రన్నది నిజమే సుమా! ఎన్ని చెప్పినా లాభం వుండదు. కళ్ళతో చూసేలా చేయాలి మీరుకూడా ఆ పిల్లని ఓకంట కనిపెట్టి వుండండి" అంటూ హెచ్చరించింది.

"చూడకుండా వుంటానా! ఎంత సం! ఎంత నాటకం!"

పళ్ళు నూరుతూ ఆగ్రహం చూపించాను.

"తిన్నయింటి వాసాలు లెక్కపెట్టటం అంటారు యిదే కాబోలు" అన్నాను

"ఆ! ఆ! సరిగ్గా అంతేనండి" అంటూ వెళ్ళిపోయింది

అమ్మ! తాయారమ్మా! చెప్పుడు మాటలు వినేవాళ్ళు వుండాలి కాని నీలాంటి వాళ్ళు కొంపలు తీస్తారు అనుకున్నాను.

* * *

పై సంఘటన జరిగిన తర్వాత దాదాపు 15 రోజులపాటు సారథి మా యింటికి రాలేదు. అతనికి బాగా కోపం వచ్చినట్టు ఇంట్లో అందరికీ తెలిసింది. ఈ విషయంలో అమ్మ నా మీద నేరం మోపుతూ నాన్నగారికి యిచ్చిన ఉపన్యాసం వినితీరాల్సిందే! పిల్లలకి క్రమశిక్షణ అలవడాలంటే తలిదండ్రు లిద్దరూ సమానమైన బాధ్యతతో ప్రవర్తించాలిట భార్యాభర్తల్లో ఏ ఒక్కరికి యింగిత జ్ఞానం లేకపోయినా పిల్లలు యిష్టం వచ్చిన వేషాలు వేస్తారుట! భోజనాలదగ్గర ఆవిడ నామీదమండిపడుతూ నాన్నగారికి అరగంటసేపు ఇచ్చిన లెక్చర్ యొక్క సారాంశం ఏమిటంటే—ఇదంతా నాన్నగారి అలుసువల్ల వచ్చిన అనర్థంట! ఆయన అండ చూసుకొనే నేనిలా యిష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తున్నానట! నాన్నగారు ఎప్పటిలాగానే భోజనంచేస్తూ మౌనంగా యిదంతా విన్నారు. మధ్య మధ్యలో ఒకటి రెండుసార్లు మాత్రం విన్నావా అన్నట్టు నా వైపు చూశారు. నేరంచేసిన దాన్ని నేనయితే అమ్మ నాన్నగారిమీద విరుచుకుపడటం నాకేం నచ్చలేదు అన్యాయంగా ఆయనమీద నేరం వేసి సాధిస్తుంటే నాకు చాల బాధ వేసింది.

చివరికి—మర్నాడు—అమ్మ యేం సంజాయిషీ చెప్పుకుందో, నాన్నగారు ఏం నచ్చచెప్పారో తెలియదుకానీ 15 రోజుల అనంతరం సారథి మా యింటికి వచ్చాడు. అమ్మ ఆ రాత్రి అతన్ని భోజనానికి రమ్మనమని, ఎంతో ఆర్భాటంగా అతని కిష్టమైన పిండివంటలు చేయించి విందు చేసింది భోజనానికి సారథితోపాటు మిసెస్ లింగాన్ని కూడా ఆహ్వానించింది. కానీ ఎందువల్లనో కానీ ఆవిడ రాలేదు. ఈ మధ్య వాళ్ళయింటికి—మా యింటికి రాకపోకలు కాస్త తగ్గినాయి

కారణం ఫలానా అని తెలియటంలేదు కానీ, అమ్మకి—ఆవిడకి కాస్త చెడినట్లుగానే ఉంది. అలవాటు ప్రకారం అమ్మ సారథి భోజనానికి వచ్చేరోజున తనే

స్వయంగా, చాలా అందంగా వచ్చేట్టు నా జడ అల్లింది ఫలాన నగలు పెట్టుకోమని సూచించింది. ఆవిడ ఫలాన చీర కట్టుకోమని ఒకటికి రెండుసార్లు హెచ్చరిస్తుంటే నా మనసులో కోపంగా అనుకున్నాను "అమ్మా? నువ్వుండే ఆ నగలు అలంకరింప చేయగలవు. చీర కట్టించగలవు కానీ నా ముఖంలోకి చిరునవ్వు ఎలా తెప్పించగలవు! నా ప్రవర్తనని శంకించి, రాజుని నా మీద నిఘావేయమన్న ఆవిడకి నే నెందుకు గౌరవం యివ్వాలి. తనకేదయినా అనుమానం కలిగితే సూటిగా నన్నే అడగవచ్చుగా! మనసులు నిర్మలంగా ఉండాలని, ప్రవర్తన నిష్కళంకంగా ఉండాలని పిల్లకు వల్లించే ఆదర్శాలు కేవలం మాటలవరకేనా! ఆచరణలో అవసరంలేదన్న మాట

భోజనానికి సారధి వచ్చిన కొద్దిసేపటికి నేను తలనొప్పి వచ్చిందని తల పట్టుకుని నీరసంగా కూర్చున్నాను, అమ్మ ఆ సమయంలో నా వైపు చూసిన చూపు యీ జన్మలో మర్చిపోలేను. అమ్మ—నాన్నగారు ఇద్దరూ సారధిని పది సంవత్సరాల అనంతరం విదేశాలనుంచి తిరిగివచ్చిన పెద్దకొడుకుని చూసినట్టు చూశారు. వారి ఆప్యాయతకి కరిగిపోక తప్పలేదు.

వారంరోజుల్లో సారధి అలుక తీరింది. ఎప్పటిలా మా యింటికి రాకపోకలు ప్రారంభించాడు అమ్మ గుండెలమీద

మంచి పెద్ద బరువు దింపుకున్నట్లుగా చూసింది. సారధి ఎందుకి వచ్చి వెళ్ళిన రాత్రే నన్ను పిలిచి గట్టిగా వార్నింగ్ యిచ్చేసింది. "ఇదుగో! జాగ్రత్తగావిను! మళ్ళీ మళ్ళీ పిచ్చి వేషాలు వేసి వెధవ గొడవ ఏమైనా తెచ్చావంటే వూరుకోను. అతని విలువ నీకేం తెలుసు! లక్షమంది గద్దల్లా కాచుకుని కూర్చున్నారు. మిసెస్ లింగానికి ఏ రోగం వచ్చిందో! ఈ మధ్య ఆ జడ్జిగారమ్మాయి సునీతని వెంటేసుకుని తిరుగుతోంది. సారధి నా మాట కాదని వెళ్ళడనే నమ్మకం నాకున్నా—నా ఒక్క—దాని ప్రయత్నం చాలదు. నువ్వు పసిపిల్లవి కాదు నీక్కాబోయే భర్తని నీ వైపు ఆకర్షణ నిలుపుకొనే నేర్పు నీకుండాలి తెలిసిందా!" అంది

తెలిసిందన్నట్టూ తలవూపాను! నాకు ఒళ్ళు మండిపోయింది. అసలు పిచ్చి వేషాలు వేసిన సారధి బాగానే ఉన్నాడు. మధ్యలో నాకు వచ్చినాయి చీవాట్లు!

సారధి నాతో ఎప్పటిలా ఉండాలని ప్రయత్నిస్తున్నా. అది కేవలం నటనేనని అతని కళ్ళలో కన్పిస్తున్న అసంతృప్తిని బట్టి నేను యిట్టే గ్రహించాను. అతనిలా నాకు నటనరాదు అందుకే నేను కూడా ముభావంగా ఉండిపోయేదాన్ని. మా ఇద్దరి మధ్యా అంతంత మాత్రంగా వుండే ఆ చనువు కూడా పోయింది. మా అమ్మ సాధ్యమైనంతవరకూ మా యిద్దరనీ వంటరిగా ఉంచాలని తాపత్రయపడేది. అది మా ప్రాణంమీదకి వచ్చినట్టుగా

ఉండేది. యిద్దరం యేం మాట్లాడాలో తోచని అపరిచిత వ్యక్తుల్లా క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూర్చునేవాళ్ళం.

అమ్మ సాధ్యమైనంత త్వరలో మా యిద్దరి వివాహానికి లగ్నం పెట్టించేయాలని తొందరపడుతోంది. కానీ పురోహితుడు, సారధి—నాది ఇద్దరికీ జాతకాలకి అనుగుణ్యంగా నెల రోజులలోపల లగ్నం లేదన్నాడు. అమ్మకి సాధారణంగా జాతకాల పిచ్చిలేదు. కానీ ఎందుకోగానీ యీ విషయంలో పట్టుపట్టలేదు. "సరి! తర్వాతనే చూడండి" అంది. నెలా 20 రోజుల తర్వాత దివ్యమైన లగ్నం వుందని చెప్పాడు. అమ్మ నాన్న అది నిశ్చయం అనుకున్నారు.

ఈ లోపల ఒక మంచిరోజు చూసి సారధి నాకు నిశ్చయం అయిపోయినట్టు అందరికీ తెలియచేయటానికి అన్నట్లు ఆడంబరంగా ప్రధానం జరపటానికి నిశ్చయించుకుంది. ఈ సారధి కాకపోతే జన్మలో యిక నాకు పెళ్ళి జరగదేమో నన్నట్టు ప్రవర్తిస్తున్న అమ్మ హడావిడి, ఆత్రం చూస్తే నాకు ఆశ్చర్యం—చిరాకు రెండూ కలగసాగినాయి. న్యాయంగా చూస్తే అంతస్తు, ఐశ్వర్యం వున్న నా కోసం సారధి పడిగాపులు కాయాలి. ఛీ—ఛీ! అమ్మ నన్ను లోకువ చేస్తోంది. ఈమధ్య ఆవిడకి లోకజ్ఞానం తరిగిపోతోంది అనుకున్నాను.

ఆరోజు మధ్యాహ్నం చాలా రోజుల

---


## FORM IV
(See Rule 8)

1. Place of Publication ... 1, Arcot Road, Madras-26.
2. Periodicity of its publication ... MONTHLY
3. Printer's Name ... Sri G. VEERA BRAHMAM for Anuradha Acchagam
   Nationality ... INDIAN
   Address ... Anuradha Acchagam, 146, T.H. Road, Madras-21.
4. Publisher's Name ... Sri A. TIRUPATHY RAYUDU for M/s. Yuva Publications.
   Nationality ... INDIAN
   Address ... 2 & 3, Arcot Road, Madras-26.
5. Editor's Name ... Sri CHAKRAPANI (Alias) Sri A.V. SUBBA RAO.
   Nationality ... INDIAN
   Address ... 2 & 3, Arcot Road, Madras-26
6. Owners ... M/s. Yuva Publications, 1, Arcot Road, Madras-26:

*Partners :* *Addresses :*

Sri A. V. Subba Rao (Chakrapani)
Sri A. Sudhakar Rao
Smt. A. Jayalakshmi
Sri A. Chandrasekhara Rao-Minor
Sri A. Rajasekhara Rao-Minor
} 2 & 3, Arcot Road, Madras-26.

I, A. Thirupathy Rayudu hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Madras
Date 1-3-1971

*A. TIRUPATHY RAYUDU*
Signature of Publisher.

తర్వాత అమ్మ క్లబ్‌కి వెళ్ళింది.

ఈ మధ్య క్లబ్‌గురించిన వ్యాపకాలు ఆవిడ చాలా తగ్గించుకుంది నా పెళ్ళిని గురించిన హడావుడిలో తనకి తీరదని నలుగురికీ స్పష్టంగా చెప్పేసింది. యింతవరకూ యీ సిటీలో వ్వరూ చేయనంత ఘనంగా అదొక అపురూపమైన సుందర దృశ్యంగా అందరి మనసుల్లో శాశ్వతంగా నిలిచిపోవాలని ఆవిడ కలలు కంటోంది. ఎంత డబ్బయినా సరే! ఎంత శ్రమ అయినా సరే! యిక ముందు ఎక్కడ ఏ పెళ్ళి జరిగినా అబ్బే! కృష్ణవేణమ్మగారి అమ్మాయి వివాహం జరిగినంత గొప్పగా యిది జరగలేదు అని అందరూ అనుకోవాలని ఆవిడ ఆశ।

రోజు రోజుల్లో యీ పెళ్ళిని గురించిన వర్ణనలే: అమ్మ వయసు మళ్ళిన అనుభవజ్ఞులను పిలిపించి సలహాలు అడుగుతోంది. నా పెళ్ళికి షుమారుగా ఎంత డబ్బు అవుతుందో లెక్కలు వేయసాగిం నాన్నగారు మాత్రం అప్పుడప్పుడు ఉంకా కనం లగ్నమే నిశ్చయించుకోలేదు. ఏమిటి యీ హడావుడి అన్నారు ఆయన వేరే ఆడంబరం అంటే అసలు గిట్టదు।

అమ్మ ఆరోజు తప్పనిసరిగా, ఏదో ముఖ్యమైన పని వుండటంవల్ల క్లబ్‌కి వెళ్ళాల్సి వచ్చింది.

నేను— రాజుముందు హాల్లో కూర్చున్నాను. నేను షిలి ఫేర్ తిరగేస్తున్నాను. రాజేశ్వరి స్వెట్టర్ పూర్తి చేస్తోంది. మళ్ళీ పెళ్ళి దగ్గర పడితే యిది పక్కనపడి అశ్రద్ధ అయిపోతోందని దీని భయం. అందుకే కాస్త సమయం దొరికినా అది చేత్తోపట్టుకుని కూర్చొంటోంది. స్వెట్టర్ అల్లుతున్న రాజు అంది.

"పదినా! అన్నయ్యకి వుత్తరం వ్రాసి అన్ని రోజులు అయింది యింత వరకూ జవాబే రాలేదు' అంది.

కృష్ణ యిక్కడకి వచ్చి వెళ్ళినవెంటనే రాజుచేత నేను వుత్తరం వ్రాయించాను. అందులో యిక్కడ తనకి బాగానే వున్నట్టు యిప్పట్లో తనకి పెళ్ళి యిష్టం లేదని ఆ మాట తల పెట్టొద్దని కోరుతూ వ్రాయించాను. అదే కవరులో నేను కూడా కృష్ణకి వ్రాసిన వుత్తరం జతపర్చాను. నా వుత్తరంలో కృష్ణని మన్నించమని కోరాను, ఒక్క నెల రోజులు వ్యవధియిమ్మని, అప్పటికి రాజుకి నేనేం చూడలేకపోతే నిమ్మలూరు పంపివేస్తానని వ్రాసాను. కావాలని నేనా వుత్తరం బ్రతిమలాడుతున్నట్లుగా వ్రాసాను. ఆ వుత్తరాలు అందించో లేవో. కృష్ణ దగ్గరనుంచి ఎలాటి సమాధానం లేదు అతనికి మా అభిప్రాయం వుత్తరం వ్రాసామన్న సంతృప్తి అని దగ్గున్నంచి. జవాబు రాలేదేమన్న ఆదుర్దా కలుగుతున్నాయి రెండూ కలగుతున్నాయి నాకు. (ఇంకా వుంది)

Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-26
and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam
146, T. H. Road, Madras-21.
Controlling Editor: "CHAKRAPANI"

YUVA March '71
One Rupee & Fifty Paise
Regd. No. M 8647
H 98

